The one and only Magazine devoted to Humour & Music



పేజీలు : 68+8
వెల : రూ.10

# హాసం

హాస్య-సంగీత పత్రిక

1-15 ఫిబ్రవరి 2002

లోపలిపేజీల్లో...
బాపు రాసిన ఆర్టికల్
మల్లాది కామెడీ సీరియల్

సెంటర్‌స్ప్రెడ్‌లో
ప్రియనేస్తమా...
LOVE IS PRECIOUS
చంద్రవంశం
Sensational Family
పాటల పుస్తకాలు

ఇంకా...
బ్రహ్మానందం బర్త్‌డే స్పెషల్


బొమ్మానందం
బాపు బొమ్మకి 'బొమ్మానందం'
టైటిల్ ఏంటా అని ఆశ్చర్యపోకండి.
ఇది బాపు బొమ్మే...కానీ,
బాపు వేసిన బొమ్మకాదు.
'లీలా జనార్దనం' అనే పుస్తకం
కోసం బాపు వేసిన బొమ్మను చూసి
ఇన్‌స్పయిరై
హాస్యనటుడు బ్రహ్మానందం వేసిన
బొమ్మ ఇది. బ్రహ్మానందంలో మరో 'ఆర్టిస్ట్' కూడా
ఉన్నాడని నిరూపించే ఈ బొమ్మని
ఆయన పుట్టిన రోజు (ఫిబ్రవరి 1) సందర్భంగా
అభిమానులకు అందిస్తోంది...
హాసం

హాసం
హాస్య-సంగీత పత్రిక

ఇవీ సంగతులు

Also available on net www.haasam.com

# హాస్యం — సంగీతం



సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'చంద్రవంశం', 'ప్రియనేస్తమా'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో



8 పేజీల ప్రత్యేక కానుక: హిందూస్తానీ సంగీతంపై బాపు వ్యాసం, త్యాగరాజు ఘన పంచరత్నకీర్తనలు




ముఖచిత్రం:ఉదయకిరణ్, గజాలా ('కలుసుకోవాలని' సినిమా నుంచి) కవర్ డిజైన్ :ఈరంకి




సంగీతాన్ని, హాస్యాన్ని ప్రేమించే వాళ్ళందరి
పెదవుల మీద దరహాసం - ఈ 'హాసం' -
ఈ మధ్యకాలంలో నాకు కాపీ దొరక్కపోతే
దొంగిలించాలనేంత కోరిక పుట్టించిన
పత్రిక 'హాసం' -
ఇదే క్వాలిటీని మెయిన్‌టెన్ చేస్తూ సాగాలని
మనస్ఫూర్తిగా కోరుకుంటూ

**-త్రివిక్రమ్, (సినీ సంభాషణల రచయిత)** హైదరాబాద్

సంగీతానికి పెద్ద పీట వేస్తున్న 'హాసం' ప్రతిక అంటే మాకెంతో అభిమానం. 1-15 జనవరి 'హాసం' పత్రికలో ప్రచురించిన 'చిత్రగుప్త' వ్యాసం అలనాటి సంగీత చక్రవర్తి గూర్చి ఎన్నో వివరాలు ఇచ్చింది. 'చిత్రగుప్త' - కుమారులు ఆనంద్ మిలింద్ కూడా సంగీతంలో ప్రముఖ పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. మా అభిరుచులకు తగినట్లుగా హాసం పత్రిక ఉంటోంది. ఎ.ఆర్.రెహమాన్‌ను గూర్చిన అంశాలు కూడా ఆద్యంతం ఆసక్తికరంగా ఉన్నాయి.

-ఎం.డి.ముస్తభీమ్, కొల్లాపూర్

**1-15** జనవరి హాసం సంచికలో తంబింప్రెషన్ హైలెట్. అప్పుడప్పుడూ అక్కడక్కడా చదువుతూనే వున్నా ఒకేసారి ఒకే దగ్గరగా వైవిధ్యమైన హెడ్డింగ్స్‌తో ఇన్ని జోక్స్ అందియ్య గలగటం రీప్రింట్ అయినా హాసంకే చెల్లింది. నిజంగా ఈ జోకులు మార్కెట్‌లో పుంఖానుపుంఖాలుగా దొరుకుతున్నా ఏ జోక్ బుక్కు (మొత్తానికి)కు తీసిపోవు. మీద పెట్టిన సబ్ హెడ్డింగ్ అసలు పుస్తకంలోనివేనా? శివుడు వళ్ళు దులుపుకునే సరికి రాలిన బూడిద, మాస్టారు చెప్పిన స్కోరు, సందేహానంద విసుర్లు, పడిపడీ నవ్విస్తాయి. 'హాసం'కే నిర్వచనమనదగిన జంధ్యాలగారి ఫోటో అలరించింది. ఆయన వ్రాసిన నాటిక ఆనందాన్నిచ్చినా ఆయనలేరే అని బాధ కల్గించింది. వంగర మీద వ్యాసం బాగుంది. ఈ సందర్భంలో ఒక సూచన. ఇటువంటి పాతతరం నటులను పరిచయం చేసినప్పుడు, వారితో నటించి మన మధ్య వున్న సహనటులు కొందరుండచ్చు. (ఉ॥ వంగర గారితో నటించిన అల్లుగారు). ఆ వ్యాసంలో వారి అభిప్రాయాలను కూడా సేకరించి వేస్తే బాగుంటుంది. ఆలోచించండి. రెండు హిట్ సినిమాలు ఈసారి పాటల పుస్తకాలుగా రావడం హర్షనీయం. రాజాగారి స్కిట్‌తో సహా ఇతర శీర్షికలు షరా మామూలే! అంటే ఆనందింపచేశాయని.

-జి.ప్రభాకర్‌రావు, హైదరాబాద్-28

**1-15** జనవరి సంచికలోని శీర్షికలు చదివి ఆనంద భరితుడనైన నేను తెలియజేయు కృతజ్ఞతలు. నా వయసు 57 సంవత్సరాలు. ముఖ్యంగా నా చిన్ననాడు చూసిన నవరంగ్ సినిమాలోని ఆధా హై చంద్రమా... పాటకు సాహిత్య మధురిమలు, దాని అర్థ వివరణ ఎంతో చక్కగా తెలియజేసారు. వారికి షుక్రియా చెప్పక తప్పదు. అట్లాగే సంగీత దర్శకుడు చిత్రగుప్త గురించి, వారి సంగీత ప్రతిభ గురించి చదువుతుంటే ఏదో లోకాలకు వెళ్లినట్లు అనుభూతి కలిపించారు. ముఖ్యంగా హాస్యం కన్నా సంగీతంకు యిస్తున్న ప్రాధాన్యత అపురూపం. అలాగే ఎ.ఆర్. రెహమాన్ మెలోడీస్ పాటలు వివరాలతో ఒకే చోట పొందుపరచడం యువగాయకులకు ఎంతో లాభం. ఆపాత, పాటమధురంలో మీరు యిచ్చే వివరాలు చదువుతుంటే ఎంతో ఆశ్చర్యం ఆనందం కల్గిస్తున్నవి. దేనివాళ్ళు దానికి ఉన్నట్లు మార్కెట్లో హాసం పుస్తకం కోసం ఎదురు చూపులు చూసేవారు తయారు అవకతప్పదు. వంగర వెంకటసుబ్బయ్య గారి గురించి తెలియజేసినందులకు థాంక్స్. చక్రపాణి, మాయాబజార్‌లో ఆయన ధరించిన పాత్రల తీరు గమనించదగినది. ఛల్తీకానామ్ గాడీ, లవ్ ఇన్ సిమ్లా, మొగల్-ఎ - ఆజమ్ మొ॥ గొప్ప, గొప్ప సినిమాల పాటల రచయితల, సంగీత దర్శకుల ప్రతిభా విశేషాలు తెలియ జేయగలరు. మరుగున పడిన కళాకారుల పరి చయం కల్గించి వారి ఉనికిని తెలియజేయగలరు. అనగా కృష్ణకుమారి, దేవిక, ఎల్.విజయలక్ష్మి, షీలా గాయకులు రాజ్‌సీతారాం, సౌందర్యరాజన్ తదితరులు గురించి.

-వి.మోహన్‌బాబు, అవనిగడ్డ

మీ పత్రిక నన్ను చాలా బాగా ఆకట్టుకుంది. వెనకటి విజయచిత్రను చూసిన అనుభూతి కలిగింది. పత్రిక రూపు చాలా వెరయిటీగా వుంది. లోపల సంచికలు, విశేషాలు పాత, కొత్తతరం వాళ్ళ విశేషాలు చాలా బాగున్నాయి. సినిమా పాటలు కేసెట్లలో లభ్యమయ్యే రోజులలో పాటల పుస్తకాలు లభ్యం కావటం దుర్లభం. కాని మీరందిస్తు న్నందుకు చాలా సంతోషం.

-ఆర్.నరసింహమూర్తి, సూర్యాపేట

శ్రీ తనికెళ్ళ భరణిగారికి,

నమస్కారములు, మీ ద్వారా సంగీత ప్రపంచంలో అద్భుతాన్ని సాధించిన మునిపల్లె సుబ్రహ్మణ్య కవి గురించి, ఆధ్యాత్మ రామాయణ కీర్తనల గురించి విని ధన్యులమైనాము. దయచేసి మీ వద్ద గల ఆ పుస్తకం ఎక్కడ లభిస్తుందో తెలియజేయగలరని ప్రార్థిస్తున్నాను. (వీలైతే స్వరములతో) దయచేసి, ఆ పబ్లిషర్ పేరు, అడ్రస్ తెలిపినా చాలును. మీకున్న సాహిత్య, సంగీతాభిలాషకు నిజంగా మా జోహార్లు. మా విన్నపాన్ని మన్నిస్తారని ఆశిస్తూ.

-డా. ఎస్.విజయమోహన్,
ఉప్పల్, హైదరాబాద్

**16-31** జనవరి 2002 'హాసం' సంచికలో 'తనికెళ్ల భరణి గారి రచనలలో మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి స్థాయిని మించి తెలుగు తేనె జాలువారుతోందని' పేరిచర్ల రామకృష్ణంరాజు, ధర్మవరం ప్రయోజన వాక్యంలో మెచ్చుకున్నారు. ఓ రచయిత బాగా రాశాడని చెప్పటానికి, మరో ప్రముఖ రచయిత స్థాయిని కించ పరచనవసరం లేదు. తనికెళ్ల భరణి బాగా రాస్తుండవచ్చు గాని, గురుదేవుల్ని మించి పోయాడనటం భావ్యం కాదు. (ఈ మాటకు భరణి కూడా ఒప్పుకోవచ్చు) అద్వితీయం, అనన్యసాధ్యం అయిన గురుదేవుల జాను తెలుగుస్థాయికి చేరుకోవటమే దుర్లభం. ఇంక మించటం మాట అనూహ్యం. వారి శిష్య కోటి గురుదేవులకు నమస్కరించి, వారి శైలిని ప్రసాదించమని ప్రార్థించి, తమ రచనలను ప్రారంభించారు. (ఆరుద్ర, వేటూరి ఇత్యాదులు) ఇలాంటి అసందర్భపు పోలికలు నాబోటి మల్లాది అభిమానుల్ని చింతాక్రాంతుల్ని చేస్తాయి. భరణీ, నువ్వైనా చెబ్దూ ఇది తగదని.

-కె.వి.యల్. నరసింహ శాస్త్రి,
హైదరాబాద్

'హాసం'లో విడవదగ్గ పేజీ ఒక్కటీ లేదు. పూర్తిగా విలువయిన పత్రిక. 'మీ పద సంపద' శీర్షిక బావుంది. సినీ గీతాల్లోని పదాలకు అర్థం ఒక్కోచోట శ్రోతలకి తెలియదు. అలాంటి సందేహాలకు జవాబుల కోసం ఒక శీర్షిక వుంటే బావుణ్ణు. నాకు తెలియని అర్థం. 'అన్నమయ్య' చిత్రంలో మోహన్ బాబుపై చిత్రీకరించిన పాటలో 'అస్మదీయ' అంటే తెలుసుగాని, 'తస్మదీయ' అంటే ఏమిటో? పాట వింటుంటే 'నీ యొక్క' అని స్ఫురిస్తోంది గాని, అలాంటి శబ్దం ఎక్కడా వినలేదు. (మాయాబజార్‌లో హాస్యానికి 'తసమదీయు'లని కాయిన్ చేశారు. ఆ వివరం వుంది). ఇక్కడి 'తస్మదీయ' ఎక్కడిదో?

-కిల్లంశెట్టి వెంకటరమణ,
జయపురం (ఒరిస్సా)

సంపుటి :1 సంచిక: 9

1-15 ఫిబ్రవరి 2002

పేజీలు: 76

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 9

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

Printed at: Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

Published at: 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500018

Editor: RAJA

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eeenadu Compound
Somajiguda, Hyderabad-82

ఈసారి రిపబ్లిక్ దినోత్సవ సందర్భంగా ప్రకటించిన ఎవార్డులలో సంగీతకారులు చాలామందినే సత్కరించడం జరిగింది. పద్మవిభూషణ్ అవార్డులు లభించిన వారిలో హుబ్బళికి చెందిన హిందూస్తానీ శాస్త్రీయ గాయని గంగూబాయ్ హంగల్, వారణాశికి చెందిన హిందూస్తానీ వాద్యకళాకారుడు పండిట్ కిషన్ మహరాజ్, ముంబయ్ కి చెందిన హిందూస్తానీ గాయని కిషోరీ అమోంకర్ ఉన్నారు. పద్మభూషణ్ లభించిన వారిలో కర్నాటక గాయకుడు కె.జె.యేసుదాస్,ముంబయ్‌కి చెందిన హిందూస్తానీ గాయనీమణులు ప్రభా ఆత్రే, శోభా గుర్తు, తబలా కళాకారుడు జాకీర్ హుస్సేన్ ఉన్నారు. పద్మశ్రీలు లభించిన వారిలో భోపాల్‌కు చెందిన హిందూస్తానీ వాద్యకారుడు ఉస్తాద్ అబుల్ లతీఫ్ ఖాన్, కర్ణాటక సంగీతానికి చెందిన మణి కృష్ణస్వామి, మోహనవీణ సృష్టించిన విశ్వమోహన్ భట్, శ్రీలంకకు చెందిన శాస్త్రీయ సంగీతకారుడు అమరదేవ ఉన్నారు. హాస్యరంగానికి వస్తే గోవాకు చెందిన కార్టూనిస్టు మేరియో మిరాండా, తమిళ హాస్యనటీమణి మనోరమ ఉన్నారు. వీరందరినీ "హాసం" అభినందిస్తున్నది. ఈ సందర్భంలో ఒక విషయం ప్రస్తావించవలసిన అవసరం ఉంది. అవార్డుల విషయం తెలియగానే చాలామంది "హాసం" కు ఫోన్ చేసి "మీ ధర్మమాని ఎవార్డులు వచ్చిన కొంతమంది మహనీయుల గురించి విపులంగా తెలుసుకోగలిగేం. లేకపోతే 'ఈ గంగూబాయ్ హంగల్ ఎవరబ్బా పద్మవిభూషణ్ ఇచ్చారు' అని తప్పకుండా అనుకునేవాళ్లం. మామూలు పత్రికలో ఆవిడ గురించి ఏదైనా వ్యాసం వచ్చినా తక్కిన రాజకీయ సమాచారంలో ఇది మరుగున పడిపోతుంది. మీది ప్రత్యేకంగా సంగీతం గురించిన పత్రిక కాబట్టి మా దృష్టిని ఆకర్షించి మర్చిపోకుండా చేసింది. అలాగే విశ్వమోహన్ భట్ గురించి కూడా మీ పత్రికలో చదివాకనే ఆయనంటే ఎంతో గౌరవం పెరిగింది. ఇప్పుడు ఈ వార్త చదివాక ఆయన పద్మశ్రీకు అర్హుడు అని ఎవరూ చెప్పకుండానే తెలిసింది." అన్నారు. ఈ వ్యాఖ్యలు మాకెంతో స్ఫూర్తినిస్తున్నాయి. ఈనాడు పద్మభూషణ్ బిరుదు లభించిన యేసుదాసు ఇటీవల హైదరాబాదు వచ్చినప్పుడు ఆయనతో ఇంటర్వ్యూ ప్రచురించాం. ఆయన ప్రతిభనే కాక, ఆయన వ్యక్తిత్వాన్ని కూడా పాఠకుల ముందు ఆవిష్కరించాము. అలాగే బాలమురళీకృష్ణ, బిస్మిల్లాఖాన్.. సంగీతాన్ని గురించే కాక, సంగీతకారుల గురించి కూడా పాఠకులకు అవగాహన పెంచి సంగీతంకై ప్రత్యేకంగా ఒక పత్రిక ఉండటంలో ఉన్న ఔచిత్యాన్ని అందరూ గుర్తించేట్లు చేయడం జరుగుతోంది. సంగీతం వింటే చాలు, దాని గురించి వ్యాఖ్యలు అనవసరం అనుకునే వారు ఈసారి పద్మశ్రీ అవార్డు గ్రహీతలలో మ్యూజికాలజిస్టు ఎన్.పి.శేషాద్రి పేరు చూసి తమ అభిప్రాయం మార్చుకోవచ్చు. జాతీయస్థాయిలో మ్యూజికాలజీకి ఇంత గుర్తింపు రావడంతో ఆ విభాగం విలువ మరింత తేటతెల్లమయింది. మ్యూజికాలజీనే "హాసం" జనరంజకంగా అందిస్తోంది అని గమనించినవారికి "హాసం" సంగీతాభివృద్ధికి చేస్తున్న కృషి, సేవ తక్కువది కాదని అర్థమవుతుంది. ఈ సంచిక లోపలి పేజీలలో మనోరమ గురించి చదివితే "హాసం" హాస్యకళాకారుల గురించి కూడా అరుదైన సమాచారాన్ని అందిస్తోందనే విషయం మరొక్కసారి అనుకోవడం జరుగుతుంది. మేం చేస్తున్న కృషిని పాఠకులు గుర్తిస్తున్నారనే తృప్తి మాకు కొండంత బలాన్ని ఇస్తోంది. అందుకు పాఠకులకు మరోసారి కృతజ్ఞతలు తెలుపుకుంటూ ఇలాగే అంకితభావం కొనసాగుతుందని మాట ఇస్తున్నాం.



# 'గోపాల బాలా నిన్నే కోర...'

-నిశాపతి

**ఉన్నట్టుండి గోపాలానికి విపరీతమైన కడుపునొప్పి వచ్చింది. డోకొచ్చినట్లు కూడా అనిపించింది. ముకుందంతో సాయంకాలం అలా సరదాగా నడుస్తూండగా జరిగింది. అప్పుడప్పుడే చీకట్లు అలముకుంటున్నాయి.**

ఎదురుగా ఏదో 'డాక్టర్' అని బోర్డు కనిపిస్తే వెంటనే గోపాలాన్ని తీసుకుని లోపలికి వెళ్ళాడు ముకుందం. కాలింగ్ బెల్ మోగించాడు. కొద్ది సేపట్లో తలుపు తెరుచుకుంది. 'డాక్టర్' ప్రత్యక్షమయ్యాడు.

"మా వాడికి చాలా కడుపు నొప్పిగా వుందండీ! గిలగిలలాడి పోతున్నాడు. కొంచెం పరీక్ష చెయ్యండి" అన్నాడు ముకుందం.

'డాక్టరు' అతన్ని ఎగాదిగా చూసి,

"ఈ సాయంత్రం మీరేదైనా 'కవి సమ్మేళనానికి వెళ్ళారా!" అన్నాడు.

"అబ్బే! లేదండీ!" అన్నాడు గోపాలం

"మరి, పోనీ, ఏదైనా కవిత మీ కడుపులో వుండిపోయి, బైటికి రాలేక గిరికీలు కొడుతుందేమో! ఓ కాయితం, కలం యిస్తాను. వెంటనే రాసేయండి. కడుపు ఖాళీ అయి నొప్పి తగ్గిపోతుంది"

ముకుందానికి ఒళ్ళు మండింది.

"వాడు కడుపు నొప్పితో అల్లాడి పోతుంటే మీరు కవితలూ,కాకరకాయలూ అంటారేంటండీ? త్వరగా పరీక్ష చేసి ఏదయినా మందివ్వండి" అన్నాడు.

'డాక్టర్' అదేం వినిపించుకోకుండా,

"ఆగండి! కవిత అంటే కవితే కానక్కర లేదు. హైకూ, మినీ కవిత, చిన్నకథ, స్కెచ్, గల్పిక,... ఏదైనా సరే..."

"ఇదెక్కడి గోలండీ బాబూ...! కడుపు నొప్పికి మందు యిమ్మని మీ దగ్గరికొస్తే యిలా బాదేస్తున్నారు?!" అన్నాడు ముకుందం.

"మందా?! మందులు నాకేం తెలుసు?" అన్నాడు 'డాక్టర్' బిక్కమొకం వేసుకుని, 'మందు' అన్నమాట మొదటి సారిగా వింటున్నట్లు.

"మరి! 'డాక్టర్' అని బోర్డెందుకు పెట్టుకున్నారు?" అన్నాడు ముకుందం కోపంగా.

"అదా! ఇప్పుడర్థమైంది. ఇది కప్పల్నీ, బొద్దింకల్నీ కోసి సంపాయించిన డాక్టరు పట్టా కాదండోయ్! కష్టపడి సంపాదించింది" అన్నాడు 'డాక్టరు'

"ఏం కష్ట పడ్డారు?" అన్నడు ముకుందం అయోమయంగా.

"నాలుగేళ్ళు నానా కష్టపడి 'తెలుగు కథానికా సంకలనాల్లో విషయ సూచికలు' అనే అంశం మీద పరిశోధన చేసి సంపాదించిన డాక్టరేటు యిది,



తెలుసా?" అన్నాడు డాక్టర్ కొంచెం గర్వంగా.

గోపాలానికి తన కడుపు నొప్పి కూడా మరిపించేంత 'షాక్' కలిగింది.

"విషయ సూచికల మీద రిసెర్చా?" అన్నాడు ఆశ్చర్యంగా.

"అవును. అదేం చిన్న విషయం అనుకుంటున్నారా?"

"ఏం పరిశోధన చేశారు?"

"అలా అడగండి ! ఇప్పటి వరకు తెలుగులో 14,186 కథా సంకలనాలు వెలువడ్డాయి. అందులో రకరకాల విషయ సూచికలున్నాయి..."

"అంత ఖచ్చింతంగా కథా సంకలనాల సంఖ్య ఎలా సేకరించగలిగేరు?"

డాక్టరు గొంతు తగ్గించి, "పోనీ, నేను చెప్పిన సంఖ్య తప్పయితే మీరు సరైన సంఖ్య చెప్పండి" అన్నాడు.

"నేనా! నాకేం తెలుసు? నేనేం సాహితీ పరుణ్ణి కాదే! బాబోయ్ కడుపునొప్పి..." అన్నాడు గోపాలం.

"కొంచెం ఆగండి! కాబట్టి ఇప్పటి వరకూ తెలుగులో ఎన్ని కథా సంకలనాలు వెలువడ్డ సంగతీ మీకు తెలీనట్లేగదా! మీకే కాదు, ఎవరికీ తెలీదు. కాబట్టి నేను రాసింది తప్పని ఎవరూ ఋజువు చెయ్యలేరు"

"తెలిసింది, మహానుభావా! తెలిసింది! మీ విజయ రహస్యం ఏమిటో బోధపడింది. ఇక మమ్మల్ని వదిలెయ్యండి. మేం డాక్టరు దగ్గరికెళ్ళాలి" అన్నాడు ముకుందం.

"ఉండండి! మీకు మరీ ఖంగారు! ఈ మాత్రానికే డాక్టర్ ఎందుకు? మా బామ్మని కేకేస్తాను. ఆవిడ ఏదో చిట్కా వైద్యం చేస్తుంది. నొప్పి తగ్గి పోతుంది.' అంటూ

"బామ్మా!" అని కేకేసి -

"నా పరిశోధన వివరాలు పూర్తిగా వినలేదు మీరు! ఇహ వినండి! అడిగారుగా!" అని మళ్ళీ ఎత్తుకున్నాడు డాక్టరు.

"... ఈ 14,186 సంకలనాల్లో విషయ సూచికల్లో 'ఫాంట్' అంటే అక్షరం సైజు..."

"ఫాంట్ అంటే తెలుసులెండి నేను కంప్యూటర్ ఇంజినీర్ని" అన్నాడు గోపాలం.

డాక్టరు ఆపకుండా, "... అక్షరం సైజు వివరాలతో నా పరిశోధనా గ్రంధంలో రెండు అధ్యాయాలు నింపాను..."

"అలాగా!" అన్నాడు గోపాలం, నిజంగానే వాళ్ళ బామ్మ ఏదైనా చిట్కా వైద్యం చేస్తే డబ్బులు మిగులుతాయిగదా అనే ఆశతో, ఆసక్తి నటిస్తూ.

"... మూడో అధ్యాయంలో అకారాది క్రమంలో మొత్తం అన్ని సంకలనాల్లోనూ ఒక్కో అక్షరం కింద ఎన్ని కథలున్నాయో యిచ్చాను. నాలుగో అధ్యాయంలో..."

అంతా వింటోన్న ముకుందం ఇక ఉండబట్ట లేక అడ్డు పడుతూ,

"ఇదా పరిశోధన అంటే... సాహిత్యంలో శైలిలో వచ్చిన మార్పులూ, శిల్ప పరిణామం యివేవీ చర్చించలేదా?" అన్నాడు.

"ఎందుకు లేదు? నా మూడొందల పేజీల గ్రంథంలో చివరి రెండు పేరాలూ అదేగా? అయినా విషయ సూచికల్లో శైలీ, శిల్పం ఏమిటి తమరి బొంద?!" అని విసుక్కున్నాడు డాక్టరు.

"మరి నక్షత్రాలూ, దంతక్షతాలూ - అవీ 'విషయ' సూచికలేగా? వాటి గురించి కూడా 'కవర్' చేస్తే యింకాస్త పెద్ద గ్రంథం అయ్యేందిగా?!" అన్నాడు ముకుందం ఒళ్ళుమండి.

డాక్టరు కాసేపు ఆలోచించి, "డబుల్ మీనింగా?" అన్నాడు.

"కాదు. సింగిల్ మీనింగే" అన్నాడు ముకుందం.

"ఓర్నీ అసాధ్యంగూలా ! తెలుగు చదువుకున్న నాకే రాని పెధవాలోచనలన్నీ నీకెలా వస్తున్నాయయ్యా! చదివిందేమో కంప్యూటరింజినీరింగు!?" అన్నాడు డాక్టరు.

"దీనికి సాహిత్యం చదవక్కర్లేదు సార్, సినిమాలు చూస్తే చాలు. అయినా కంప్యూటర్ ఇంజినీర్ని నేను కాదు. మా వాడు" అన్నాడు ముకుందం.

"ఎవరో ఒహర్లేగాని, ఇంతకీ ఎలావుంది నా పరిశోధన?" అన్నాడు డాక్టరు.

"పి.హెచ్.డీ. సంపాదించడం యింత సులభం అనుకోలేదు, సార్! ఇంకా ఏదన్నా కొత్త విషయం కనుక్కుని ప్రతిపాదించాలేమో అనుకున్నా" అన్నాడు ముకుందం.

డాక్టర్ ఏదో చెప్పబోతుండగా వాళ్ళ బామ్మ బైటికి వచ్చింది. "ఇక్కడ కడుపు నొప్పి ఎవరికి బాబూ?!" అంటూ

"నాకు" అన్నాడు గోపాలం, కడుపు నొప్పి మళ్ళీ గుర్తుకు తెచ్చుకుని. బామ్మగారు కాస్త వాము, వుప్పూ నల్చి పెట్టి, తాగడానికి వేణ్ణీళ్ళు కూడా యిచ్చింది.

గోపాలం వాము మింగుతూండగా,

"మీ ఇంటి పేరేమిటి నాయనా?" అంది

గోపాలం చెప్పాడు. ఏదో ఊరి పేరు అది. అదేమీ పౌరుషనామం కాదు. ముసలావిడ మొహంలో ఏమాత్రం సంతృప్తి గోచరించలేదు. ఆవిడ ఏ లక్ష్యం ఆశించి ఆ ప్రశ్న వేసిందో అది నెరవేరలేదు.

"మీ నాన్న గారి పేరేమిటి, బాబూ?" అని మరో ప్రశ్న సంధించింది, 'ఆయన పేరులో నన్నా చివర్న ఏదైనా కులవాచకం వుండక పోతుందా' అని. గోపాలం చెప్పాడు.



కలం పేరు 'నిశాపతి'. అసలు పేరు యం.హెచ్.వి. సుబ్బారావు. విద్యార్హతలు కాలేజీలో బి.ఇ., తరువాత ఉద్యోగం చేస్తూ ప్రయివేటుగా తెలుగు యం.ఏ., రాష్ట్ర ప్రభుత్వ పంచాయతీరాజ్ ఇంజినీరింగ్ శాఖలో సూపరింటెండింగ్ ఇంజినీర్‌గా ఈమధ్యే పదవీ విరమణ.

సాహిత్యంలో అన్ని శాఖలూ యిష్టమే! మరీ శాస్త్రీయంకాని సంగీతం, హోమియోపతీ అభిమాన విషయాలు. హాస్యం అంటే పిచ్చి యిష్టం.

ఇప్పటి వరకు 'అభిశప్త' అనే చిన్న నవలిక, 'నీడలు', 'నిశాపతి కథలు' అనే కథా సంకలనాలు, 'కలకలం', 'శ్రీ వలవర్ల వేణుగోపాల శతకం' అనే కవితా సంకలనాలూ (రెండోది పద్యాలు - శతకం) వెలువడ్డాయి. ఇంకా కొన్ని అముద్రితాలున్నాయి. 'శింజిని' అనే సామాజిక వస్తు శతకం త్వరలో వెలువడనుంది.

'నిశాపతి కథలు' కథా సంకలనానికి మచిలీపట్నం 'బులుసు సీతాకుమారి' అవార్డూ, 'కలకలం' కవితా సంకలనానికి జాతీయ సాహిత్య పరిషత్, సిద్దిపేట వారి అవార్డూ లభించాయి. ఇక విడి కథలకి పోటీల్లో ఆంధ్రప్రభ, ఆంధ్రజ్యోతి, రచన పత్రికల నుండీ, విడి కవితలకి 'వి.వి.యన్. ట్రస్టు', 'రంజని-కుందుర్తి' మంచి కవితా అవార్డు రెండుసార్లూ, 'ఎక్స్‌రే' ఉత్తమ కవితా అవార్డూ లభించాయి. వృత్తి రంగంలో వెలువరించిన ఏడు 'పేపర్స్'లో ఒకదానికి 'ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ ఇంజినీర్స్, హైదరాబాద్' వారి నుండి 'బెస్ట్ పేపర్ అవార్డు' లభించింది.

ప్రస్తుతం 'ఆంధ్ర పద్య కవితా సదస్సు' జంట నగరాల శాఖకి కార్యదర్శిగా వుంటున్నాను.

ఇదీ నా పరిచయం.

**-యమ్.హెచ్.వి. సుబ్బారావు.**

చాలా సాదా సీదా పేరు అది. ఎవరైనా పెట్టుకోవచ్చు.

ముసలమ్మగారు చాలా నిరాశపడ్డారు.

కానీ ఆవిడకి ఓటమిని అంగీకరించడం యిష్టంలేదు. కుర్రాడి మొహం, మాటతీరూ చూస్తే తమ కులంలాగే వుంది.

ఇంతకీ సంగతేవిటంటే - ఆవిడ మనవరాలు-కూతురి కూతురు-తల్లి లేని పిల్ల-ముసలావిడ గారి సంరక్షణలోనే వుంది. ఆ పిల్లకి పెళ్ళి చేయాల్సిన బాధ్యత ఆమెపైన వుంది. అదీ!

గోపాలం కడుపు నొప్పి కాస్త తగ్గింది.

ముకుందం అతన్ని చూసి, "ఒరేయ్...! ఇక వెళ్దామా?" అన్నాడు. అప్పుడప్పుడు ముకుందానికి గోపాలాన్ని అతని కులవాచకంతో పిలవడం సరదా! వాళ్ళది చాలా మంచి స్నేహం.

బామ్మ గారి మొహం చాటంతయింది.

వెంటనే గోపాలం కేసి తిరిగి, "కాస్త వుండు నాయనా! కడుపు నొప్పి పూర్తిగా తగ్గనీ - సరే గాని, నీకు పెళ్ళయిందా బాబూ" అంటూ డైరక్టుగా రంగంలోకి దూకింది.

"లేదండీ!" అన్నాడు గోపాలం.

ఇక ముసలమ్మ గారు విజృంభించేసింది. ఎక్కడ లేని సత్తువా తెచ్చుకుని మిగతా వివరాలన్నీ సేకరించి పారేసింది.

కుర్రవాడు అన్ని విధాల తన మనవరాలికి తగ్గవాడే!

"వాళ్ళ నాన్న గారి అడ్రసు తీసుకోరా, నాగన్నా! మన 'మిత్రవింద'ని యీ కుర్రాడికి అడుగుదాం" అని మనవడికి పురమాయించింది, హఠాత్తుగా ఇది మగవాళ్ళ పని అని గుర్తొచ్చి. అబ్బే! నాగన్న అన్నది డాక్టరు అసలు పేరు కాదు. కేవలం విశేషణం. అంతే!

'మిత్ర వింద' అన్న పేరు వినగానే గోపాలం ఎడం కన్ను అదిరింది దాంతో పాటే కొద్దిరోజుల క్రితం అదిరిన తన కుడి గూబ గూడా గుర్తొచ్చింది. ఆ అమ్మాయి పేరు కూడా ఏదో యిట్లాగే పాత పుస్తకాల్లో పేరే!

ఇంతలో బైట ఆడపిల్లల హీల్స్ చప్పుడు వినబడింది.

కొద్ది నిమిషాల్లో మిత్రవింద గబగబా వచ్చి తలెత్తి చూడకుండానే యింట్లోకి వెళ్ళింది. కాని గోపాలం ఆమెని చూశాడు. సందేహం లేదు! ఈ అమ్మాయి ఆ అమ్మాయే!

"ఇదే బాబూ! మా మనవరాలు" అంది బామ్మగారు, మిత్ర వింద లోపలికి వెళ్ళిపోయాక, -ఇక ఆమెకి వినబడదు - అన్న నిర్ధారణకి వచ్చి.

గోపాలం ఒక్క సారిగా 'ఎలర్ట్' అయిపోయాడు.

"అన్నట్లు బామ్మగారూ! మీకో విషయం చెప్పాలి" అన్నాడు

"ఒకటేం ఖర్మ, ఎన్ని కావలిస్తే అన్ని చెబుదువుగాని, ముందీ విషయం చెప్పు. మా మనవరాలు నీకు నచ్చిందా?" అంది...

"అమ్మాయికేం, లక్షణంగా వుంది. కాని నాకు... నాకు... "తడబడ్డాడు గోపాలం

"ఊఁ! నీకు..."

గోపాలనికి హఠాత్తుగా బుర్రలో ట్యూబ్ లైటు వెలిగింది.

"నాకు కుజదోషం వుంది బామ్మ గారూ!" అనేశాడు.

బామ్మగారు విశాలంగా నవ్వుతూ,

"ఆఁ! కుజదోషానికేముంది, నాయనా! వింధ్య పర్వతాలకి దక్షిణాన వున్న దేశానికి కుజదోషం వర్తించదని పెద్దలెప్పుడో చెప్పేశారు. మనమే అజ్ఞానం కొద్దీ దాన్ని పాటిస్తున్నాం. అయినా ఆ గొడవలన్నీ నీ కెందుకు? మేమూ మేమూ, పెద్దవాళ్ళం చూసుకుంటాం గదా. పిల్ల నచ్చిందన్నావు. చాలు. ఇక నీ పని అయిపోయింది. మిగతావి మా కొదిలెయ్" అని ముద్దుగా కసిరింది.

గోపాలానికి తన మీద తనకే జాలేసింది.

"అవును, నిజంగానే ఇక నా పని అయిపోయింది" అనుకున్నాడు.

తనకి యీ పాడు కడుపు నొప్పి రానేలా? వచ్చెనుబో, యీ త్రాష్టుడి యింటికి తాను రానేల? ఆయెనుబో, యీ బామ్మగారి కంట పడనేల?...

... నిజానికి మిత్ర వింద లాంటి అందగత్తె భార్యగా లభించడం ఏ మగవాడైనా అదృష్టంగా భావించవలసిన విషయమే!

కాని... కాని...

ఇవాళ కాకపోతే, రేపైనా ఆ అమ్మాయి తనని గుర్తు పడుతుంది. పట్టి "నువ్వా!" అని క్లోజప్‌లో తనతో అని, వాళ్ళ అమ్మమ్మవైపు తిరిగి, మిడ్‌షాట్‌లో "అమ్మమ్మా! వీడో జులాయి వెధవ, అమ్మాయిల్ని అల్లరిపెట్టే రకం! వీడికిచ్చి నా గొంతుక కోస్తావా?" అనడం ఖాయం.

గోపాలం ఆలోచించీ, ఆలోచించీ చివరికి గుండె రాయి చేసుకున్నాడు. 'కానీ! ఏదయితే అది అవనీ! అయినా తనకేవిటి, మగ మహా రాజు! ఇంత పిరికి పడడం అవమానకరం - 'వాట్ విల్ బీ విల్ బీ'... అని పాడుకుంటూ ధైర్యం తెచ్చుకున్నాడు.

--కట్ చేస్తే--

పెళ్ళి చూపుల్లో మిత్రవింద ఏ పేచీ పెట్టకుండా పెళ్ళికి ఒప్పుకోడం గోపాలానికి మెగా ఆశ్చర్యం కలిగించింది.

పెళ్ళయ్యాక గోపాలం ఆమెని అడిగాడు.

"నిజం చెప్పు! ఆరోజు కాలేజీలో నిజానికి నేను నిన్ను అల్లరేమీ చెయ్యలేదు. మౌనంగా 'ఫాలో' అయ్యాను. అయినా రెచ్చిపోయి నన్ను చెప్పుచ్చుకు కొట్టావు. ఇప్పుడేమో మారు మాట్లాడకుండా పెళ్ళి చేసుకున్నావ్. హేమిటిదంతా?! హ్హా హ్హా హ్హా హ్హా... నేను నవ్వాను, దగ్గలేదు. చెప్పు! ఏవిటిదంతా?"

మిత్రవింద కాస్త సిగ్గు పడుతూ, "మీరంటే నాకు మొదటి నించీ యిష్టమేనండీ! అసలు మీరు మా కాలేజీ చుట్టూ తచ్చాడుతుండగా చూసిన మొదటి రోజే మిమ్మల్ని ప్రేమించానండీ! పెళ్ళి చేసుకోవాలనిగూడా అప్పుడే నిర్ణయిం చేసుకున్నాను" అంది.

"మరి?' అన్నాడు గోపాలం అయోమయంగా.

"మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనే ఆ రోజు అలా కొట్టానండీ!"

"ఏవిటీ, పెళ్ళి చేసుకోవాలనే కొట్టావా? తెలుగు సినిమాలో కక్కుర్తి కామెడీ కోసం వేసే డైలాగ్‌లా నీ డైలాగు రిపీట్ చెయ్యడం లేదు. నిజంగా అర్థం కాకే అడుగుతున్నాను. చెప్పు! పెళ్ళి చేసుకోవాలని కొట్టడం ఏవిటి?"

"ఓ! మీకు అసలు సంగతి చెప్పలేదు కదూ? మిమ్మల్ని నేను కోపంతో కొట్ట లేదండీ"

"తెలుసు! కోపంతో కాదు, చెప్పుతో కొట్టావ్" అన్నాడు గోపాలం.

"అబ్బ! చిలిపి! నిజంగా చెబుతున్నాను. మిమ్మల్ని కొట్టింది మీ మీద కోపంతో కాదు. నా తల్లికిచ్చిన మాట నిలబెట్టుకోడం కోసం. అంతే!"

అంది మిత్రవింద భారంగా నిట్టూరుస్తూ.

"కాస్త అర్థం అయ్యేలా మానవ భాషలో చెప్పవా, ప్లీజ్" అని బతిమాలుకున్నాడు గోపాలం.

"అయితే వినండి! ఒకటో ఎపిసోడ్..."

"ఆగు. టైటిల్ సాంగు వద్దు. డైరక్టుగా సీన్‌లోకి వచ్చెయ్"

"ఓకే! మా అమ్మని మా నాన్న కష్టాలు పెట్టేవాడు. అప్పుడప్పుడు తాగొచ్చి కొట్టేవాడు సినిమాల్లోలా. పూర్ అమ్మ ఏమీ చేయలేక ఏడ్చేది. ఏనాటికైనా యీ దేశంలో ఆడది మగాణ్ణి చెప్పుచ్చుకొని కొట్టేరోజు రావాలని కలలు కనేది. పాపం, ఆవిడ తన కలలు తీరకుండానే వెళ్ళి పోయింది. ఆవిడ ఆత్మశాంతి కోసం..."

"నన్ను కొట్టావా? ఇది భలేవుందే"

"అబ్బ! మీకేదీ అర్థం కాదు. అన్నీ విడమరచి చెప్పాలి. నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించేసుకున్నాను. మన పెళ్ళి ఖాయంగా జరుగుతుందని తెలుసు. మరి తీరా పెళ్ళయ్యాక మీరు తాగి యింటికొచ్చి నన్ను కొడతారో, కొట్టరో? అప్పుడు నా తల్లి కోర్కె తీరే దారేది? ఆమె ఆత్మకి శాంతి కలిగేదెట్లా? అందుకని ఎడ్వాన్సుగా... " అంది మిత్రవింద గోముగా.

"మీ అమ్మగారి ఆత్మ పూర్తిగా శాంతించినట్లే నంటావా? మధ్య మధ్య మళ్ళీ అశాంతికి గురవదు గదా" అన్నాడు గోపాలం భయం భయంగా.

"మీరెప్పుడైనా తాగి వచ్చినప్పుడు నేను కొట్టకపోతే ఆ ఛాన్సుంది" అంది మిత్రవింద నర్మగర్భంగా"

"నేను తాగొస్తే తంతానని భలే ఇన్‌డైరెక్ట్‌గా చెప్పావ్... మొత్తానికి గట్టిదానివే..." అన్నాడు గోపాలం తేలికపడ్డ హృదయంతో నవ్వుతూ...

---

రచన: ఎం.వి.యస్.హరనాథరావు

## సినేమా హంగులు

బొమ్మలు: ఎమ్.ఎస్.రామకృష్ణ

దేవుడు గది

ముసలి తల్లి దుఃఖ పడడానికి,

ఆ అవకాశం సెకండాఫ్‌లో క్యారెక్టర్సుకి

పంచడానికి ఉపయోగపడే

ఉమ్మడి ఆస్తి...





# రాంపండు లీలలు

## కామ్రేడ్ రాంపండు

"హల్లో అనంత్ గారా? కులాసానా? ఏమిటి పార్కులో తిరుగుతున్నారు? ఇన్‌స్పిరేషన్ కోసమా?" పలకరింపు వినని తలెత్తిన అనంతం రాపండు బాబయ్య సింహాద్రిరావుగారిని చూసి తెల్లబోయాడు. "ఇన్‌స్పిరేషన్ కోసమా?" అన్నాడు అయోమయంగా.

"అదేనండీ. మీ రచయితలకు ఎక్కడ ఇన్‌స్పిరేషన్ వస్తుందో తెలియదు కదా! ప్లాటు కోసం వెతుకుతూ అలా పార్కులు, తోటలు, గుట్టలు తిరుగుతారు కాబోలు..." అన్నాడాయన నవ్వుతూ.

అనంతానికి బల్బు వెలిగింది. రాంపండు పెసరట్ల సుబ్బిని ప్రేమించిన గొడవలో వాళ్ళ బాబయ్య దగ్గరికి తీసుకెళ్ళి ఆయన ఆయన అభిమాన రచయిత కల్పనారాణి తనేనని పరిచయం చేసిన సంగతి గుర్తుకొచ్చింది. అనవసరంగా ఇరుక్కున్నానని అవాళే బాధపడ్డాడు - ముసలాయన ఆ కథ ఎలా రాశారు, ఈ నవల ఎలా రాశారు అని అడిగి చంపుతూంటే! తక్షణం మాట తప్పించకపోతే మాట దక్కదని భయం వేసింది.

"అబ్బే, కథ గురించి అంత పాట్లు పడనండి. ఇంటి దగ్గర కూచున్నప్పుడు అలా ఓ వేవ్ వస్తే రాసి పారేయడమంతే! ఓ సారి రాసేసిన తర్వాత ఆ కథ గురించి ఇక పట్టించుకోను. ఎవరైనా ఏదైనా పాత్ర గురించి అడిగినా ఏమో అనేస్తాను. అంతలా మర్చిపోతానన్నమాట. పార్కుకి సరదాగా వచ్చా! అదిగో ఆ మూల ఆ గడ్డం అబ్బాయి స్పీచి దంచేస్తూంటే తమాషాగా ఉందని వింటున్నాను."

పార్కులో అక్కడక్కడ జనం ఉన్నారు కానీ ఆ ఉపన్యాసం ఇచ్చే మూల మాత్రం జనం బాగానే ఉన్నారు. 'ఎర్ర విప్లవానికి ఎదురు సన్నాహం' వంటి బ్యానర్లు కట్టి ఉన్నాయి. గడ్డం వున్న యువకుడే కాక ఇంకో ఇద్దరు, ముగ్గురు మనుష్యులు మధ్యలో ఉన్నారు. చుట్టూ జనం మంత్రముగ్ధులయి వింటున్నారు. సమాజంలో డబ్బున్నవాళ్ళు బ్రేక్‌ఫాస్టుకి పేదలరక్తం తాగి, పేదల మాంసాన్ని ఫ్రిజ్‌లో దాచుకుని లంచ్‌కి తింటారని ఆ కుర్రాడు గొప్ప నాటకీయంగా కళ్ళతో చూసినట్టు చెబుతున్నాడు. శ్రోతలంతా ఊగిపోతున్నారు.

సింహాద్రిరావుగారు చిరునవ్వు నవ్వాడు. "నేనూ వింటున్నాను, విషయం ఏమయితేనేం, స్పీచ్ మాత్రం అద్భుతంగా ఉంది. మా ఆవిడ షాపింగ్‌కాంప్లెక్స్‌లో దూరింది. 'నీకు బోరు కదా, డాళింగ్, పక్కనే ఉన్న పార్కుకి వెళ్ళి తిరిగొచ్చేయ్' అంది. పార్కులో వాక్ చేస్తూంటే బఠాణీలు చూడగానే నోరూరింది. కొందామని వస్తే, అక్కడ ఆ గడ్డం స్పీకరు, ఇటు మీరూ కనబడ్డారు".

"మీ భార్య అంటే... అప్పుడు వంటచేసే వెంకమ్మగారిని చేసుకుంటానన్నారు... ఆవిడేనా?" అడిగేడు అనంత్ ఆశ్చర్యంగా.

పాపం అనంత్‌కి తెలియదు కానీ ఆవిడ వెంకమ్మనుండి వెంకటేశ్వరిగా మారి చాలారోజులయింది. తన లాభం కోసం సింహాద్రిరావు గారి ఛాందసభావాలు పోగొడదామని రాంపండు కల్పనారాణి నవలలు చదివిస్తే, అవి బాగా తలకెక్కి ఆయన వంటావిడని పెళ్ళాడేసి రాంపండు నోట్లో కరక్కాయ కొట్టాడు. ఇంటావిడగా మారుతూనే వంటావిడ పూర్తి పెత్తనాన్ని తన చేతిలోకి తీసుకుంది. అంతకుముందు జీతం డబ్బు పెట్టి గుర్రప్పందాలు ఆడే అలవాటు వల్ల అబ్బిన అశ్వజ్ఞానాన్ని ఎన్‌కాష్ చేసుకుందామని గుర్రాలు కొనడం మొదలెట్టింది. మొగుణ్ణి దుమ్ముదులిపి, జుట్టుకు రంగేసి, షోకిల్లాగా తయారుచేసింది. తను అంతకంటె మించిన సీతాకోకచిలుకలా తయారయింది. డబ్బు ఇలాటివాటికి ఖర్చవడం వల్ల పాపం రాంపండు పాకెట్‌మనీ దెబ్బతింది. అందువల్ల రాంపండు వాళ్ళ ఇంటికి రాకపోకలు తగ్గించేడు. ఇవన్నీ సగం, సగం చెప్పి సింహాద్రిరావు గారు వాళ్ళావిడ బ్లాక్ యారో అనే గుర్రాన్ని కొందని కూడా చెప్పాడు.

"మరి మీరేమీ అనటం లేదూ?" అని అడిగేడే కానీ అనంతం నాలిక కరుచుకున్నాడు. లేటు వయస్సులో పెళ్ళాడిన వాణ్ని అడగవలసిన ప్రశ్న కాదనుకుంటూ.

"అనడం దేనికండి? గుర్రాల వ్యాపారం కదా! పైగా అదేదో మంచి గుర్రమట! చాలామంది దానిమీద పందేలు కాస్తారు కూడానట! డబ్బొచ్చే వ్యాపారం ఏదైతేనేం? పైగా ఖర్చులు కూడా పెరుగుతున్నాయి కదా!" అన్నాడాయన.

'ఖర్చులు పెరుగుతూన్నట్టుగానే ఉంది మిమ్మల్ని చూస్తే. క్రితం సారి చూసినప్పుడు అరడజను ఆడపిల్లల తండ్రిలా ఉన్నవాడివి ఇప్పుడు




పూలరంగడిలా ఉన్నావు" అనుకున్నాడు అనంత్. ఆశ్చర్యంగా ఉపన్యాసం ఇచ్చే ఆ గడ్డపు కుర్రాడు అదే మాటంటున్నాడు - అదే సమయానికి! "చూడండి, ఆ ముసలాడికేసి! ఆరుగురు ఆడ పిల్లల తండ్రిలా కుక్కిమంచంలో పడివుండవలసినవాడు పూలరంగడిలా పడుచు పెళ్ళాన్నేసుకుని షికార్లు కొడుతున్నాడు" అని అరిచాడు సింహాద్రిరావును చూపిస్తూ.

జనమంతా ఒక్కసారి వెనక్కి తిరిగి చూడడంతో ముసలాయన ఇబ్బందిగా మొహం పెట్టాడు. "నాకూ విప్లవం అంటే ఇష్టమే. ఆ మాటకొస్తే కాలేజీరోజుల్లో నేనూ కమ్యూనిస్టునే. కానీ ఇలా బొత్తిగా పర్సనల్‌గా ఎటాక్ చేయడం మర్యాద కాదంటాను. ఏమంటారు?" అన్నాడు అనంతం సానుభూతి కోరుతూ.

'అబ్బే, మీరంత ఫీలవక్కర్లేదు. పబ్లిక్‌లోకి వస్తే ఏమైనా అంటాం, మా హక్కు అని శ్రీశ్రీ ఎప్పుడో డిక్లేర్ చేసేశాడు. ఇప్పుడు మీరు పబ్లిక్‌ప్లేసులో ఉన్నారు కాబట్టి ఇది తప్పదు. మీ ఇంటికొచ్చి అన్నాడంటే తప్పుపట్టవచ్చు. అయినా మీరింత ఫేమస్ అని నాకు తెలియదు." అన్నాడు అనంతం వెక్కిరింతగా.

"నాకూ తెలియదు. నా గురించి వీడెవడికో బాగా తెలుసేమో!" అంటూండగానే గడ్డంవాడి కంఠం మళ్ళీ మోగింది. "ఆ పూలరంగడితో బాటు నిలబడ్డ పోతుటీగను చూశారా? జీవితంలో ఒక్కరోజు కూడా పనిచేసి ఎరగని ఘటం అది. కష్టజీవులను దోచి తాతముత్తాతలు సంపాదించిన ఆస్తిని అరగదీసి బతుకుతున్న బతుకు వాడిది. ఆంబోతు చేతనైనా పనిచేయించవచ్చేమో కాని వాడి చేత పని చేయించడం దేవుడి... కాదు... కాదు అంతరాత్మ తరం కాదు..."

ఈ సారి కులకడం సింహాద్రిరావు వంతయింది. 'ఈ లీడర్లకి మంచి ఆరేటరీ ఉంటుందండి. ఏం చెప్పినా, గొప్ప ఎఫెక్టివ్‌గా చెప్తారు, నాకు ముచ్చట వేస్తుంది. మీ కథల గురించి కూడా ఏమంటాడో..."

అప్పటికే జనాలు వెనక్కి తిరిగి కొరకొరా చూస్తూండడంతో అనంతానికి భయం వేసింది - లాక్కెళ్ళి పార్కులో చిత్తుకాగితాలు ఏరిస్తారేమోనని! "ఫ్రీడం ఆఫ్ స్పీచ్ ఉండాలి గానండి. మరీ ఇంత ఇదిగా ఉండకూడదండి. బైదివే... నాకు కాస్త పని ఉంది. వెళ్తా." అంటూండగానే సింహాద్రిరావు హేళనగా నవ్వాడు. "పనా? అటువంటిది ఏమీ చేయరని వాడంటున్నాడు..." అంటూ.

"ఏమాట కామాట చెప్పుకోవాలి. ఈ పోతుటీగ ఇంకోడి పొట్ట కొట్టదు... కానీ ఆ పూలరంగడున్నాడే... తనను నమ్ముకున్న వారిని నిలువునా ముంచగలడు. నోటి దగ్గర కూడు లాగేయగలడు. వాళ్ళ ప్రేమ వ్యవహారాల్లో నిప్పులా పోయగలడు... ఇలాటి వాళ్ళు సంఘానికి పట్టిన చీడపురుగులు... వీళ్ళని వదల్చడానికి డిడిటీ చాలదు. విప్లవం ఒక్కటే శరణ్యం..." గడ్డం వాడు మళ్ళీ అష్టోత్తరం అందుకోగానే సింహాద్రిరావు మొహం జేవురించింది.

"మా ఆవిడ షాపింగు అయిపోయి ఉంటుంది. వస్తా." అంటూ పరుగు, పరుగున మాయమయిపోయాడు. అనంతం అంతకంటె ముందే పారిపోయాడు.

మర్నాడు క్లబ్బులో అనంతానికి రాంపండు కనబడితే "ఏరా కనబడటం లేదు?" అంటూ పలకరించాడు.

"ఏడిసినట్టుంది. కనబడ్డాను. వినబడ్డాను. నిన్న పార్కులో..."

"పార్కులో మీ బాబయ్య కనబడ్డాడు. నువ్వెక్కడున్నావ్?"

"ఉన్నానులే. ఆ గడ్డం వల్ల గుర్తు పట్టలేకపోయుంటావ్"

"గడ్డమా...?" అనంతం ఆశ్చర్యపోయాడు. "...అంటే ఆ గడ్డం వక్త... హోరి నువ్వా? ఓరి స్కౌండ్రల్!"

"చూశావా గడ్డం మహిమ! బాల్య మిత్రుడివి నువ్వు కూడా గుర్తుపట్టలేకపోయావ్! గడ్డం అద్దె డబ్బులు కిట్టినట్టే!"



"నీ కిదేం పోయేకాలంరా! అసలు నువ్వేమిటి? విప్లవం ఏమిటి! అసలు నీలాటి పక్కా బూర్జువా..."

"ఒరే, ఆ భాష నాది. కాపీ కొట్టకు. అసలు సంగతి విను, ముందు ఈ సుందరాంగి ఫోటో చూసి ఎలా ఉందో చెప్పు..." అంటూ జేబులోంచి ఓ ఫోటో లాగేడు.

"చంపావ్! మళ్ళీ ప్రేమలో పడలేదుకదా!"

"మళ్ళీ ఏమిట్రా? ఇదొక్కసారే ప్రేమ! కితంవన్నీ ఒట్టి ఫ్యాన్సీ! పాసింగ్ ఫేజ్! మూర్ఛ వస్తే ఫిట్ అంటారు చూడు, అలాటివన్నమాట. కాస్సేపు ఉంటుంది. మళ్ళీ పోతుంది. కానీ ఈ 'వాలెంతింటా' ఉంది చూశావూ..."

పాపం అనంత్ చూడలేదు. చూసివుంటే పేరులోని 'తింటా' భాగానికి ఆ అమ్మాయి ఎంత న్యాయం చేసిందో కళ్ళారా చూసేవాడు. ఆ పేరుకో కథ ఉంది. వాళ్ళ నాన్న సీతారామయ్య రష్యా వీరాభిమాని. రష్యన్ పేరులా ఉండాలని సీతారామయ్యస్కీ అని మార్చుకోబోయాడు పలకడానికి జనాలు కష్టపడడంతో స్కీతారామయ్య అని మార్చుకుని తృప్తిపడ్డాడు. కూతురు పుట్టినప్పుడు తొలి మహిళా కాస్మోనాట్ వాలెంతినా తెరిష్కోవా పేరుపెట్టాడు.

స్కూలులో చేర్పించినప్పుడు టీచరు స్పెల్లింగు కుదరక తెరిష్కోవా కత్తిరించి పారేశాడు. వాలెంతినా పేరు వింతగా ఉండడంతో అటెండెన్స్ రిజిస్టర్‌లో పేరు రాస్తూ, రాస్తూండగానే మారిపోయింది. మరో టిపి వచ్చి చేరడంతో టెన్త్ క్లాసుకు వచ్చేసరికి అది చివరికి వాలెంతింటాగా తేలింది. పేరుగురించి తోటి క్లాసుపిల్లలు ఏడిపిస్తూంటే కోపం వచ్చి తింటా, తింటా అని ఛాలెంజి చేసి మరీ తినేసేది వాలెంతింటా! ఆమె కృషి ఫలితంగా పేరులోనే కాకుండా శరీర సౌష్టవం విషయంలో కూడా రష్యన్ మహిళతో పోలిక వచ్చిచేరింది.

అనంత్ అదే అన్నాడు. "రష్యన్ అమ్మాయిలా వుంది. ఎక్కడ కలిశావ్?" అని.

"మొన్న ఓ ఊరెళ్ళి తిరిగొస్తూ బస్సు దొరక్క లారీ ఎక్కాను. టావ్‌మీద కూచోబెట్టాడు. తింటా కూడా అక్కడే ఉంది. కాస్త దూరం వెళ్ళాక వర్షం వచ్చింది. గొడుగు తీసి దగ్గరకి రమ్మనమని ఆఫర్ చేశాను. సరేనంది. బోల్డు కబుర్లు చెప్పుకున్నాం..."

"ఆమెకి గొడుగు పట్టావంటే నువ్వు బాగా తడిసిపోయివుంటావ్."

"కరెక్టే! బాగానే గెస్ చేశావే! కానీ నాకు చలి తెలియలేదురా. ఒంట్లో ఒకటే వేడి. విప్లవం వచ్చాక తను డబ్బున్నవాళ్లందరినీ కత్తిపెట్టి డొక్కలో ఎలా పొడుస్తుందో తింటా వర్ణిస్తూంటే బలే హుషారుగా ఉందనుకో. అసలు తనకీ, వాళ్ళ నాన్నకీ జరిగే ఆర్గ్యుమెంట్స్ నువ్వు విని తీరాలి. వాళ్ళందరినీ తుపాకీతో కాలుద్దామంటాడు స్కీతారామయ్య. కాదు, కత్తే బెటరంటుంది కూతురు. చివరికి ఇద్దరూ కలిసి నన్ను తేల్చమంటారు..."



"పోయి, పోయి నిన్నడగడమేమిటి? నువ్వు ఫలానా అని తెలియదా?"

"తెలియదు. నేను ఓ పెద్ద విప్లవ కారుణ్నని, పోలీసులు గుర్తుపట్టకుండా గడ్డం పెట్టుకుని మారువేషంలో తిరుగుతున్నానని అనుకుంటున్నారు. నువ్వు మీ ఇంటికి టీకి పిలిచినప్పుడు వాళ్ళతో ఈ విషయం అనకురోయ్".

"నేనెక్కడ పిలిచాను?"

'పిలిచావులే. నీకు తెలియదు. నన్ను, వాలెంతింటానీ, వాళ్ళ నాన్ననీ ఆదివారం మధ్యాహ్నం రెండు గంటలకి పిలిచావు".

"సర్లే. రండి. డబ్బున్నవాళ్ళను తిట్టడం, వాళ్ళ తిండి తినడం".

"విప్లవం తేవాలంటే బాగా తిండి తినాలోయ్, భగవాన్లూ. పైగా మీ ఇంట్లో తింటున్నామంటే శతృధనం దోస్తున్నట్టేగా, అంటే విప్లవంవైపు ఇంకో అడుగు వేస్తున్నామన్నమాట! బై, బై, వస్తా. రేపు కరీంనగర్‌లో మీటింగుంది. స్పీచ్ ప్రిపేర్ చేసుకోవాలి..."

"టీలో ఉప్పు వేయిస్తానులే. నా ఉప్పు తిన్న విశ్వాసంతో ఈసారి స్పీచ్‌లో నన్ను తిట్టకుండా వుంటావ్."

'ఒరే, ఉప్పంటే గుర్తుకువచ్చింది. నేను 'టీ' అనడంతో నువ్వు మిస్‌లీడ్ అయినట్టున్నావ్. టీ అంటే టీ అనే కాదు, అచలపతికి చెప్పి రొయ్యల వేపుడు, చికెన్ బిర్యానీ, సూప్, మటన్... సర్లే నీకు చెప్పినా మర్చిపోతావ్. అచలపతికి నేను డైరక్టుగా చెప్తానులే... కావాలంటే ఓ దాంట్లో ఉప్పు కాస్త ఎక్కువ వేయించు. ముందే చెప్తే అది వదిలేస్తా..."

ఆదివారం మధ్యాహ్నం, అనంతం ఇంట్లో -

అది తింటా, ఇది తింటా అని వాలెంతింటా ముందుగా చెప్పితింటే అదేమీ చెప్పకుండానే స్కీతారామయ్య తిన్నాడు. వాళ్ళిద్దరూ తిన్నదానికి రెట్టింపు లాగించేడు - వాళ్ళతోబాటు వచ్చిన స్కీతారామయ్య అసిస్టెంటు చిన్‌మిన్ (అసలు పేరు చిన్నయ్యట)! అసలు రాంపండు ఎజెండాలో చిన్‌మిన్ లేడు. రాంపండు సీనులోకి రావడానికి ముందు వాలెంతింటా అతనంటే ఇష్టపడేదిట. కానీ ఇప్పుడు పట్టించుకోవడం మానేసింది. అయినా స్కీతారామయ్య పట్టుదల మీద అతన్నీ పిలవాల్సి వచ్చింది.

రాంపండు పరిచయం చేయగానే స్కీతారామయ్య 'కామ్రేడ్ అనంత్" అని పిలవడంతో అనంత్ ఇబ్బందిగా ఫీలయ్యాడు కానీ త్వరలోనే అది మర్చిపోయాడు, దానికి మించిన ఇబ్బందికర పరిస్థితులు ఎదురుకావడంతో. "మా వాడికి ఇంకా విప్లవం గురించి సరిగ్గా అవగాహన లేదు. నేను వాడిని క్రమంగా మారుస్తున్నాను. ఇప్పుడే కామ్రేడ్ అంటే వాడు ఉలిక్కిపడతాడు" అని రాంపండు అంటున్నా స్కీతారామయ్య కామ్రేడ్ అంటూనే అన్నాడు. ఇక బక్కచిక్కిన నక్కలా ఉన్న చిన్‌మిన్ తింటూన్నంతసేపూ "ఈ అన్నం ఎంతమంది పేదల స్వేదంతో ఉడికిందో" అంటూ పద్యాలు పాడాడు. "బొర్ర బాగా పెంచినావులే, బుర్ర పగలకొడతా" అని పాటలు పాడేడు. అక్కడ బొజ్జ పెంచినది స్కీతారామయ్యే అయినా అదేమిటో అనంతే ఎక్కువ సిగ్గుపడ్డాడు.

అచలపతి సాధ్యమైనంత వరకూ యజమానిని కాపాడేడు. విప్లవం గురించిన మాట వచ్చినప్పుడల్లా కంచంలో బిర్యానీ వడ్డించేడు. నోటినిండా స్వీట్లు కుక్కాడు. అవన్నీ గబగబా మింగేసి పద్యాలు పాడేడు చిన్‌మిన్. స్కీతారామయ్య కూడా తక్కువ తినలేదు. అచలపతి "సర్" అని అనంతాన్ని పిలుస్తూంటే చిరాకుపడ్డాడు. "కామ్రేడ్ అచలపతీ, విప్లవం రానీ, మనందరం కలసి, వీళ్ళందరినీ తందాం." అని ఓదార్చాడు. ఈ మాటలు అస్సలు పట్టించుకోనివాళ్ళు ఇద్దరే! రాంపండూ, వాలెంతింటా. వాళ్ళిద్దరి వ్యవహారాన్నీ బాగా పట్టించుకున్నవాడు ఒక్కడే- చిన్‌మిన్! ముఖ్యంగా తింటా రాంపండు వీపుమీద చరిచినప్పుడు, రాంపండు తింటా బుగ్గ గిల్లినప్పుడు ఆ నొప్పి అనుభవించింది అతనే!

అనంతానికి ఈ మూకను భరించడం ఒక ఎత్తు. వాళ్ళందరినీ పంపించి వచ్చాక రాంపండు చెప్పిన న్యూస్ మరో ఎత్తు.

"థాంక్సురా! తింటాకు మీ ఇల్లు బాగా నచ్చింది. విప్లవం వచ్చేదాకా ప్రతీవారం వాళ్ళందరికీ మీ ఇంట్లో భోజనం పెట్టించే షరతు మీద పెళ్ళి

చేసుకోవడానికి ఒప్పుకుందిరా, వాళ్ళ నాన్న తన మాటకు అడ్డుచెప్పడులే, కాస్త డబ్బు సమకూరితే చాలు. పెళ్ళి చేసేసుకోవడమే! వచ్చే ఆదివారం వంట ఏం చేయించాలో శనివారానికల్లా మెనూ ఇచ్చేస్తానులే...''

రాంపండు వెళ్ళిన అరగంట దాకా అనంతానికి నోరు పెగలలేదు. పెగిలాక 'అచలపతీ! విప్లవం ఎప్పుడు వస్తుందంటావ్?'' అని వాకబు చేశాడు.

"పై ఆదివారం లోపున వచ్చే సూచనలు లేవు సర్. ఈ అవస్థ భరించలేక అప్పటికి నేను రాజీనామా చేస్తాను కాబట్టి ఆ తర్వాత ఎప్పుడొచ్చినా నా కొకటే!''

"వీడి పెళ్ళి నా చావుకొచ్చిందయ్యా. వీడికి పెళ్ళి కాకుండా ఏదైనా చేయాల్సిందే!'

ఇది జరిగిన నాలుగు రోజులకి అనంతానికి రోడ్డు మీద సింహాద్రిరావుగారు కనబడ్డారు. పూలరంగడి లక్షణాలు పోయి కట్టెలరంగడి లక్షణాలు కనబడ్డాయి. పక్కనే ఉన్న రాంపండు విశదీకరించాడు. 'ఇవాళే మా బాబాయికి ఓ బెదిరింపు ఉత్తరం వచ్చింది.'' అని.

సింహాద్రిరావు తలాడించేడు. "అవును. నన్ను చంపేస్తారట. చేతిరాత గుర్తుపట్టకుండా ఎడంచేత్తో రాశారు. మీకు గుర్తుందిగా- ఆవేళ పార్కులో ఓ గడ్డపాడు మనల్ని బెదిరించలేదూ... వాడే అయి వుంటాడు. వాడి ముఖం మీకు గుర్తేగా? పోలీసులు అడిగితే గుర్తుపట్టగలరుగా?'

ఈ లోపునే రాంపండు కలగజేసుకున్నాడు. "అసలేమయిందంటే, నేను పొద్దున్న బాబాయిని పలకరిద్దామని వస్తూంటే ఓ గడ్డం వాడు నాకు ఎదురయ్యేడులే. అప్పుడు తెలియలేదు. ఉత్తరం చూశాక అర్థమయ్యింది. అయినా బాబాయ్, నీకు చెప్తూంటే వినవేంటి? ఈ స్టేజిలో పోలీసులకు చెబితే అనవసరమైన న్యూసెన్స్. నేను వెతుకుతానంటున్నానుగా. నాకు వదిలేయ్. ఇదిగో అనంత్ కూడా వచ్చాడు. కథలు రాస్తాడు కాబట్టి వాడి దగ్గర బోల్డు అయిడియాలుంటాయి. ఆ గడ్డపాణ్ని వెతికి పట్టుకుని నీ కప్పగిస్తా. నువ్వు ఇంటికెళ్ళి రెస్టుతీసుకో''.

"అవునవును. అనంత్ గారూ. మీరు నాకు సాయం చేయాలి''. అని సింహాద్రిరావు చెబ్తూండగానే రాంపండు ఆయన్ని తరిమేశాడు. ఆ తర్వాత విజయగర్వంతో అనంత్ కేసి చూస్తూ జేబులోంచి ఐదువేల రూపాయల కట్ట లాగాడు. "చూశావా? థైలం! మామూలుగా అడిగితే ఇచ్చాడా? అబ్బే! ప్రాణభీతి కలిగిస్తే డబ్బులు రాల్చాడు. గడ్డపాణ్ని వెతికిపట్టుకోవడానికి ఫస్ట్ ఇన్‌స్టాల్‌మెంట్. థైలపుబావిని తవ్వినకొద్దీ ఫలం''. అన్నాడు విలాసంగా నవ్వుతూ.

'ఆ డబ్బెట్టి ఏం చేస్తావ్? తింటాని పెళ్ళి చేసుకోవడానికి సరిపోతుందా?''

"పెళ్ళికి డబ్బు తక్కువ పడుతుంది. అందుకే "బ్లాక్ యారో'' గుర్రం మీద పందెం కాయబోతున్నా. పదిరెట్లు వస్తుంది. నువ్వూ కాయ్! గుర్రం మా బాబయ్యదేలే! మంచి ఫామ్‌లో ఉందిట''.

"నేనూ కాద్దామనుకుంటున్నానులే. పెళ్ళంటున్నావు... మీ చిన్‌మిన్‌గాడు అడ్డు పడడూ?''

"ఏడిశాడు. ఇవాళ తింటా నాతో సినిమాకి వస్తోంది. తోకలా వెంటరావద్దని వాడికి వార్నింగు ఇచ్చేసింది తెలుసా''.

----)(----

రేసుకోర్సులో కథ అడ్డం తిరిగింది. బ్లాక్ యారో అన్నిటికంటె చివరిగా, అంటే తరువాతి రేసులో ఫస్టు వచ్చేటంత చివరిగా... చేరింది. అనంత్ కాసిందంతా పోయింది. 'పోయింది చాలు, ఇంటికెళ్ళి పోదామనుకుంటూండగానే' దిగాలు మొహం వేసుకుని సింహాద్రిరావు కనబడ్డాడు. వెళ్ళి ఓదార్చబోతే 'గుర్రాలు కొంటాను కానీ దాని మీద పందాలు కాయడం నా సిద్ధాంతానికి వ్యతిరేకం' అన్నాడు. 'మరి మొహం అలావుందేం' అని అడిగితే "ఆ గడ్డపాడు అక్కడ ఉన్నాడు చూడండి. నన్నేమైనా చేస్తాడేమోని భయం'' అన్నాడు.

అవును. రాంపండు గడ్డం పెట్టుకుని స్పీచ్ దంచేస్తున్నాడు. ఉన్నదంతా బ్లాక్ యారో మీద పెట్టి ఊర్చుకుపోయిన బాధ అతని మాటల్లో తెలుస్తోంది. డబ్బున్నవాళ్ళు ప్రచార సాధనాలను గుప్పిట్లో పెట్టుకుని చచ్చు, పుచ్చు జట్కా గుర్రాలను మేలుజాతి గుర్రాలుగా నమ్మించి శ్రామికజీవుల కష్టార్జితాన్ని దోచుకోవడం గురించి నిప్పులు చెరుగుతున్నాడు. అతనిలాగే డబ్బు పోగొట్టుకున్న వాళ్ళందరూ ఆ నిప్పులకు విసనకర్ర విసురుతున్నారు.

చెలరేగిపోతున్న రాంపండు కంటికి వాళ్ళ బాబయ్య కనబడ్డాడు - "అడుగో, మనందరి చెమటకూడుని తన గిట్టలతో మట్టిపాలు చేసిన బ్లాక్ యారో స్వంతదారు అక్కడే ఉన్నాడు. పదండి. వాడి రక్తంతో మన జండాను తడుపుదాం.' అని అరిచాడు. పక్కనే ఉన్న సీతారామయ్య మెచ్చుకోలుగా తలవూపాడు. చిన్‌మిన్ అసూయతో రగిలిపోయాడు.

జనమంతా తనకేసి చూడడంతో సింహాద్రి ఖంగారుపడి పక్కనే ఉన్న పోలీసు దగ్గరకి వెళ్ళి "ఏమిటండీ, వాడలా అరుస్తూంటే మీరిలా ఊరుకుంటారు?'' అని అడిగేడు. పోలీసు చిద్విలాసంగా నవ్వి, "ఇదంతా సోడా గ్యాసులాటిదండి. ఇంకో రేసు మొదలవగానే వీళ్ళంతా ఇవి కట్టిపెట్టి బుకింగ్ దగ్గరకి పరిగెడతారు. మీరేమీ ఇదవకండి''. అన్నాడు.

ఈ లోపున చిన్‌మిన్ రాంపండుని పక్కకు తోసి, ఓ బెంచీ ఎక్కి తన ఉపన్యాసం మొదలుపెట్టాడు. ఫ్రెంచి విప్లవంతో మొదలుపెట్టి చెప్పుకువస్తున్నాడు. ప్రస్తుత సమస్య గుర్రాల గురించి అయితే పాతకథ ఎవడికి కావాలి? పైగా రాంపండు స్పీచులో ఉన్న ఫోర్సు చిన్‌మిన్‌కి లేదు. 'ఇక చాల్లేవోయ్, నువ్వు దిగి ఆ గడ్డపాణ్ణి మాట్లాడనియ్యి'' అన్నాడొకడు. ఆ మాత్రం మాటలు కూడా చెప్పే ఓపిక లేనివాళ్ళు ఈలలేసారు. చిన్‌మిన్‌కి ఒళ్ళు మండిపోయింది. ఏదో అనబోయి గుటకలు మింగాడు. అంతలోనే అతని చూపు బయటకు నడుస్తున్న సింహాద్రిరావు మీద పడింది. ఏదో ఐడియా అతని తలలో మెరిసింది.

"మహా ప్రజలారా! మీరెంత వెక్కిరించినా మన విప్లవం ముందుకు సాగుతూనే ఉంది. సమాజంలోని ఉన్నత వర్గాలలో కూడా పాకుతోంది. డబ్బున్న వాళ్ళలో కూడా కొంతమంది యువకులు మాతో చేరుతున్నారు. అంతెందుకు, ఆ గుర్రం యజమాని అన్నగారి కొడుకే మనమధ్య ఉన్నాడు''. అంటూ రాంపండు తేరుకొనే అతని గడ్డం లాగేశాడు చిన్‌మిన్.

----)(----

మర్నాడు అనంత్ నిద్రలేచేసరికి పొద్దెక్కింది.

కాఫీ ఇస్తూ 'రాంపండు గారు ఫోన్ చేశారు సర్. పోలీసు స్టేషన్లో ఉన్నాను వెయ్యిరూపాయలు లంచం ఇస్తే వదిలేస్తారట అని అంటే మీరు నిద్ర లేవలేదు కదానని నేనే మీ జేబులోంచి డబ్బు తీసి పంపాను సర్'' అన్నాడు అచలపతి.

"మంచి పని చేశావ్. లాకప్‌లో తన్నులు తినివుండడులే. ఓ పక్క వాళ్ళ బాబయ్య, ఇంకో పక్క జనాలు కొట్టిన దెబ్బలకు శరీరంలో ఏ భాగమూ ఖాళీగా మిగిలివుండదు. ఇంకెక్కడ కొడతారు పోలీసులు? అయినా నా కర్థం కాదు - సింహాద్రిరావుకి, రాంపండుకి ఉన్న బంధుత్వం గురించి ఆ

చిన్‌మిన్ గాడికి అనుమానం ఎలా వచ్చిందంటావ్? పోలికలు ఉన్నాయంటావా?" అడిగాడు అనంత్.

"ఉండే వుంటాయి సర్. పైగా నేను నోరుజారడం వల్ల కూడా చిన్‌మిన్‌కి అనుమానం వచ్చివుంటుంది".

"వాణ్ని నువ్వెక్కడ కలిశావ్?"

"చేపల బజార్లో! ఆదివారం సంతర్పణ కోసం చేపలు తేవడానికి వెళితే అక్కడ కనబడ్డాడు. తిండిమాట ఏదో వచ్చి, 'రాంపండుకి కూడా వాళ్ళ బాబయ్యపోలికే వచ్చింది. తిండియావ ఎక్కువయ్యి వాళ్ళ బాబయ్య వంటావిణ్ని చేసుకున్నాడు. ఈయన 'తింటా' అనే అమ్మాయిని చేసుకుంటున్నాడు. అన్నాను. అప్పటిదాకా వాళ్ళ పెళ్ళి విషయం చిన్‌మిన్‌కి తెలియదనుకుంటాను. కాస్త ఫీలయ్యాడు. రాంపండు గురించి ఇంకా ఎక్కువ అడిగితే చెప్పలేనన్నాను. అయినా అతను వాకబు చేశాడేమో మరి!"

అనంతం అచలపతికేసి చిరునవ్వుతో చూశాడు. "దేవాంతకుడివయ్యా! ఒక్క దెబ్బతో మనకు ఆదివారాల పీడ వదిల్చేసేవ్. మెచ్చాను పో. జేబులో ఆ వెయ్యి మిగలగా ఏదైనా మిగిలితే తీసేసుకో". అన్నాడు హుషారుగా.

అచలపతి వినయంగా వంగి, "మీరీమాట అంటారని ముందే ఊహించాను సర్. అందుకే జేబులో ఏమీ మిగల్చలేదు". అన్నాడు

(పి.జి.ఉడ్‌హవుస్ రాసిన 'కామ్రేడ్ బింగో', 'బింగో హేజ్ ఏ బ్యాడ్ గుడ్‌వుడ్' కథల ఆధారంగా)

-ఎమ్బీయస్ ప్రసాద్.

---

జస్ట్ ఫర్ ఫన్

# ఎవర్ని తిందాం?

అక్కడ ఫైవ్ స్టార్ హోటల్‌లోని మెనూలో ధర ముందు మనిషి ఫోటో, బరువు వుంటాయి. ఎందుకంటే అది నరమాంస భక్షకుల దేశం.కేన్సర్ సోకిన మనుషులు వాళ్ళకి పుచ్చువంకాయలతో సమానం. ఎందుకంటే వాళ్ళు నరమాంస భక్షకులు.

అక్కడ కొందరు ఉరి తీయబడ్డ వాళ్ళనే తింటారు. ఎందుకంటే నరమాంస భక్షకుల్లో వారు అహింసావాదులు.



అక్కడ బేంకుల్లో మనుషుల ఫారాలు తెరవడానికి లోన్స్ ఇస్తారు. ఎందుకంటే అవి నరమాంస భక్షకులు నడిపే బేంక్స్.

అక్కడ విస్కీలో సోడా బదులు రక్తం కలువుకుని తాగుతారు. ఎందుకంటే, వాళ్ళు నరమాంస భక్షకులు.

అక్కడ బంధుమిత్రులు మరణిస్తే, బయటకి ఏడ్చి, లోపల సంతోషపడతారంతా. ఎందుకంటే, వాళ్ళు నరమాంస భక్షకులు.

అక్కడ చికెన్, మటన్, ఫిష్, ప్రాన్స్‌లని మాత్రమే తినేవారు శాఖాహారులకింద లెక్క. ఎందుకంటే వాళ్ళు నరమాంస భక్షకులు.

అక్కడి ధనికులు పెళ్ళిళ్ళల్లో అతిథులకి వడ్డించే ఖరీదైన ఐటమ్ లేడీస్ ఫింగర్స్ ఫ్రై. లేడీస్ ఫింగర్స్‌కి అర్థం ఆడవాళ్ళ చేతివేళ్ళని తప్ప బెండకాయలని కాదు.

అక్కడ బీదవాళ్ళు పసి కందులనే తింటారు. ఎందుకంటే, వాళ్ళకి పెద్ద వాళ్ళని కొనుక్కునే డబ్బుండదు

అక్కడ పిటి ఉష, అశ్వనిలని అంతా ఇష్టపడతారు. ఎందుకంటే, వాళ్ళు 'ఫాస్ట్‌ఫుడ్స్' కాబట్టి.

ఆ దేశంలో పుట్టి పెరిగిన సుబ్బారావుతో అతని భార్య చెప్పింది.

"ఏమండి. రేపటికి అన్నంలోకి కూర లేదు. కూరలు తీసుకురండి"

"మనం కొత్తగా కొన్న ఫ్రిజ్‌లో ఏవో వుండాలిగా?" ప్రశ్నించాడు సుబ్బారావు. "ఫ్రిజ్‌ని మోసుకొచ్చిన ఇద్దరి గురించా మీరు చెప్పేది? నిన్నటితో వాళ్ళయిపోయారు"

"సర్లే, వెళ్ళొస్తాను"

సుబ్బారావు తన కొడుకుని, తుపాకిని తీసుకుని బయటికి నడిచాడు. ఇద్దరూ తమ ఊరి పొలిమేరల్లో వుండే అడవిలోకి వచ్చారు. ఓ కాలి బాట పక్కన దాక్కున్నారు. కొద్దిసేపటికి ఒకరెవరో స్కూటర్ మీద వస్తూ కనిపించారు.

"అడుగో నాన్నా. మీల్స్ ఆన్ వీల్స్" చెప్పాడు కొడుకు సంతోషంగా "స్కూటర్ మీద వెళ్ళే వాణ్ని గురిచూసి చంపటం కష్టం. నడిచి వెళ్ళే వాళ్ళే మనకి దక్కేది" చెప్పాడు సుబ్బారావు కొడుకు ఉత్సాహం చూసి.

మరికొద్ది సేపటికి ఓ ముసలాయన కర్రని తాటించుకుంటూ వస్తూ కనిపించాడు.

"అడుగో నాన్నా" చెప్పాడు కొడుకు ఉత్సాహంగా తుపాకీ సర్దుకుంటూ.

"లాభం లేదు, అతని వంటి మీద మాంసం మనకి ఉప్మాక్కూడా సరిపోదు. మోసుకెళ్ళడం దండగ" చెప్పాడు సుబ్బారావు.

మరికొద్ది సేపటికి బాగా లావుగావున్న ఒకతను వస్తూ కనిపించాడు.

"నాన్నా, మన నందులోని వాళ్ళందరికీ సరిపడేంత మాంసం వుంది వీడికి" చెప్పాడు కొడుకు



సంతోషంగా.

"ఒద్దొద్దు. వాడికున్న కొవ్వుకి మనకి హార్ట్ అటాక్ వస్తుంది. ఇలాంటి వాళ్ళని మనం ఎప్పుడూ తినకూడదు" ఆరోగ్య సూత్రం బోధించాడు సుబ్బారావు.

మరికొద్ది సేపటికి పాతికేళ్ళ వయసుగల సౌందర్యరాశి కులుకుతూ రాసాగింది.

"ఈమె మరీ సన్నమూ కాదు అలా అని లావూ కాదు. ఈమెని తీసుకెళ్దాం నాన్నా" చెప్పాడు కొడుకు తుపాకిని ఆమెకి గురిపెడుతూ.

"ఒద్దొద్దు... చూస్తుంటే కొరుక్కు తినాలనిపిస్తున్నా ఈమెని మనం తినకూడదు" వారించాడు సుబ్బారావు.

"ఏం? ఎందుకు తినకూడదు?" ప్రశ్నించాడు కొడుకు.

"ఎందుకంటే ఈమెని ప్రాణాలతో పట్టుకెళ్ళి మీ అమ్మని తిందాం" చెప్పాడు సుబ్బారావు ఆమె సౌందర్యాన్ని కళ్ళతోనే తాగేస్తూ.

-మల్లాది వెంకటకృష్ణమూర్తి

# పిచ్చి తెలివితేటల స్పెషల్



"అన్ని ప్రశ్నలూ రాశానన్నావ్....
మరి మార్కులు
సున్నా వచ్చాయేంటిరా?"
" జవాబులు కూడా
వ్రాయాలట నాన్నా"



"ఒరేయ్ వెధవా...ఎదురింటి
అమ్మాయిని చూసి బుద్ధి
తెచ్చుకో...ఆ అమ్మాయికి ఫస్ట్‌క్లాస్
వచ్చింది....."
"ఆ అమ్మాయిని రోజూ చూడ
బట్టేగా నేను పరీక్ష తప్పింది '





"నా ఆస్తంతా అనాథ శరణాలయానికి
రాసెయ్యాలని నిశ్చయించుకున్నా"
"అయితే రేపే నేను ఓ అనాథ
శరణాలయాన్ని స్థాపిస్తున్నా దానికి
రాసేయ్..."



"స్కూల్ పరుగు పందెంలో
నీకేమొచ్చిందిరా?"
"ఆయాసం..."



"తాతయ్యా ఓసారి - కాస్త - నీ,
కన్ను ముయ్యవా...ప్లీజ్...."
"ఎందుకురా"
"మరే..నువ్వు కన్నుమూస్తే మా
నాన్నకి బోలెడు ఆస్తి
వస్తుందట....అందుకని"



."ఒరేయ్ రేడియోకి, టి.వి.కి గల
తేడా ఏమిటో చెప్పు?"
"మీరు, మీ ఆవిడ ఇంట్లో
పోట్లాడుకుంటున్నారనుకోండి
అది రేడియో అండి. అదే వీధిలో
పోట్లాడుకుంటున్నారనుకోండి
అది టి.వి.అండి"

# పిచ్చి తెలివి తేటల స్పెషల్



"పాలిచ్చే పది జంతువుల పేర్లు చెప్పరా?"
"గేదె, మేక, గొర్రె, కుక్క మరియు ఆరు ఆవులు సార్..."



"కొత్తగా కొన్న మా కుక్కతో నువ్వు ఆడుకుంటావా?"
"మీ కుక్కని చూస్తుంటేనే భయమేస్తోంది. కొంపదీసి కరవదు కదా?"
"ఆ సంగతి కనుక్కుందామనే కదా నిన్ను ఆడుకోమని అడుగుతున్నా."





"లేదు అనే పదం నా డిక్షనరీలోనే ఉండదు"
"అలాగా ఏదీ నీ డిక్షనరీ... ఒకసారి చూణ్ణీ"
"సారీ.... అదిప్పుడు నా దగ్గర - లేదు."



"వాడేంట్రా నేనే గాంధీని అంటూ తెగ ప్రచారం చేసేసుకుంటున్నాడు"
"ఎవడో ఒకడు నేనే గాడ్సేని అని కాల్చిపారేస్తాల్లే బాధపడకు."



"అదేంట్రా.....బంగాళాదుంపల పొలంలో బ్లేడ్లు నాటుతున్నావ్?"
"చిప్స్ పండించదల్చుకున్నాలే... అందుకని..."



"ఏమ్మా...మీరు కథలు, కవితలు కాకుండా ఇంకేం రాస్తారు?"
"స్నో, పౌడర్...."



"తొందరగా దూకెయ్.....అవతల పోలీసులు వచ్చేస్తున్నారు"
నీకేమైనా పిచ్చెక్కిందా...మనం ఇప్పుడు పదమూడో అంతస్థులో వున్నాం."
"పదమూడో నంబరు, ఏడో నెంబరు అంటూ మూఢ నమ్మకాలు, చాదస్తాలు పెట్టుకోకు....దూకెయ్" అంటూ కసిరాడా నాస్తిక దొంగ.

# మధు 'మోహం' అను చక్కెర వ్యాధి



-జనార్ధన మహర్షి



'హాసం' పత్రికపై అవ్యాజమైన ప్రేమానురాగాలు కురిపించే వారిలో జనార్ధన మహర్షి ఒకరు. ఒక మంచి కథ రాస్తే 'హాసం'కే ఇవ్వాలన్న అభిమానం. ఆయన ప్రతీ చర్యలోనూ కనిపిస్తూ ఉంటుంది. ఈ కథను పూర్తి చేసిన వెంటనే ఫోన్ లోనే మొత్తం వినిపించి "బాపుగారి ఆర్టికల్ ఏ ఇష్యూలో వస్తుందో ఆ ఇష్యూలోనే ఈ కథను వెయ్యగలరా!?" అని అడగటంలోనే ఆ ప్రేమ, ఆ అభిమానం, ఆ చనువు అన్నీ అర్థమయిపోతాయి. ఆ అనుభూతిని పాఠకులు కూడా పంచుకోవటానికే ఉదహరించటం జరిగింది. ఈ కథపై మీ అభిప్రాయాలను పంపవలసిన చిరునామా:

**జనార్ధన మహర్షి**
**డి 2, కృష్ణా అపార్ట్‌మెంట్స్, ఎల్లారెడ్డిగూడా,**
**అమీర్‌పేట క్రాస్‌రోడ్స్, హైదరాబాద్-73**

'మధుమేహం' ఎలా 'మధు మోహం' అయ్యిందో తెలుసుకోవాలంటే పురుషోత్తంతో మీరు సూపర్ మార్కెట్‌కి వెళ్ళండి.

***

సూపర్ మార్కెట్‌లోకి అడుగుపెడుతున్న పురుషోత్తం చాలా డల్లుగా ఉన్నాడు.

పెళ్ళాం మాటలు పదేపదే గుర్తుకు వస్తున్నాయి.

"మర్యాదగా చెప్పండి - మీకు పక్కింటి మధుమతి మీద కన్నుపడింది కదూ" అని నెలరోజులుగా ప్రాణం తీసేస్తోంది.

"ఈ పక్కింటి మధు ఎవరో బాబు..." అని తెగ టెన్షన్ పడిపోతున్నాడు పురుషోత్తం.

దురదృష్టవశాత్తు.....

ఒక్కరోజు సరదాగా మార్నింగ్ వాక్ చేద్దామని డాబా మీదకి వెళ్ళిన పురుషోత్తంని చూసి, పక్కింటావిడ తలస్నానం చేసి వచ్చి జుత్తు ఆరబోసుకుంటూ నవ్విందట.... అది ఈయన గారి పెళ్ళాం కంట పడింది.

నిజానికి కథ ఇంతకుమించి ఏం లేదు.

ఆ రోజు నించీ ప్రాణం తీసేస్తోందీవిడ.

"మీకేం కావాలి సార్?" అడిగాడు సూపర్‌మార్కెట్ అతను.

"పక్కింటావిడ" అని నాలుక్కరుచుకొని, "రెండు కిలోలు షుగర్!" అంటూ... పురుషోత్తం ఒక్క అడుగు వేశాడు.

అంతే... కళ్ళు తిరిగాయి.

కాళ్ళు బ్యాలెన్స్ తప్పాయి.

అమాంతం కిందపడ్డాడు.

****

సూపర్ మార్కెట్‌లో పడ్డ వ్యక్తి సూపర్ స్పెషాలిటీ హాస్పటల్‌లో లేచాడు.

ఎదురుగా డాక్టర్

బ్లడ్ రిపోర్ట్స్ చూస్తూ.... నవ్వాడు.

పురుషోత్తం కంగారుగా..... "ఏమైంది సార్"

"అబ్బే ఏం లేదు.... మీరు సూపర్ మార్కెట్‌కి ఎందుకెళ్ళారు?"

"షుగర్ కోసం"

"ఇప్పుడు మీక్కూడా అదే వచ్చింది" అన్నాడు డాక్టర్ కూల్‌గా నవ్వుతూ.

"ఏంటి?..." అన్నాడు పురుషోత్తం బెంగగా-

"అవును సార్.... ఇక మీరు షుగర్ కోసం ఏ సూపర్ మార్కెట్‌కి వెళ్ళక్కర్లేదు.... మీ బాడీనే ఓ షుగర్ ఫ్యాక్టరీ..."

పురుషోత్తంకి చాలా భయం వేసేసింది.

"అసలు షుగర్ ఎలా వస్తుంది?" - సీరియస్‌గా అడిగాడు.

"చెరుకునించి..." డాక్టర్ నవ్వుతూ అన్నాడు.

పురుషోత్తంకి కడుపు మండిపోయింది. కానీ తన పెళ్ళాన్నే భరిస్తున్నవాడికి... ఈ కోపం ఒక లెక్కా. అందుకే వస్తున్న కోపాన్ని హాయిగా దాచేసుకుని....

"గురూజీ.... నేనేడుగుతోంది... ఈ షుగర్ నా ఒంట్లోకి ఎలా వచ్చిందని!?" అని అడిగారు.

డాక్టర్ మళ్ళీ నవ్వుతూ.... "మీ తాతగారికో, మీ నాన్నగారికో ఆల్రెడీ ఉండి ఉంటుంది - మీక్కొంత ఇచ్చి ఉంటారు" అన్నాడు. పురుషోత్తంకి ఠక్కున వాళ్ళ నాన్న గుర్తుకు వచ్చాడు.

"రేయ్.... నేను పోయే లోపల నీకు ఏదో ఒకటి ఇచ్చేసి వెళతానురా" అనేవాడు.

ఏదో ఒకటంటే... ఇళ్ళు అనుకున్నాడు గానీ - ఇలా ఫ్యాక్టరీ (షుగర్) ... ఇస్తాడనుకోలేదు.

దిగాలు పడి లేచాడు.

డాక్టర్ నవ్వుతూ.... "అంత దిగులు పడిపోకు.... రోజూ తినే తిండి కాస్త తగ్గించు...." అన్నాడు.

"నేనసలు సరిగ్గా తిండి తినను సార్ - ఎందుకంటే మా ఆవిడ వంట ఛండాలంగా చేస్తుంది.... వడ్డిస్తూ ఏవో చెత్త మాటలు మాట్లాడుతూనే ఉంటుంది. దాంతో నాకు అన్నం దిగదు".

"వెరీగుడ్ ... కుదిరితే ... మీ ఇంటి డాబా మీద ఎక్సర్‌సైజ్‌లు చెయ్యి...."

"వద్దు సార్.... ఒక్కసారి డాబా ఎక్కినందుకే.... నెల రోజులుగా మా ఆవిడ నన్ను నంజుకు తింటోంది".

"తీపి పదార్థాలు తినకండి... తీపి మాటలు వినకండి"

"నాకా అదృష్టం పెళ్ళితోనే పోయింది?"

డాక్టర్ ఆశ్చర్యంగా పురుషోత్తంకేసి చూశాడు.

***

ఆ వీధిలో చాలామందికి పురుషోత్తంకి షుగర్ వచ్చిందన్న వార్త

తెలిసిపోయింది.

కొందరు జాలి చూపించారు.

కొందరు ధైర్యం చెప్పారు... కొందరు తమలో మెంబర్ అయినందుకు ఆనంద పడ్డారు.

అతని షుగర్ వార్త వీధంతా తెలిసినా తన పెళ్ళానికి తెలీకుండా ఉండటానికి పురుషోత్తం విశ్వప్రయత్నం చేశాడు.

ఎందుకంటే....

సంపూర్ణమైన ఆరోగ్యం ఉంటేనే... "ఏంటెప్పుడూ రోగిష్టివాడిలా అలా నీరసంగా ఉంటావని" గేలిచేసే పెళ్ళానికి షుగర్ విషయం తెలిస్తే.... మరింత కామెంట్ చేస్తుందని భయం.

కానీ... దురదృష్టం... ఆ రోగం విషయం.

అతని పెళ్ళానికి తెలిసి పోయింది - కానీ వెరైటీగా తెలిసింది. అదెలాగంటే....

ఓ రోజు ఇంట్లోకి వస్తున్న పురుషోత్తంని... గేట్ బయట ఆపి ఆ వీధి చివర ఉండే తెలుగు మాస్టారు బాధగా అడిగాడు.

"మధు మోహం అటగా" అని (మధు మేహం అనటంలో తప్పుదొర్లింది - తెలుగు మాస్టారు కదా)

ఆ మాట పెళ్ళాం చెవిన పడింది -

పురుషోత్తం "అవును" తలూపాడు.

ఆ ఊపడం పెళ్ళాం కంట కూడా పడింది.

"ఓరి చచ్చినోడా!.... నీ మధు మోహం విషయం ఊరంతా తెలిసిపోయిందా. ఎంతకు బరి తెగించావురా... పైగా దాని మీద మోహం ఉందని సిగ్గులేకుండా తలూపుతూ చెబుతావా!?" అన్న పెళ్ళాం మాటలకి షాక్ తిన్నాడు పురుషోత్తం.

"మధుమోహం" అంటే పక్కింటి మధు మీద మోహం అనుకుంది పెళ్ళాం అని 'తెగ' బెంగ పడిపోయాడు పురుషోత్తం.

బెంగతోపాటు - టెంక్షన్, కోపం చిరాకు వచ్చాయి.

ఆ టెంక్షన్‌లో పురుషోత్తంకి వాళ్ళ అమ్మ గుర్తుకు వచ్చింది.

సత్వరున స్కూటర్ ఎక్కి..... హోం ఏజ్‌లో ఉన్న వాళ్ళ అమ్మ దగ్గరకి వెళ్ళాడు.

****

హోం ఏజ్‌లో ఉన్న పురుషోత్తం అమ్మకి ఒక్కసారిగా ఆనందం పొంగింది-

చాలా రోజుల తర్వాత తనని చూడడానికి వచ్చిన కొడుకుని చూసి!

వచ్చీరాగానే ..... పురుషోత్తం తల్లిమీద రెచ్చిపోయాడు-

"నాకు షుగర్ వచ్చిందే .... మీ ఆయన పుణ్యాం...." అన్నాడు.

తల్లి లాగి పెట్టికొట్టింది.

"మా ఆయనకే రోగాలు లేవురా..."

బిత్తరపోయి చూశాడు పురుషోత్తం.

"నీకు ఒక్క షుగరే కాదురా... బి.పి., హార్ట్ ఎటాక్ కూడా వస్తాయి" ఆవేశంగా అంది తల్లి.

పురుషోత్తం షాక్ అయ్యి తల్లికేసి చూశాడు.

"నువ్వసలు తల్లి వేనా?.... కొడుకు నిన్ని శాపనార్థాలు పెడ తావా"

"నువ్వసలు నాకొడుకులా ఎప్పుడున్నావురా?"

పురుషోత్తం ఏం మాట్లాడలేదు. నిజమే. పెళ్ళి అయ్యాక పెళ్ళాం మాటలు విని తల్లిని దూరం చేసుకున్నాడు-

తల్లి అంది పురుషోత్తం కేసి చూస్తూ.... "రేయ్ నీ ఒంట్లోని షుగర్‌కి కారణం.... మీ నాన్న కాదురా. నీ పెళ్ళాం".

షాక్ అయ్యాడు పురుషోత్తం.

"పెళ్ళాం పెట్టే టెంక్షన్స్‌ని భరించావ్.... అందుకే నీకీ రోగం వచ్చింది, పెళ్ళయాక... తియ్యటి దాంపత్యాన్ని అనుభవించాల్సిన నువ్వు... బానిసత్వం అనుభవిస్తున్నావ్... మొగుడిలా కాక పనోడిలా పడి ఉన్నావ్."

పురుషోత్తం తల దించుకున్నాడు.

ఇంతలో తల్లి తేరుకొని, వెంటనే మళ్ళీ మామూలుగా

"నీ బాధ చూడలేక నా బాధ కక్కేశాన్రా ఏం అనుకోకు"... అంది.

ఆమె కళ్ళలో నీళ్ళు చూశాడు పురుషోత్తం. మళ్ళీ వెంటనే "రేయ్.... నాన్నా... ఆరోగ్యం జాగ్రత్తరా" అంది, గద్గదస్వరంతో

ఈసారి పురుషోత్తం కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

****

లోపలకి వస్తున్న పురుషోత్తంని... ఇంటి బయటే నిలదీసింది. అతని పెళ్ళాం -

"ఏంటి నీకు షుగర్ వచ్చిందటగా"

పురుషోత్తం లాగి పెట్టికొట్టాడు. "వచ్చింది షుగర్ కాదు - మా అమ్మ" అని వెనక్కి తిరిగి తల్లికేసి... "రామ్మా" అన్నాడు తియ్యగా.

# విజేతలైన 5 గురు సినీ సంగీతాభిమానులకు

## సంవత్సరం పాటు.... ఉచితంగా....

## 'హాసం' హాస్య-సంగీత పత్రిక













1. ఘంటసాల, భానుమతి పాడిన తొలియుగళ గీతం 'స్వర్గసీమ' (1945)లో గాజులపిల్ల పాట అయితే...... వారి చివరి యుగళ గీతం గల చిత్రం పేరేమిటి? ఆ పాట పల్లవి ఏమిటి?

2. ఘంటసాల, నాగయ్య పాడిన 'తెనాలి రామకృష్ణ' (1956) చిత్రం లోని 'గండుపిల్లి మేనుమరచి' పాటకు అక్కినేని, నాగయ్య నటించారు. అలాగే అక్కినేని, నాగయ్య నటించగా ఘంటసాల, నాగయ్య పాడిన మరోపాట ఏది? ఏ చిత్రంలో?

3. ఘంటసాల పాడిన 'దేవదేవ ధవళా చలమందిర' పాటకు (కొనసాగింపుతో కలిపి) ఎన్.టి.ఆర్., ఏయన్నార్ కలిసి నటించారు. అటువంటి సంఘటన తిరిగి వారిద్దరూ కలిసి నటించిన రెండు చిత్రాలలో జరిగింది. (పాట రూపంలో, పద్య రూపంలో) ఆ చిత్రాలేమిటి? ఆ పాట, ఆ పద్యం యొక్క తొలి వాక్యాలేమిటి?

4. ఘంటసాల, బాలు కలిసి పాడిన పాటలలో పింగళి రాసిన పాట పల్లవి ఏమిటి? ఏ చిత్రం లోనిదాపాట?

5. ఘంటసాల, సుశీల కలిసి పాడిన ఓ పాట పల్లవిలో 'హాసం' అనే మాట వస్తుంది. ఆ పాట పల్లవి ఏమిటి? ఏ చిత్రంలో?

పైనున్న ప్రశ్నలకు సమాధానాలను తెల్ల కాగితంపై వ్రాసి దిగువన ఉన్న కూపన్‌తో జతపరిచి 'హాసం' అడ్రసుకు పంపండి. కరెక్టుగా రాసిన 5గురికి 'హాసం' హాస్య - సంగీత పత్రిక సంవత్సరం పాటు (మార్చి 2002 నుంచి ఫిబ్రవరి 2003 వరకు) ఉచితంగా పంపబడుతుంది. కూపన్ మాకు చేరవలసిన ఆఖరు తేది 15-2-2002.

**కూపన్**

పేరు............................................................

పూర్తి చిరునామా...................................................

...................................................................

...................................................................

...................................................................

**ఈ క్విజ్‌ను స్పాన్సర్ చేసిన వారు: చల్లా సుబ్బారాయుడు.**

ఘంటసాల స్వర నిలయం, కనిగిరి, ప్రకాశం జిల్లా

# బిసీజ్ బ్రహ్మానందం...

## ఫిబ్రవరి 1...

రేలంగి, రాజ్‌బాబు తరువాత తెలుగు సినిమాల్లో హాస్యానికి హీరో ఇమేజ్‌ని కల్పించిన బ్రహ్మానందం పుట్టిన రోజు... అందుకని ఫోన్ చేసింది 'హాసం'

**"హలో... బ్రహ్మానందం గారూ..."**

**"హలో... గుడ్ మార్నింగ్ చెప్పండి" అన్నారు బ్రహ్మానందం అవతల్నుంచి**

**"సరే మీరు కోరినట్టుగానే... గుడ్ మార్నింగ్...! గుడ్ మార్నింగ్ చెప్పేం కదా...ఇక మొదలు పెట్టొచ్చా..."**

**"మీతో వచ్చిన చిక్కే యిది. ఎక్కడ కావాలంటే అక్కడ కామాలు ఫుల్ స్టాపులు పెట్టేసుకుని కామెడీ చేసేస్తారు"**

**"మరి మీతో ఇంటర్వ్యూ అంటే... ఆ ఇంట్రడక్షన్‌కి ఈ మాత్రం బిల్డప్ లేకపోతే ఎలా!?"**

**"బాబోయ్... ఫోను పడేసి వెంటనే బయల్దేరి రండి... లేకపోతే లేనిపోని ఎక్స్‌ప్రెషన్లు వర్కవుట్ అవుతాయి"**

సరేనని బ్రహ్మానందంని పర్సనల్‌గా కలిసింది 'హాసం'

అక్కడ ఆయనతో పంచుకున్న మనోభావాలను - ప్రశ్న, సమాధానంలాంటి రొటీన్ టైపు ఇంటర్వ్యూలా కాకుండా -ఇలా మీ ముందుంచితే వెరైటీగా ఉంటుందేమోనన్న చేసిన చిన్ని ప్రయత్నమే

**ఇది...**

అరే నీకేరా ఫోను

అరే నీకేరా ఫోను

**అరే... నీకేరా ఫోను**

## ప్రత్యేకత కలిగిన చిత్రాలు

ఎక్కువ డైలాగులున్నది - చిత్రం భళారే విచిత్రం
తక్కువ డైలాగులున్నది - మనీ
అసలు డైలాగులు లేనిది - వినోదం

## ప్రత్యేకత కలిగిన పాత్రలు - చిత్రాలు

కుంటివాడిగా - 'లారీ డ్రైవర్'
గుడ్డివాడిగా - 'వన్ బై టూ'
మూగవాడిగా - 'ఊయల'
నత్తివాడిగా - 'అహనా పెళ్ళంట'



## బ్రహ్మానందం చెప్పిన జోకులు

"ఈ పాటి కవిత్వం నేనూ రాయగలను" అని ఒకడన్నాడట శ్రీ శ్రీతో ఆయన రాసినవి చదివి "నేను రాసేది నీలాటి వాడితో కవిత్వం రాయించడానికే" అన్నాట్ట శ్రీశ్రీ.

• • •

తనికెళ్ళ భరణి రాసిన 'పరికిణీ'
కవితల పుస్తకం ఆవిష్కరణ సభలో బ్రహ్మానందం ప్రసంగించడం జరిగింది. ఆ ప్రసంగానికి అందరూ ముగ్దులయ్యారు. ప్రశంసించారు.
"పుస్తకం రాసిన నాకన్నా ప్రసంగించిన నీకే ఎక్కువ పేరొచ్చింది" అన్నారు భరణి నవ్వుతూ.
దానికి బ్రహ్మానందం సమాధానం -
"సబ్బుకంటే నురగ అందంగా ఉండొచ్చు, కానీ సబ్బు లేందే నురగలేదు"

• • •

"అమ్మా! కుంటాణ్ణి"
"వెళ్ళిరా"
"బాబూ! గుడ్డోణ్ణి"
"వెళ్ళిరా"
"ఏడుకొండల వాడా వెంకటరమణా"
"వస్తున్నా ఉండు"
(మన వాళ్ళ దానగుణంకి సంబంధించిన మనస్తత్వాలమీద బ్రహ్మానందం వేసిన వ్యంగ్య బాణమిది.)

## బాధపెట్టే విషయం

తను కన్న ఆరుగురు పిల్లలకోసం వేరుశనగ కాయల్ని కొంగులో ఆరుముళ్ళుగా కట్టి అందరికీ "ఇదిగో నీవంతు" అంటూ అనురాగాన్ని సమానంగా పంచిన మా అమ్మ నా సక్సెస్‌ని పూర్తిగా చూడకుండా వెళ్ళిపోయింది. నాకు ఏ బాధయినా ఈ బాధకన్న ఎక్కువ కాదు.

## ఆనందానికి పరాకాష్ట

**'చంటబ్బాయ్' షూటింగ్‌లో...**
మా గురువు గారు జంధ్యాల నన్ను చిరంజీవి గారికి పరిచయం చేస్తే ఆయన నా మిమిక్రీని ఫుల్ లెంగ్త్‌లో విని "నీ లాంటివారు ఇండస్ట్రీకి కావాలి" అంటూ ఫ్లయిట్ టిక్కెట్ కొని విమానం ఎక్కించి తన పక్కసీట్లోనే కూర్చోబెట్టుకొని మద్రాసుకి తీసుకువెళ్ళడం తల్చుకుంటే నా జీవితంలో ఏ ఆనందమైనా దీనికన్నా తక్కువే అని అనిపిస్తుంది.

## ఓ అలవాటు

**ప్రతి సంవత్సరం వినాయక చవితినాడు తన ఇంట్లో పూజకు ఉపయోగించే వినాయకుని విగ్రహాన్ని స్వయంగా తయారుచేసుకోవటం బ్రహ్మానందం అలవాట్లలో ఒకటి.**

## ఇతర హాస్య నటులలో బ్రహ్మానందం ఇష్టపడే ప్రత్యేకతలు

**కోట** నటన
**సుధాకర్** డిక్షన్
**ఆలీ** అల్లరి
**ఎమ్మెస్** టైమింగ్
**మల్లికార్జునరావు** బాడీ లాంగ్వేజ్
**జూ॥ వేణుమాధవ్** స్పాంటేనిటీ
**సునీల్** శ్లాంగ్

## బ్రహ్మానందం చెప్పిన కొటేషన్లు

1. కమేడియన్లు లేకుండా సినిమాలు తియ్యొచ్చేమో గానీ
కామెడీ లేకుండా సినిమాలు తియ్యలేరు.
2. చాప్లిన్ ప్రపంచ ప్రఖ్యాతి పొందడానికి కారణం
ఆయన కామెడీకి లాంగ్వేజి లేదు కనుక

## నచ్చిన చిత్రాలు

**'అమ్మ'**
**'నాన్న (గారు)'**
**'బాబాయ్ (హోటల్)'**
**'అన్న'**

## సాహితీపరంగా ఇష్టపడేది

| | |
|---|---|
| ప్రాచీన కవులలో | : బమ్మెర పోతన కవిత్వం |
| ఆధునిక కవులలో | : తనికెళ్ళ భరణి కవిత్వం |

## బ్రహ్మానందం ఎప్పుడూ తల్చుకునే కొటేషన్లు

ఎవరి కళ్ళలో దయాగుణం కనిపిస్తుందో ఆ కళ్ళు కలిగిన ప్రతిజీవి అందమైనదే
-మదర్ థెరిసా

• • •

మనింట్లో మన ఫోటోలు ఉండకూడదన్నారు అక్కినేని నాగేశ్వరరావు గారు.
"అదేంటి?" అన్నాన్నేను.
"మన ఫోటోలు ఇంకొకళ్ళ ఇంట్లో ఉండాలి" అని అన్నారాయన.

• • •

యజ్ఞాలకి, యాగాలకి కోళ్లని, మేకల్ని బలిస్తారు కానీ పులుల్ని, సింహాల్ని కాదు

• • •

చేతులెత్తి నమస్కరిస్తేనే దేవుడు పేదవాళ్ళ కోర్కెలు తీరుస్తాడన్న మాట, నిజమైతే ధనవంతులు పేదవాళ్ళ చేతులెప్పుడో నరికేసేవారు.

• • •

ఒకర్ని గురించి చెడు మాట్లాడుకుంటే అది అవతలివారి చెడుకాదు. మన అజ్ఞానం.

• • •

కాళ్ళు తడవకుండా సముద్రాన్నయినా దాటగలం కాని కళ్ళు తడవకుండా జీవితాన్ని దాటలేం.

# ఈ బొమ్మ కూడా బ్రహ్మానందం వేసిందే...



అదెలా జరిగిందంటే... గత సంవత్సరం శివరాత్రి రోజున...

"జాగారం ఉండొచ్చుకదా!?" అని అడిగారు బ్రహ్మానందం సతీమణి లక్ష్మి.

"జాగారం అంటూ చీట్లపేక ఆడతారు - భక్తితో సంబంధంలేని సినిమాలు చూస్తారు. పిచ్చి పిచ్చి పాటలు వింటారు. పాడతారు. దాని బదులు పడుకుంటేనే బెటర్ కదా!? అన్నారు బ్రహ్మానందం.

"అలా కాకుండా భక్తితోనే మీరు జాగరణ చెయ్యొచ్చుకదా!?" అన్నారు లక్ష్మి

"నేను వెంకటేశ్వరుడి భక్తుణ్ణి. శివరాత్రికి జాగరణ ఉండటం ఏమిటి?" అన్నారు బ్రహ్మానందం సరదాగా

"ఏం... వెంకటేశ్వరుడిలో ఈశ్వరుడు లేడా?" అని ప్రశ్నించారు లక్ష్మి.

ఎంతో డెప్త్ ఉంటేనేగాని అవగాహనకాని ఆ మాటలోని అంతరార్థం బ్రహ్మానందాన్ని ఆలోచనలో పడేసింది. వెంటనే పేపరు, పెన్సిలు అందుకున్నారు... ఒకవైపు నుంచి చూస్తే వెంకటేశ్వరునిలాగా మరో వైపునుంచి చూస్తే ఈశ్వరునిలాగా కనిపించే బొమ్మను వేసుకుంటూ పోయారు. తెల్లారింది. బొమ్మ పూర్తయింది. అదే ఈ బొమ్మ.

# ఎప్పుడూ వినే పాటలు



1. **అందమె ఆనందం** (బ్రతుకు తెరువు)
2. **సడి సేయకో గాలి** (రాజమకుటం)
3. **రసిక రాజ తగు వారము కామా** (జయభేరి)
4. **మనసున మల్లెలమాల లూగెనే** (మల్లీశ్వరి)
5. **జీవితమే సఫలము** (అనార్కలి)
6. **మానసవీణా మధుగీతం** (పంతులమ్మ)
7. **పాడెద నీ నామమె గోపాలా** (అమాయకురాలు)

ఈ పాటల ప్రస్తావన వస్తే బ్రహ్మానందం మూడ్‌లోకి వెళ్ళిపోతారు.

ముఖ్యంగా '**మనసున మల్లెలు**' పాట దగ్గర ఆగిపోతారు.

**నీవు వచ్చేవనని నీ పిలుపే విని కన్నుల నీరిడి**

**కలయ చూచితిని**

"ఈ వాక్యాలు చూస్తుంటే - రామాయణంలో శబరికి రాముడు వస్తున్నాడన్న ఆనందంతో కళ్ళనిండా నీరు కమ్మితే రాముణ్ణి సరిగా చూడలేక పోతున్నానని బాధపడిందట. ఆ ఎక్స్‌ప్రెషన్‌లా లేదూ!?"

**గడియ యేని ఇక విడిచిపోకుమా**

**ఎగసిన హృదయము పగులనీకుమా**

"ఏం రాశారు దేవులపల్లి!? హృదయం ఎగసిపోయి ఎన్లార్జ్ అయిపోయింది.

ఒక చిన్న సూది చాలు ఫట్‌మని పగిలి పోవటానికి...

దయచేసి ఈ హృదయాన్ని పగల నీయకు...

ఆ హా హా!

వరల్డ్ లైబ్రరీలో పెట్టదగ్గ వాక్యాలివి" అని అంటారు బ్రహ్మానందం తన్మయత్వంతో.

# గర్వపడే విషయాలు

**బాలచందర్,**

**విఠలాచార్య,**

**కమలాకర కామేశ్వరరావు,**

**వి. మధుసూదనరావు**

వంటి సీనియర్ దర్శకుల దగ్గర...

**ఫాజిల్, ఐ.వి. శశి, జోషి, ప్రియదర్శన్**

వంటి పరభాషా దర్శకుల దగ్గర ...

**సూర్యకాంతం, రాజనాల, కాంతారావు, నాగభూషణం, యస్. వరలక్ష్మి, అంజలి,** గీతాంజలి వంటి సీనియర్ ఆర్టిస్టుల పక్కన ...

**ఎన్.టి.ఆర్., బాలకృష్ణ జూనియర్ ఎన్.టి.ఆర్., ఏయన్నార్, నాగార్జున, సుమంత్, అఖిల్, కృష్ణ, రమేష్‌బాబు, మహేష్‌బాబు**

ఇలా ఒకే కుటుంబం నుండి తరాల వారిగా వచ్చిన నటులతో ...

## నటించడం.

# సెల్‌ఫోనూ - సెల్ఫ్‌టోనూ

సినిమా ఇండస్ట్రీలో సెల్‌ఫోన్‌లు ఆల్మోస్ట్ అందరిదగ్గరా ఉంటాయి. కొన్ని సెల్‌ఫోన్‌లకు ఎవరికి ఏ విధంగా రింగ్ కావాలో ఆ విధంగా అమర్చుకునే సౌకర్యం ఉంటుంది. కొంతమంది 'సారే జహాసే అచ్చా' ట్యూన్‌ని, మరికొంత మంది 'ఛాయా' అనే సినిమాలో తలత్ మహ్మద్ పాడిన 'ఇత్‌నన ముఝ్ సే తో ప్యార్ బఢా' పాట ట్యూన్‌ని... ఇలా దొరికినంత వరకు తమకిష్టమైన ట్యూన్‌ని సెలక్ట్ చేసుకొని రింగ్ అలా వచ్చేట్టు అమర్చుకోవచ్చు. కానీ బ్రహ్మానంద్ సెల్‌కి వచ్చే రింగ్ ఎలా ఉంటుందంటే... ఎవరైనా ఫోన్ చేస్తే

"అరే నీకేరా ఫోను

అరే నీకేరా ఫోను

**అరే... బ్రహ్మానందం నీకేరా ఫోను"**

ఫోన్ తియ్యకుండా ఉంటే మళ్ళీ రిపీట్ అవుతుంది.

"అరే నీకేరా ఫోను

అరే నీకేరా ఫోను

**అరే బ్రహ్మానందం నీకేరా ఫోను"**

ఇలా వాయిస్ పెరుగుతూ కాల్ కనెక్ట్ చేసుకునే వరకు వస్తూనే ఉంటుంది.

విచిత్రం ఏమిటంటే అలా ఆ సెల్‌ఫోన్‌లోంచి వినిపించే వాయిస్ కూడా బ్రహ్మానందందే.

తనను తాను హెచ్చరించుకోవటానికి అలా అరేంజ్ చేసుకున్నారన్నమాట. తన మీద తనే ప్రాక్టికల్ జోక్ వేసుకునే వాళ్ళు, తనను తాను తెలుసుకునేవాళ్ళు బహు అరుదు. అటువంటి అరుదైన మనుషుల్లో బ్రహ్మానందం ఒకరని నిరూపించే సంఘటన యిది.

# నువ్వు లేక నేను లేను



గుజరాత్‌కి చెందిన ఈ అందాల బొమ్మ పుట్టి పెరిగిందంతా అమెరికాలోనే. 'నువ్వు నాకు నచ్చావ్' చిత్రంతో తెలుగు తెరపై అరంగేట్రం చేసిన ఆర్తి బాగానే ఆఫర్లను సంపాదించుకుంటోంది. ఆమె రెండో సినిమా 'నువ్వు లేక నేను లేను' కూడా హిట్ కావడంతో ఆమె వదనంలో ఆనందం తాండవిస్తోంది. ఈ సినిమాలో ఆర్తి మనసు దోచుకున్న పాట గురించి అడిగితే ఇలా వివరించింది. "ఈ సినిమాలో ఆరు పాటలుంటే, ఐదు పాటల్లో నేను అభినయించాను. ఆ ఐదూ ఐదు రకాల స్టయిల్స్‌లో వున్నాయి. తెలుగు నాకు అర్థం కాక పోయినా గానీ, మ్యూజిక్ వింటుంటే హాయిగా వుంది. ఈ పాటల్లో మోడ్రన్ డ్రెస్‌లతో పాటు సంప్రదాయ బద్ధంగా లంగా వోణీల్లో నటించాను".





# మనసంతా నువ్వే

'తూనీగా తూనీగా' పాటను తక కిష్టమైన పాటగా పేర్కొంటున్నారు గేయరచయిత సుద్దాల అశోక్‌తేజ. తనను ఆ పాట ఏ విధంగా స్పందింపజేసిందో అందంగా ఇలా వివరించారు. "ఈ పాటను నాకే కాదు, మా ఫ్యామిలీ అందరికీ నచ్చింది. ఈ పాటలో అందమైన బాల్యం వుంది. అంతర్లీనంగా స్నేహం పొంగిపొర్లుతూ వుంది. స్నేహాన్ని గాఢంగా చెప్పనూ వచ్చు, లేలేతగా కూడానూ చెప్పవచ్చు. ఈ పాటలో స్నేహాన్ని చాలాచాలా లేలేతగా చెప్పుకొచ్చారు. సీతారామశాస్త్రి గారిలో వున్న గొప్పతనమే అంత. ఏ భావం కావాల్సినా ఆ రూట్‌లోకి దర్జాగా వెళ్ళిపోతారు. ఆయన సిరా చుక్క పడితే చాలు ఆ భావానికే ఓ వెన్నెల. అందుకే ఆయన సిరివెన్నెల కాదు, 'సిరా' 'వెన్నెల'.



# కలుసుకోవాలని



'చిత్రం', 'నువ్వు-నేను', 'మనసంతా నువ్వే' చిత్రాల తర్వాత ఉదయ్‌కిరణ్ చేస్తున్న నాలుగో చిత్రమిది. సక్సెస్‌ఫుల్ హీరోగా స్టాండ్ కావడం కోసం ఉదయకిరణ్ అన్ని విషయాల్లోనూ స్పెషల్ కేర్ తీసుకుంటున్నారు. 'కలుసుకోవాలని' చిత్రం తన కెరీర్‌కు మరింత ప్లస్ అవుతుందనే ఆశాభావంతో వున్నారు ఉదయ్. ఈ సినిమాలో తనకు నచ్చిన పాట గురించి అడిగితే "మొత్తం పాటలన్నీ సూపర్బ్‌గా వున్నాయి. లిరిక్స్ కూడా ఫెంటాస్టిక్. 'ఉదయించిన సూర్యుడు' పాట అయితే నాకు తెగ నచ్చేసింది. మ్యూజిక్ నా సినిమాలకెప్పుడూ ప్లస్ పాయింటే. దేవిశ్రీప్రసాద్ మ్యూజిక్‌ని నేను బాగా లైక్ చేస్తాను. నాలాగానే అతను కూడా సెలెక్టివ్‌గా సినిమాలు చేస్తున్నాడు. ఈ సినిమాలో రెయిన్ సాంగ్ ఒకటుంది. అది బాగా ఆకట్టుకుంటుందని నా నమ్మకం." అని చెప్పుకొచ్చారు ఉదయకిరణ్.

# ఓ చినదాన

'తిరుమల తిరుపతి వెంకటేశ'తో దర్శకుడైన సత్తిబాబుకిది రెండో చిత్రం. ఈ చిత్రంలో తనకిష్టమైన పాటగా టైటిల్ సాంగ్‌ని పేర్కొంటున్నారు. "ఈ సినిమాలో టైటిల్‌సాంగ్ చాలా హైలెట్. సీతారామ శాస్త్రిగారు అద్భుతమైన సాహిత్యాన్ని అందజేసారు. ఆయన రాసి వినిపించగానే సెకండ్ థాట్ లేకుండా ఓకే చేసాను. ప్రేమ యొక్క గొప్పతనం గురించి చాలా చిలిపిగా వివరించడం జరిగింది. సాహిత్యానికి తగిన మంచి బీట్ ఇది. 2002 పాపులర్ సాంగ్స్ లిస్ట్‌లో ఇది కూడా వుంటుంది. 'ఓ చినదాన' ఆడియో రిలీజ్ కాగానే అందరూ ఏకగ్రీవంగా టైటిల్ సాంగ్ గురించే చెబుతున్నారు. డిఫరెంట్ సాంగ్ కాబట్టి పెక్యులర్ వాయిస్‌తో పాడించాలని జూనియర్ మహ్మద్ రఫీగా పేరు తెచ్చుకున్న దేవాశిష్‌తో పాడించడం జరిగింది. ఈ సినిమాతో సంగీత దర్శకుడు విద్యాసాగర్‌కు తెలుగులో మంచి బ్రేక్ వస్తుంది" అని తెలిపారు సత్తిబాబు.



## నువ్వు నాకు నచ్చావ్

చిన్న వయసులోనే సంగీత దర్శకుడిగా మంచి పేరుని సంపాదించుకున్న దేవిశ్రీ ప్రసాద్ ఎవరో తెలుసా? ప్రముఖ సినీ రచయిత సత్యమూర్తి తనయుడు.



'ఆనందం'లో సక్సెస్‌ఫుల్ మ్యూజిక్‌నిచ్చిన దేవి 'కలుసుకోవాలని'తో తన రేంజ్‌ని పెంచుకున్నాడు. ఈ మధ్యకాలంలో తనని బాగా ఇన్‌స్పైర్ చేసిన పాటగా 'నువ్వు నాకు నచ్చావ్' చిత్రంలోని 'నా చూపె నిను వెదికినది. నీ వైపే నను తరిమినది' పాటను ప్రత్యేకంగా పేర్కొన్నారు. ఈ పాట తనకు నచ్చడానికి గల కారణాలు వివరిస్తూ - "పాట మొత్తంగా బాగుంది. అది సంగీత ప్రతిభో, సాహిత్య ప్రతిభో తెలియనంతగా మిక్స్ అయిపోయింది. పాటలో అందమైన లయ వుంది. ఆ బీట్‌కి తగ్గట్టుగా మంచి పొయిట్రీ పడింది" అని చెప్పారు దేవిశ్రీప్రసాద్.

## టక్కరిదొంగ

గతంలో పాపులర్ మ్యూజిక్ డైరెక్టర్స్‌గా పేరు తెచ్చుకున్న 'రాజ్ - కోటి' జంటలో ఒకరైన రాజ్ 'సిసింద్రీ' సినిమా నుండి తానే ఒంటరిగా సంగీతం సమకూరుస్తున్నారు.



ప్రస్తుతం 'లగ్నపత్రిక' మొదలైన చిత్రాలకు ఆయన సంగీతం సమకూరుస్తున్నారు. అలాగే టీవీ సీరియల్స్ క్కూడా సంగీతాన్ని అందిస్తున్నారు. రీ రికార్డింగ్ విషయంలో ఆయనది అందె వేసిన చేయి. పాట విడుపుగా అప్పుడప్పుడు కొన్ని సినిమాల్లో పాత్రలు పోషిస్తున్నా రాజ్ తాజాగా 'టక్కరిదొంగ'లో ఓ వెరైటీ పాత్రను పోషించారు. ఈ సినిమాలో తనకు నచ్చిన పాట గురించి ఆయన ఇలా చెబుతున్నారు. "టైటిల్‌సాంగ్ చాలా బాగుంది. సాహిత్య పరంగా చాలా ఆసక్తికరంగా కూడా వుంది. ఇదో కొత్త ప్రయోగంలా అనిపిస్తుంది. ర్యాప్ టైప్‌లో మనతో మాట్లాడుతున్నట్టుగా వుంది. అందుకే ఐ లైక్ దిస్ సాంగ్".

## నువ్వు - నేను

ముద్దుగా బొద్దుగా కనిపించే అనిత 'నువ్వు - నేను' సినిమాలో ప్రేక్షకుల్ని బాగానే ఎట్రాక్ట్ చేయగలిగింది. ద్విశత దినోత్సవానికి ఉరకలు వేస్తున్న ఈ చిత్రంలో తనకు నచ్చిన పాట గురించి ఇలా చెబుతోందామె.



"ఆంధ్రాలో ఎక్కడ చూసినా 'నువ్వు - నేను' పాటలే పాడుకుంటున్నారు. నాకిదంతా అద్భుతంలా తోస్తుంది. హిందీ 'నువ్వు-నేను'లో కూడా నేను నటించాను. ఈ హిందీ షూటింగ్ హైదరాబాద్‌లో జరుగుతుంటే నన్ను చూసి అంతా 'గాజువాక పిల్లా మేం గాజులోళ్ళం కాదా' అని పాడుతున్నారు. వారి అభిమానానికి కృతజ్ఞతలు. నాక్కూడా ఆ పాటంటే బాగా ఇష్టం. ఆ పాటలో ఒక రకమైన రిథమ్ మనసుకి హుషారు కలిగిస్తుంది".

## నువ్వుంటే చాలు

మంచి అభిరుచి కలిగిన నిర్మాత అచ్యుతరెడ్డి ఈ చిత్రం ద్వారా దర్శకునిగా కూడా వ్యవహరిస్తున్నారు.



ఈ చిత్రంలో మీకు బాగా నచ్చిన పాట ఏదని అడిగితే 'దర్శక నిర్మాతగా నాకు అన్నీ బాగా నచ్చాయి' అని చెప్పారు. పర్టిక్యులర్‌గా ఒక సాంగ్ గురించి ప్రస్తావిస్తే ఆయన ఇలా చెప్పుకొచ్చారు. "తాతల నాటి నేతులవాసన మూతులకిప్పుడు ఉండదురా' అనే పాట 'దిబెస్ట్' అని చెప్పుకోవాలి. 'మా తాతకి వంద ఎకరాలున్నాయి. మా తాత నెయ్యితోనే భోం చేసేవాడు. మా తాత గుర్రం మీద వెళ్ళేవాడు. ఇవన్నీ నీకనవసరం. నీ జీవితం గురించి నువ్వాలోచించుకో' అని మంచి సందేశాన్నిస్తుందీ పాట. నాకెంతో ఇష్టమైన ప్రముఖ సంగీత దర్శకులు సత్యంగారి మనవడు వసంత్ ఈ పాట రాసాడు. ఈ భావం నాది, భాషాప్రవృత్తులు అతనివి. ఇందులో ప్రతి పాటా దేనికదే పోటీ పడతాయి".

## కలలు కందాం రా

'నువ్వు వస్తావని' సినిమాలో 'మేఘమై నేను వచ్చాను' అనే మంచి పాటతో పాటల రచయితగా ఎంటరైన ఈ సివిల్ ఇంజనీర్ కుర్రాడు తక్కువ సమయంలోనే మంచి గుర్తింపుని సంపాదించుకున్నాడు.



మూడు పదుల పాటలు పూర్తి చేసిన రవికిరణ్ 'కలలు కందాంరా'లో ఆరు పాటలు రాసాడు. ఈ ఆడియో గురించి అతని ఫీలింగ్స్. "సిరిసిరిమువ్వల నాదమా, నా మదిలో మెదిలిన భావమా' టైటిల్ సాంగ్ అందరికీ బాగా నచ్చుతుంది. నేను కూడా చాలా ఫీల్‌తో మెలోడియస్‌గా రాసానో!? మెలోడిని అందరూ ఇష్టపడతారు కాబట్టి, ఈ పాట నచ్చుతుందని కాన్ఫిడెంట్‌గా చెప్పగలుగుతున్నాను. అలాగే మిగతా ఐదు పాటల్ని డిఫరెంట్ ఫీల్‌తో రాసాను. రొమాన్స్, మెలోడీ, విలేజ్ నేటివిటీ... ఇలా అన్ని రకాలూ రాసాను. ఇది నన్ను నేను నిరూపించుకునే ఆడియో అవుతుంది".

## సీమసింహం

బి.గోపాల్ శిష్యుడైన రామ్‌ప్రసాద్ 'చిరునవ్వుతో' చిత్రం ద్వారా దర్శకుడై సక్సెస్‌ను సాధించి రెండో సినిమానే బాలకృష్ణకు చేసే అవకాశాన్ని సంపాదించుకున్నారు.



సంక్రాంతికి విడుదలైన 'సీమసింహం' చిత్రంలోని పాటలు మాస్‌ని ఉర్రూతలూగిస్తున్నాయి. ఈ సినిమాలోని ఆరు పాటల్లో దర్శకుడు దేనికి టాప్‌ర్యాంక్ ఇస్తారో తెలుసుకుందాం. "చందమామా చందమామా అంత దూరం ఎందుకమ్మా, కన్నెభామా కన్నెభామా ఆపవే హంగామా' పాటకే నేను అగ్రతాంబూలం ఇస్తాను. ఎందుకంటే ఆ సిట్యుయేషన్‌కి ఈ సాంగ్ కరెక్ట్‌గా యాప్ట్ అయ్యింది. మంచి మెలోడియస్ సాంగ్ ఇది. హరిహరన్, సుజాత బాగా పాడారు. పాట రాసిన 'శాస్త్రి గారి గురించి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు' అని తన అభిప్రాయం వెలిబుచ్చారు దర్శకుడు రామ్‌ప్రసాద్.

## కాంటెకాశ్చెన్లు-తుంటరి జవాబులు

వి.మంజురాణి - హైద్రాబాద్

ప్ర॥ గోవులను పాలించి, గోవుల పాలు తాగిన గోపాలుడు శ్రీరాముని తరువాత అవతారమేనని ఎలా చెప్పగలం?

జ॥ శ్రీరాముడు 'కౌ'సల్య కుమారుడు కనుక.

ప్ర॥ మందు ఎందుకు కిక్ కొడుతుంది?

జ॥ తనను 'కొడితే' ఊరుకుంటుందా!? టిట్‌ఫర్‌టాట్ అంటే అంతే మరి!

ప్ర॥ తమాషా!?

జ॥ నర్సింగ్ హోమ్ ఉంటుంది కానీ డాక్టర్స్ హోమ్ అని ఉండక పోవటం.







## ఈ రూటే వేరు




(1) నగరం - వేడిగాలేనిది

-ఆర్. ఉషావినోద్, హైదరాబాద్

(2) నోబడీ - స్కూల్ లేదు

-ఎస్.జ్యోత్స్నా సురేష్, కర్నూలు

(3) కబ్జా - ఎప్పుడు వెళ్ళడం ?

-బి.విశ్వజ

## డబుల్‌రోల్




(1) ఆ 'ఆపరేటర్లు' ఎంత మొత్తుకుంటున్నా ఆ జనరేటర్ 'ఆపరే'...!?

-బి.సత్య హైదరాబాద్

(2) ఆ 'కంద' కూర మా'కందరికీ' బాగా నచ్చింది.

- వి.నిజ, చందానగర్.

(3) ఎందుకొచ్చిన 'లెక్కండీ...' ముందు 'రైలెక్కండీ'!

-పి.ప్రియాంక, చోడవరం

## చిలిపిలిపి

(1) What .... Slate Pot going?
ఏంటీ.... పలక కుండ వెళ్ళి పోతున్నావు?
-అడపా శివదుర్గ, భోగాపురం



(2) Mystery Way = మాయదారి
(3) వేస్టేజ్ = పనికి రాని వయస్సు
-సి.హెచ్.నాగేశ్వరరావు, కొత్తకొట్టం

## కొంటె కవిత

ప్రేమిస్తే థ్రిల్లు
పెళ్ళయితే డ్రిల్లు
ప్రేమిస్తే అంధత్వం
పెళ్ళయితే బధిరత్వం
ప్రేమ పెళ్ళికి పునాది
పెళ్ళి ప్రేమకు సమాధి
-కీర్తన, హైదరాబాద్



## పేరు-రిపేరు

(1) ఆంటీ - అంకుల్ -
మా యింటికి రండి
ఇట్లు శ్రావణి
సుబ్రహ్మణ్యం.
-శ్రేష్ఠ, హైదరాబాద్



(2) ఈనాడు -
గాంధీ పుట్టిన దేశం -
అర్థరాత్రి హత్యలు - పీపుల్స్ ఎన్‌కౌంటర్ - గ్యాంగ్ వార్ - భారత్‌బంద్
- మల్లువలస రామారావు, వీరవాసరం

## పేరడీ పేరేడ్



తిండి వీర లేవరా
దండిగాను మింగరా
ఉదర పూజ సేవకొరకు
భోజనానికెళ్ళరా
దారుణ కాటక బాధకు
తల్లడిల్ల వద్దురా
ప్రీతి లేని వంటకాలు
నేటి నుండి రద్దురా
ఆపవద్దు ఆగవద్దు
నింగి నీకు హద్దురా
నింగి నీకు హద్దురా....
ఈ భక్ష్యం ఈ భోజ్యం
నాకేనని భావించి
ప్రతి పాత్ర అడుగుపట్టి
విస్తట్లో దిమ్మరించి
మఠం వేసి పట్టుబట్టి
ఉడుంలాగ చేతపట్టి
భీముళ్ళా భుజియించాలి
బకాసురుణ్ణి ఓడించాలి
వంటే నీ పరం
వంటే నీ పరం
ఎవడు వాడు ఎచటివాడు
ఇటు వచ్చిన బక్కవాడు
తిండి ధనం, మొండి బలం
కబళించే దుండగీడు
జన్మఫలం జీర్ణగుణం
దిష్టి పెట్టు గుణం వాడు
లెక్క చెయ్యమాకురా
లేవలేకుండా మింగరా
వంటే నీ పరం
వంటే నీ పరం
స్వాహాల వీరుడా
స్వాదిష్ట భోజుడా
ఘటోత్కచుని ఓడించిన వాడా
ఘటోత్కచుని ఓడించిన వాడా
వంట వాళ్ళ గుండెల్లో
నిదురించిన వాడా
మా నిదురించిన జఠరాగ్నిని
రగిలించిన వాడా ॥వంట॥
లావైనా భరిస్తాం
ఏమైనా సహిస్తాం
నిశ్చయముగా
నిర్భయముగా
నీలాగే తినేస్తాం....
-శ్రేష్ఠ, హైదరాబాద్.

## కామెడీ సీరియల్ ప్రారంభం

# సద్దాం ఆంటీ సెంటీ కేస్



- మల్లాది వెంకట కృష్ణమూర్తి

### ఆ రోజు పౌర్ణమి.

అయినా లోకం వెన్నెలగా లేదు, ఎందుకంటే, అప్పుడు ఉదయం ఆరు అయింది.

హైదరాబాద్‌లో రామ్‌నగర్‌లోని ఓ ఇల్లది, అది కట్టి శత సంవత్సరం దాటిందని చూస్తేంటే తెలిసి పోతోంది.

ఇంటి చుట్టూ ముళ్ళకంచె, పెరిగిన చెట్లు, దాదాపు అర ఎకరం స్థలంలో మధ్యగా కట్టిన ఆ ఇంటికి వెల్లవేసి చాలా ఏళ్ళయిందన్న గుర్తుగా మట్టికొట్టుకుని పోయి వుంది.

ముందు కారు ఆగేందుకు పోర్టికో, వరండా, దాని వెనక పెద్ద హాలు. ఆ హాల్లోంచి నాలుగది గుమ్మాలు. ఓ మూలనించి పైకి మెట్లు. ఫస్ట్‌ఫ్లోర్‌లోకి బయటనించి కూడా మెట్లున్నాయి.



కింది భాగంలో హాల్లోంచి ఈశాన్యం వైపున్న తలుపు దగ్గరగా వేసి వుంది. ఆగదిలోంచి ఓ కంఠం శ్రావ్యంగా వినిపిస్తోంది...

"జయకృష్ణా, ముకుందా మురారీ! జయ గోవింద..."

ఆ గది ఈశాన్యం గోడకి అనేక ఫోటోలున్నాయి. అన్నీ దేవుడి పోటోలు. కృష్ణుడు, రాముడు, వినాయకుడు, శివుడు... మాయా బజార్ చిత్రంలోని కృష్ణుడు, లవకుశలోని రాముడు, దక్షయజ్ఞంలోని శివుడు, శ్రీ కృష్ణాంజనేయ యుద్ధంలో ఆంజనేయుడు అన్నీ ఆయా పాత్రల్లో వేషధారణ చేసిన సినీనటుల ఫోటోలే.

పీఠంమీద మాయాబజార్‌లో శ్రీ కృష్ణుడు ఘటోత్కచుడి చెవిలో ఏదో రహస్యం చెప్పే ఫోటోవుంది. దానికి ఆ రోజే అల్లిన పూలమాల వేలాడుతుంది. శ్రీ కృష్ణుడికి, ఘటోత్కచుడికి... ఐ మీన్... ఎన్.టి.ఆర్‌కి, ఎస్వీరంగారావుకి శిల్పా స్టిక్కర్ బిందీ బొట్లు పెద్ద సైజుకి పెట్టివున్నాయి.

ఆ స్టిల్ ముందు పీటమీద కూర్చున్న అమ్మాయి వయసు

పద్దెనిమిది అని చెప్తే ఠక్కున నమ్మచ్చు. నిజానికి ఆమె వయసు ఇరవై రెండు. మొహంలో లేతదనం పోలేదు.

ఆకర్షణీయంగా వున్న ఆమె వెదురు బుట్టలో అప్పుడే కోసుకువచ్చిన మందార పువ్వులతో, గులాబి రేకులతో ఆ షెల్ఫ్‌లోని ఎన్.టి.ఆర్ ఐ మీన్ శ్రీ కృష్ణుడికి భక్తిగా పూజ చేస్తూ ఆ భక్తి గీతం ఆలాపిస్తోంది.

'వెలసితి వంట నందుని ఇంట...'

పక్క గదిలోని ఓ శాల్తీ టి.వి. చూస్తూ ఈ

"నమో కృష్ణ నమో కృష్ణ కృష్ణ కృష్ణ నమో నమః
నమో రామ నమో రామ రామ రామ నమో నమః
నమో ఆంజనేయ నమో ఆంజనేయ
ఆంజనేయ నమో నమః
నమో ఘటోత్కచా నమో ఘటోత్కచా
ఘటోత్కచా నమో నమః

పూజ పూర్తయ్యాక ఉద్వాసన చెప్పడానికి కంఠం సర్దుకుని ఓ పద్యం అందుకుంది కొద్దిసేపటి క్రితం 'జయకృష్ణా ముకుందా... మురారీ'

అన్న పాటని ఎంత శ్రావ్యంగా పాడిందో



పాటని విసుగ్గా వినడం జరుగుతోంది.

'హే కృష్ణా... ముకుందా... మురా ఆ ఆ ఆ రి'

అనే దీర్ఘంతో ఆ పాట పూర్తయ్యాక ఆమె భక్తిగా ఆ ఫోటోలోని కృష్ణుడి మీదకి ఘటోత్కచుడి మీదకి తన చేతులని పోనించి కళ్ళకి అద్దుకుంది.

తర్వాత ఇత్తడి పూలు పొదగబడ్డ పీటమీద నిజం పువ్వులను ఓ గ్రంథాన్ని అందుకుంది. దాన్ని భక్తితో కళ్ళకి అటు ఇటు అద్దుకుని మధ్యలో గుర్తుగా పెట్టిన పక్క పిన్నీసున్న పేజీని తెరచి గత రోజు చదివిన దగ్గర్నించి చదవసాగింది.

**"విన్నాను మాతా విన్నాను, ఇచ్చిన మాటను తప్పుటయేకాక, తుచ్ఛ కౌరవుల పొత్తు కలుపుకుని జగద్విదిత పరాక్రమవంతులైన మా జనకులనే తూలనాడిరిగా యాదవులు! ఎంత మద మెంత కావరమెంత పొగరు! అంతకంత ప్రతీకార మాచరించి కౌరవుల యాదవుల కట్ట గట్టి నేలమట్టు బెట్టకున్న నా మహిమేల?"**

రావికొండల్రావు నవలీకరణ చేసిన 'మాయా బజార్' పుస్తకం అది. అందులోని అయిదు పేజీలు చదివి మళ్ళీ గుర్తుగా పక్క పిన్నీసుని పుస్తకంలో వుంచి దాన్ని యథాస్థానంలో వుంచి రెండు మందార పూలని పుస్తకం మీద వుంచింది.

పళ్ళెంలో అగ్ మార్కు కర్పూరం బిళ్ళలు నాలుగు వేసి వెలుగుతున్న దీపంతో అంటించి లేచి నిలబడి ఏదీ విడవకుండా అన్ని ఫోటోలకి హారతి ఇచ్చింది.

ఇప్పుడదే కంఠం బొంగురుగా పాడసాగిందా పద్యాన్ని.

జై సత్య సంకల్ప జై శేషతల్పా!
జై దుష్టసంహార జై దీనకల్పా!
జై భక్త పరిపాల జై జగజ్జాలా!
నీవు జరిపించేటి నీ చిత్ర కథలు
వ్రాసినా చూసినా వినిన ఎల్లరును
శుభ సంపదలు గలిగి వర్ధిల్ల గలరు
సుఖ శాంతులను గలిగి శోభిల్లగలరు!

అది 'మాయాబజార్' చిత్రం చివర్లో ఘటోత్కచుడు శ్రీ కృష్ణుని వుద్దేశించి పాడిన పద్యం. నైవేద్యం పెట్టిన బెల్లం ముక్క పళ్ళెంతో లేచి ఆ గదిలోంచి బయటకి వచ్చింది. హాల్లో ఎదురుగావున్న తలుపులోంచి లోపలికి వెళ్ళింది.

ఆ గదిలో టి.వి.లో ఇంగ్లీష్ సినిమాలు మాత్రమే ప్రదర్శించే ఓ ఛానెల్ వస్తోంది.

సీన్ కానరి జేమ్స్ బాండ్‌గా నటించిన రెండో చిత్రం 'ఫ్రం రష్యా విత్ లవ్' వస్తోంది. నడిచే రైల్లోని చిన్న కేబిన్‌లో జేమ్స్‌బాండ్ విలన్‌తో ఫైట్ చేసే దృశ్యాన్ని ఎంతో ఉత్కంఠతతో చూస్తోంది ఎనభై ఏడేళ్ళ వయసుగల ఓ ముసలావిడ గాడ్రేజ్ హెయిర్ డై వేసుకుని, ఫెయిర్ అండ్ లవ్లీ మొహానికి పట్టించడంతో ఆవిడ వయసు అంతని మొహంలో తెలియడం లేదు.

"బామ్మా... బామ్మోయ్ ప్రసాదం"

బామ్మ ఇటు చూడకుండానే ఎడంచేతిని నిర్లక్ష్యంగా చాపింది.

"ప్రసాదం కుడి చేత్తో తీసుకోవాలి. తెలిసిందా?"

ఆవిడ మనసంతా టి.వి.లోని సినిమా మీదేవుంది. అనాసక్తిగా చేతిని మార్చింది. బామ్మ నోట్లో బెల్లం ముక్కని వుంచి రిమోట్ అందుకుని మ్యూట్ నొక్కి చెప్పింది ఆ అమ్మాయి.

"బామ్మా ఎప్పుడూ ఆ టి.వి. యేనా? నేను వెళ్ళేది రేపే తెలుసా? వారం దాకా రాను. కాస్తంత టైం నాతో స్పెండ్ చేయచ్చుగా?"

"మంచి సినిమానే. నన్నడిగితే జేమ్స్‌బాండ్‌గా అయిదుగురిలో సీన్‌కానరీనే బెస్ట్... మొహంలో, మూమెంట్స్‌లో ఆ గ్రేస్ ఉంది చూశావూ..."

"అబ్బబ్బ... బామ్మా"

ఈ సారి రిమోట్ తో టి.వి.నే ఆఫ్ చేసిందా అమ్మాయి.

"ఇవాళ వంటపని కూడా లేదు రా"

"అదేమిటి? మరి భోజనం ఎలా?" అడిగిందా అమ్మాయి తెల్లబోతూ.

"కొత్తగా టేస్ట్ బడ్స్ అనే హోటల్ తెరిచారు. ఇందాక కేబుల్ టి.వి.లో ప్రకటన చూపించారు. వెయిటర్ డ్రస్‌లు ఎంతో బావున్నాయి. అక్కడికి వెళ్ళి తిందామీపూట"

"బామ్మా... పది రోజులనించి అడుగుతున్నాను నాకు పులిహోర చేసి పెట్టమని. ఇదిగో అదిగో అంటూ దాటేసుకుంటూ వస్తున్నావ్. ఇవాళ వైష్ణవ పులిహోర చేయాల్సిందే. నేను అది తప్ప ఇంకేం తినను" మొండిగా చెప్పిందామె.

"నీ పిచ్చిగాని. నేనేమైనా వైష్ణవురాల్నా ఏమిటీ, అది బాగా చెయ్యడానికి?"

"వైష్ణవుల దగ్గరేగా నువ్వది నేర్చుకుంది. అమోఘంగా చేస్తావుకాని... లే"

ఆవిడ భుజాలు పట్టుకుని లేపిందా అమ్మాయి.

"అనన్యా. నీది పులిహోర తినే వయసు కాదే. కమ్మగా వెజ్ బర్గరో, ఛీజ్‌పిజ్జానో తినే వయసు. విత్ ఐస్ కేక్ అండ్ కోక్"

"నాకదేం తెలీదు. నువ్వు పులిహోర చేయాల్సిందే బామ్మా"

"సర్లే. మరినాకు సహాయం చేస్తేనే... పచ్చి మిర్చిని నిలువుగా తరిగిపెట్టు, జీడి పప్పుని నెయ్యిలో ఫ్రై చేసి పెట్టాలి. అలాగే చింతపండు రసం తీయాలి..."

"అన్నీ చేస్తాకాని పద"

ఇద్దరూ హాల్లోకి వచ్చి ఇంకో గుమ్మంలోంచి వంటగదిలోకి దారితీసారు.

"రోజుకి గంట సేపా పూజ చేసేది? దేనికైనా హద్దు పద్దు వుండాలి" కోప్పడింది బామ్మ అనన్యని.

"ఇంకో అరగంట పెంచేద్దామనుకుంటూంటే"

"ఏం కోరే ఆ పూజలు?"

సమాధానంగా స్వల్పంగా సిగ్గుపడింది అనన్య, కాని అంతలోనే తేరుకుని చెప్పింది.

"రాబోయే కష్టాలని తొలగించి సుఖాన్ని ఇవ్వమని! ఇంకేముంటుంది. ఎవరికైనా?"

"బావుంది. దానికింత సేపు బోరు కొట్టాలా దేవుళ్ళని? షార్ట్ అండ్ స్వీట్ ప్రేయర్ బెటర్. వాళ్ళ టైం, మన టైం వేస్ట్ కావు"

"రోజూ ప్రార్థనలో నువ్వేమని కోరుకుంటావు బామ్మా?" ఉత్సాహంగా అడిగింది అనన్య.

"వెరీ షార్ట్ ప్రేయర్. ఓ లార్డ్! మేక్ మై ఎనిమీస్ డిఫీటెడ్ అని. దేవుడు నన్ను ఇంతదాకా అనుగ్రహిస్తూనే వున్నాడావిషయంలో"

"నీకు శత్రువులా బామ్మా?" ఆశ్చర్యపోయింది అనన్య.

"మనిషన్నాక ప్రతీ వాళ్ళకి ఒకరో ఇద్దరో శత్రువులు తప్పరు"

"ఎవరు బామ్మ వాళ్ళు?"

"ఎవరో ఒకరు సమ..."

"... యం వచ్చినప్పుడు చెప్తాను. అనేగా నీ జవాబు? నువ్వేదీ పూర్తిగా చెప్పి చావవు బామ్మ" విసుక్కుంది అనన్య.

"ఆ సమయం కూడా అట్టే దూరంలో లేదులే. అది సరే గానీ సినిమా స్టార్స్‌కి నువ్వు పూజ చేస్తున్నావని తెలిస్తే నీకు పెళ్ళికాదు తెలుసా?"

"అబ్బబ్బ బామ్మా... నీకెన్నిసార్లు చెప్పాను ఆ ఫోటోల్లోని వాళ్ళు సినిమా వాళ్ళు కాదని, నేను చూసేది దేవుళ్ళనని?"

"దేవుడు నిరాకారుడే"

"కావచ్చు... కాని ఆకారం లేని దేవుడి మీద మనసు పెట్టడం ఎలాగా? అందుకని ఆకారంగల దేవుళ్ళి కొలవడం ఉత్తమం. పూర్వం సినిమాలు లేని రోజుల్లో అందుకు మట్టి, పాలరాతితోనో లేదా చెక్కతోనో దేవుడి బొమ్మలు చేసేవారు. ఇప్పుడు మనకింకా బెటర్. మాయాబజార్ చూస్తున్నంత సేపు అక్కడ ఎన్.టి.ఆర్. అని చూస్తామా, లేక కృష్ణుడనా? కృష్ణుడనేగా! అప్పుడలాగ మనసులో ఇంప్రెషన్ పడ్డాక అదే ఇమేజ్‌తో దేవుళ్ళి కొలవడం తేలిక బామ్మా. రివ్యూలలో రాస్తుంటారే పాత్రకి ప్రాణం పోసారు లేదా పూర్తిగా న్యాయం చేకూర్చారు అని. అందుకే, ఆ ఫోటోలో ఎన్.టి.ఆర్ కనపడరక్కడ నాకు. శ్రీరామ చంద్రుడు, శివుడు, ఇలా కనబడతారు. రాజనాలలో కూడా ఆంజనేయ స్వామిని చూస్తాను."

"అందుకు సినిమా భక్తి పాటలే పాడాలా... పిచ్చి కాకపోతే?!" కోప్పడింది బామ్మ.

"అవి నాకు నోటికి వచ్చినవి కదా బామ్మా. విష్ణు సహస్రనామాలు పుస్తకం కొని నోరు తిరక్కుండా తప్పులు చదివేకంటే ఇదే బెటర్‌కదా. భావం ముఖ్యంకాని, భాషకాదు కదా. ఘంటసాల శేష శైలావాసా శ్రీ వేంకటేశా అనే పాట వింటూంటే -వెంకటేశ్వర మహాత్యంలోని ఎన్.టి.ఆర్. స్టిల్‌కి పూలతో పూజ చేస్తూంటే కలిగే భక్తి భావం, నాకు తిరుమల గుళ్ళో ఆ స్వామి విగ్రహం చూస్తూంటే కలిగే భక్తిభావం ఆల్ మోస్ట్ ఈక్వల్ అనుకో!"

"మే గాడ్ ఇన్ ది ఫాం ఆఫ్ ఎన్.టి.ఆర్. బ్లెస్ యూ"

"ఇంగ్లీష్ స్పీకింగ్ కోర్స్‌లో చేరాలని నువ్వు కోరగానే కనుక్కొని నిన్ను చేర్పించడం బుద్ధి తక్కువ. మా ఫ్రెండ్స్ అంటూంటారు మీ బామ్మ బట్లర్ ఇంగ్లీష్ భలే మాట్లాడుతుందే అని"

"నాతో ఇంగ్లీష్ మాట్లాడే వాళ్ళు పెద్దగా లేక కొంత ప్రాక్టీస్ తప్పిందేమో కాని మరీ బట్లరింగ్లీష్ మాట్లాడదామన్నా నాకు రాదు"

డోర్ బెల్ మోగింది.

"అమ్మయ్య, పాలవాడొచ్చాడు. కాఫీ తాగి బ్రంచ్‌కి పులిహోర చేస్తాను"

"బ్రంచా? అంటే?"

"ఇవాళ బ్రేక్ ఫాస్ట్, లంచ్ రెండూ కలిపి ఒకే టైంలో తింటాం కాబట్టి అది బ్రంచ్"

"బామ్మా. ఘటోత్కచుడు కూడా దేవుడే కదా?" అడిగింది అనన్య పాలుకాస్తూ.

"ఎందుక్కాదే? పాండవుల సైడ్ వాళ్ళంతా దేవుళ్ళు, కౌరవులసైడ్ వాళ్ళంతా దుర్మార్గులు"

"అప్పుడప్పుడూ అనిపిస్తూంటుంది - రాక్షసుడ్ని కొలుస్తున్నానా అని. కాని మాయాబజార్ చూస్తే ఘటోత్కచుడు రాక్షసుడైనా రాక్షసుడిలా కనిపించడు"

'అది కె.వి.రెడ్డి, పింగళి, ఎస్వీ.ఆర్.ల మహత్యం"

"వాళ్ళనా విధంగా కూర్చిన ఆపైన వున్న దేవుడి మహత్యం ముందసలు"

"ఎలాక్కావాలంటే అలా అనుకో కాని కాస్తంత భక్తి తగ్గించు. రేపు ఎలాంటి వాడొస్తాడో! రాఠ్ కూడదంటే?"

"అలాంటి వాడు రాడులే బామ్మా"

"ఏమిటి సులోచనారాణి నవల్లో హీరోయిన్లా నీ బుగ్గల్లోకి వెచ్చటి ఆవిరి వచ్చింది. ఏమిటి ఏమన్నా...?" నవ్వింది బామ్మ.

"సమ..."

"యం వచ్చినప్పుడు చెప్తావా ఏజ్ యూ లైకిట్"

............

అనన్య తన బామ్మతో ఆ సమయంలో ఎవర్ని మనసులో వుంచుకుని మాట్లాడిందో అతగాడి పేరు నిరుపమ్. వయసు ఇరవై ఆరు. అనన్య పనిచేసే బేంక్‌లోనే అతనూ ఆఫీసర్‌గా పని



## 'ఎంత మదమెంత కావరం' డైలాగ్ వెనకనున్న కథ



మాయాబజార్' సినిమాలో ఘటోత్కచుడు చెప్పిన 'ఎంతమదమెంత కావరమెంత పొగరు' అనే డైలాగుకి మంచి రెస్పాన్స్ ఉండేది. నిర్మాత, సహజ కవి అయిన ఎమ్మెస్‌రెడ్డి కూడా తను తీసిన 'శ్రీకృష్ణ విజయం' సినిమాలో యస్.వి.రంగారావు పాత్రకి 'ఎంత మోసమెంత వంచన ఎంతదగా' అనే డైలాగు పెట్టారంటేనే ఊహించుకోవచ్చు - ఆ 'మాయాబజార్' డైలాగ్ ఎంత మందిని ప్రభావితం చేసిందో!? సినిమాలో ఆ డైలాగ్ తర్వాత 'దురహంకార మదాంధులై ఖలులు విద్రోహంబు గావించిరే' అనే పద్యం వస్తుంది. ఈ పద్యాన్ని మాధవపెద్ది సత్యం పాడేరు. ఆ పద్యం యస్.వి.రంగారావు పాడినట్టుగా ఉండాలని రికార్డింగ్ టైమ్‌లో ఆ డైలాగ్‌ని మాధవపెద్ది సత్యం చేత ఒక సారి చెప్పించి తర్వాత పద్యాన్ని పాడించారు కె.వి.రెడ్డి. ఈ విషయాన్ని మాధవపెద్ది సత్యం ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. అది చదివిన వాళ్ళు సినిమాలో వినిపించే డైలాగ్ కూడా మాధవపెద్ది సత్యమే చెప్పారనుకుని పొరపడ్డారు. నిజానికి డైలాగ్ రంగారావు గారిది. పద్యం మాధవ పెద్ది సత్యంది. కేవలం ఊపుకోసం కెవిరెడ్డిగారు అలా చెప్పించారంతే! ●

చేస్తున్నాడు.

అతనికి అనన్య పరిచయం అయి నాలుగు నెలలే అయింది. ఈ నాలుగు నెలల్లోనే అతని మీద అనన్యకి ఇష్టం ఏర్పడింది. అయితే కాస్తంత రిజర్వ్‌డ్‌గా వుండే తత్వం అతనిది. భోళాగా మాట్లాడే స్వభావం గల అనన్య అతను తన మనసులో మాట తెలుసుకుని ఎప్పుడు ప్రపోజ్ చేస్తాడా అని ఎదురు చూస్తోంది. ఆడపిల్ల ఏమగాడితోనూ 'ఐ లవ్ యూ' చెప్పకూడదనీ, 'ఐ లవ్ యూ టూ' అని మాత్రమే చెప్పాలని అనన్య నిశ్చితాభిప్రాయం. అందుకని తన మనసులోని మాటని అతనికి చెప్పలేదు.

ఆ రోజు సోమవారం. పోస్ట్ వచ్చే టైంకి అతని మనసు కొద్దిగా ఆందోళనకి గురయ్యింది, ఈ రోజు కూడా తనకి కవర్ వస్తుందా రాదా అని.

గత నాలుగు సోమవారాలుగా అతని పేర ఓ కవర్ వస్తోంది. ఇది అయిదో సోమవారం.

"నిరుపమ్ నిన్న రాత్రి ఏం సినిమాకెళ్ళావు?" అడిగాడు అతని కొలీగ్ ఫాలలోచన రావు.

"నీకెందుకు బే"

"బావుందా?"

"కొత్త కుర్రాళ్ళయినా స్టెప్స్ అదరకొట్టారు. డైలాగ్స్ కూడా బావున్నాయ్" నవ్వాడు.

"ఏమిటి నవ్వుతున్నావ్?"

"బ్రహ్మానందం ఇన్‌స్పెక్టర్. రైల్వే స్టేషన్‌లో యం.యన్.నారాయణ దగ్గరకి వచ్చి అడుగుతాడు పోయిన మీ సూట్‌కేస్ కలర్ ఏమిటని. యం.యన్. 'విస్కీ కలర్' అంటే బ్రహ్మానందం రాసుకుంటూ సీరియస్‌గా 'సోడా కలిపిందా, కలపందా' అని అడుగుతాడు. అప్పుడు యం.యస్. 'నాకు గ్యాస్ ప్రాబ్లం మంచి నీళ్ళతోనే విస్కీ తాగుతాను' అంటాడు"



50 సంవత్సరాల 5 నెలల 5 రోజులు
(14 -1 - 1951 నుంచి 19-6-2001 వరకు)
మాత్రమే జీవించి ఏళ్ల తరబడి నిలిచిపోయే
హాస్యాన్ని చిలికించిన
మిత్రులు, హాస్యబ్రహ్మ
జంధ్యాల వెంకట దుర్గా శివసుబ్రహ్మణ్య శాస్త్రికి
నేను రాస్తున్న ఈ కామెడీ నవల అంకితం...
-రచయిత

"అది మా అమ్మతో చూడచ్చా?"

"ఊ... వద్దులే. నువ్వు మీ ఆవిడ మాత్రం వెళ్ళండి చాలు"

పోస్ట్‌మేన్ వచ్చి నిరుపమ్‌కి ఓ కవరిచ్చి వెళ్ళాడు. దానిమీద అతని పేరు, అడ్రస్ కంప్యూటర్‌లో టైప్ చేసి ప్రింటవుట్ చేసింది. దాన్ని చూడగానే నిరుపమ్ మొహం వికసించింది. అయితే తన కొలీగ్ పక్కనే కబుర్లు చెప్తూ ఉండడంతో విప్పలేదా కవర్‌ని.

అయితే అతని మనసు మాత్రం ఆ కవర్‌లోని ఓ కాగితం ముక్క మీదే వుంది.

"నీకెందుకు బే - సినిమా కథ మొత్తం చెప్పనా? అసలు కథ ఏంటంటే..."

"ఒద్దొద్దు. కథ తెలిస్తే ఇక సినిమా చూడబుద్ధి కాదు మా ఆవిడకి"

"మీ ఆవిడకి చెప్పకు"

"అదేం ఫేసో కాని, ఆవిడ మొహం చూస్తే ఏదీ దాచబుద్ధికాదు"

అతనెళ్ళాక కవర్ చింపి లోపల నించి కుడి చేతి చూపుడు మధ్య వేళ్ళతో ఓ కాగితం ముక్క తీసాడు. అతను ఎదురుచూసినట్టుగానే అది చింపిన కార్డ్‌సైజ్ కలర్ ఫోటోలోని ఓ భాగం.

నిరుపమ్ తన ఆఫీస్ డ్రాయర్ తీసి అన్నిటి కన్నా కింద ఫైల్‌ని తీసి అందులోంచి ఓ కాగితం తీసాడు. ఆ దళసరి కాగితం మీద అప్పటికే నాలుగు అలాంటి ముక్కలు అతికించి వున్నాయి. ఆ మొత్తం అతికిస్తే కానీ ఆ ఫోటోలోని మనిషెవరో తెలీదు.

ఆ ముక్కని వెనక్కి తిప్పిచూసాడు.

'ఐ లవ్ యూ' అని రాసివుంది. దాన్ని ఆ కార్డ్‌లోని ఇతర ముక్కలతో మేచ్ చేసి సరైన ప్రదేశంలో అతికించాడు.

అప్పటికింకా పావువంతు ముక్కలే నిండాయందులో.

ఆ రోజు పోస్ట్‌లో వచ్చిన ముక్కలోని నుదుటి భాగం చూసాడు కాని అతనికి ఆ అమ్మాయి ఎవరో స్ఫురించలేదు. సౌందర్య నుదుటిలా అనిపించింది. కాని ఆమె తనకి ఎందుకు పంపుతోంది? అయినా గడ్డం ముక్క కూడావస్తే సౌందర్యో కాదో తేల్చేసుకోవచ్చు అనుకున్నాడు.

ఆ కార్డుని ఫైల్లో వుంచి పనిలో పడ్డాడు.

(ఇంకావుంది)

### పింగళి గురించి ప్రేక్షకుల రిసెర్చ్

ఫలానా సినిమాకి పింగళి నాగేంద్రరావు గారు పని చేస్తున్నారు అని తెలియగానే పని కట్టుకుని చూసే మేధావులెందరో ఉండేవారు ప్రేక్షకుల్లో! ఓసారి విశాఖపట్నం లోని ఆంధ్రా యూనివర్సిటీ క్యాంపస్‌లో గల థియేటర్‌లో 'మాయాబజార్' తెప్పించుకుని చూశారు అక్కడి ప్రొఫెసర్లు. అది 1972. అప్పటికి 'మాయాబజార్' సినిమా వైజాగ్‌లో ఓ 15 సార్లయినా విడుదలయి ఉంటుంది. అయినా థియేటర్ కిక్కిరిసి పోయింది. వచ్చిన వాళ్ళలో 'మాయాబజార్'ని కనీసం 5 నుంచి 10 సార్లకు తక్కువ చూసిన వాళ్ళెవరూ లేరు. అయినా పింగళి సంభాషణల మీద ఎవరి మేధస్సుకు తగ్గట్టు వారు ఊహాగానాలు చేస్తున్నారు.

'పాండిత్యం కన్నా జ్ఞానమే ప్రదానం. వేసుకో వీరతాడు' తెరమీద యస్వీఆర్ డైలాగ్ వచ్చింది.

సినిమా చూస్తున్న ప్రొఫెసర్: విశ్వనాథ సత్యనారాయణది పాండిత్యం - పింగళిది జ్ఞానం అర్థమైందా... ఈ డైలాగులో ఎంత సెటైరుందో

ఈ డైలాగ్‌కి ముందు సీన్‌లో

"దారుకా! సుభద్రాభిమన్యులు ద్వైత వనానికి బయలుదేరారు. నీవేమి చెప్పకుండా వారిని ఘటోత్కచాశ్రమానికి చేర్చు" అంటాడు శ్రీకృష్ణుడు.

సినిమా చూస్తున్న ఇంకో ప్రొఫెసర్:

ఇది గమనించావా.... ఘటోత్కచుడు రాక్షసుడు! రాక్షసులకు ఎక్కడైనా ఆశ్రమాలుంటాయా!? ఈ ఒక్క డైలాగ్‌తో ఘటోత్కచుడు ఎంతో మంచి వాడని ఎస్టాబ్లిష్ అయిపోలేదూ!? ఎంతైనా పింగళి పింగళే! ఆ పింగళి (వెంకయ్య) మన జాతీయ పతాకాన్ని డిజైన్ చేస్తే ఈ పింగళి మన జాతిని పతాక స్థాయిలో ఆవిష్కరించారు!

ఇలా ఉండేది ప్రేక్షకుల్లో పింగళి ఫాలోయింగ్!!

-ప్రొఫెసర్ జి.గోవిందరావు,
విశాఖపట్నం

# సంగీతం ధ్యాసలో సతినే మరిచిపోయిన

# విశ్వ 'పతి' శాస్త్రి

విశ్వపతి శాస్త్రికి పదేళ్ళు....
పగలల్లా సంగీత సాధన చేసి రాత్రి ఒళ్ళెరక్కుండా పడుకున్నాడు.
కల!.... మనోహరమైన కల....
కలలో తంబురనాదం!!! మెల్లగా...
తెల్లటి పూర్ణచంద్రుడు....
జలజలా రాల్తున్న వెన్నెల.... తెల్లగా....
కుప్పపోసినట్టు తెల్లటి కర్పూరం....
తెల్లతెల్లగా.... హంసల గుంపు....
ఆకాసనించీ ఈ కొసవరకు....
గుబాళించే తెల్లని మల్లెదండలు....
చల్లచల్లగా... తెల్లతెల్లగా కురుస్తోన్నమంచు....
చెలియలికట్ట.... కట్టంతా.... సముద్రపు నురగతో తెల్లగా....
ఉన్నట్టుండి.... రజతా చలం.... తెల్లగానే....
పడుకున్న విశ్వపతి పెదాలు....
చల్లని... తెల్లని.... తల్లిని శారదాదేవిని స్తుతిస్తున్నాయ్....
శారద, నీరదేందు, ఘనసార, పటీర, మరాళ, మల్లికాహర, తుషార, ఫేన,
రజతాచల కాశ పణీశ, కుందమందార, సుధాపయోధి సితతామర....
సామర వాహినీ....
తెల్లారింది.....!
లేచాడు విశ్వపతి!..... అమ్మకనపడింది కల్లో
కళ్ళనుండి ధారలు కట్టేస్తున్నాయ్.... నీళ్ళు....
అమ్మ ఆశీర్వాదమూ అయింది. ఆజ్ఞా అయింది.
అంతే.... చెప్పాపెట్టకుండా.... 'పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్ ' దగ్గర శిష్యరికం చేయడానికి బొబ్బిలి నుంచి.... తమిళదేశం వైపు నడక సాగించాడు.

పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్!!

ఈయన త్యాగరాజస్వామి.... ప్రశిష్యుడు.... ఈయన తాతగారు పంచనాథ శాస్త్రి గారు తంజావూరు ఆస్థాన విద్వాంసులు.... తండ్రి వైద్యనాథయ్యర్. సుబ్రహ్మణ్య అయ్యర్ 1815లో తిరువయ్యార్‌లో జన్మించారు. సరే వంశ పారంపర్యంగా ఉన్న సంగీతాన్ని ఉగ్గుపాలలో రంగరించి తాగారు.... ఈయనలో విశేషమైన అంశం ఏమిటంటే... సాధన... సాధన... సాధన... రాక్షస సాధన....

ఒకేఒక్క రాగం 'బేగడ'ని ఇరవై నాల్గుగంటలు.. అంటే రోజు రోజంతా పాడి.... మైసూర్ మహరాజా వారి సభని దద్దరిల్లిపోయేలా చేసి సన్మానాలు పొందారు!... అందుకే ఈయనకి 'బేగడ సుబ్రహ్మణ్యయ్యర్' అని కూడా పేరుంది!!

ఈయన అపారమైన సాధన వల్ల... గొంతులోని మార్దవం పెరిగి అతి మనోహరంగా పాడేవారట... ఎంతో మంది రాజులు - జమీందార్లు ప్రత్యేకంగా ఈయనని తమ తమ ఆస్థానాల్లోకి పిల్చి కచేరీలు చేయించి - సన్మానాలు చేసేవారట!

ఈయన ఎన్నో వందల కీర్తనలు, వర్ణాలు రాశారు.... అలాగే ఎన్నో కీర్తనలు చాలా ప్రసిద్ది కూడా పొందాయి.... ఈయనది 'వెంకటేశ' ముద్ర... 'పరిదానమిచ్చితే' అనే కీర్తన ఇవాల్టికి కూడా సుప్రసిద్ధం.... అలాగే తోడిరాగంలో - ఏల నాపై ఇంత చలమూ అనే వర్ణం....

ఈయన త్యాగరాజ స్వామి ప్రశిష్యుడవడం వల్ల... ఈయన రచనలు కూడా ... స్వామివారి రచనలు పోలి ఉండేవి!.... ఇలాంటి మహానుభావుడి దగ్గరికి చేరాడు.... 'విశ్వపతి'!

***

పదేళ్ళ విశ్వపతిని చూస్తున్నాడు!....
పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్!...
సాక్షాత్తూ -
ఆదిశంకరుడా!.....?
బాలసుబ్రహ్మణ్యుడా!?
బాల గంధర్వుడా....?

ఏదైతేనేం.... వాడి పట్టుదలకి ముచ్చటేసింది!! "దేశం కాని దేశం నించీ... సంగీతం కోసం ఇంతదూరం వచ్చావురా...."

అని తలమీద చెయ్యేసి ఆప్యాయంగా ఆశీర్వదించాడు!!

శిష్యుడై పోయాడు. పట్నం సుబ్రహ్మణ్య అయ్యర్‌కి!...

బ్రాహ్మీ ముహూర్తంలో లేవడం...
గొంతుదాకా... నీళ్ళలో మునగడం....
స్వరాలు సాధన చెయ్యడం....
వేళకింత తినడం.... సాధన చెయ్యడం
అది సాధన కాదు... తపస్సు....
స్వరాలు కట్టలు కట్టి.... అట్టలు కట్టి.... పుట్టలు కట్టాయ్!.....
ఆ పుట్టలో నుంచి నాద యోగి!
సంగీతం - ఆహారం
సంగీతమే - పానం
సంగీతమే - ధ్యాస... సంగీతమే శ్వాస....
నరాలుమీటితే నాదం పలుకుతుంది.
రోమరోమం రామనామం అన్నట్టు.....
సంగీతం అస్తి గతం అయిపోయింది విశ్వపతి శాస్త్రికి
తోటి విద్యార్థులు -
ముందు ఈర్ష్య పడ్డారు.
గురువు ముచ్చట పడ్డాడు!
శిష్యులు... పిచ్చెక్కిందనుకున్నారు.
గురువుదార్లో పడ్డాడనుకున్నాడు.
విద్యార్థులు... ఇక వీడు లాభం

లేదనుకున్నారు!....

వీడి వల్లే ఎంతో ఉపయోగం ఉందను కున్నాడు గురువు!....

తోటి విద్యార్థులు - దరిద్రం వదిలి పోయిందనుకుంటే

గురువు మాత్రం 'సంగీత లక్ష్మి' వరించిందన కున్నాడు...

విశ్వపతి గాన సరస్వతి సంరక్షణలో ఎదుగుతున్నాడు.

ఏళ్లు గడుస్తున్నాయ్....

బాల్యం సంగీతానికి ధారపోసాడు....

యవ్వనం... సంగీతానికి ... హారతిచ్చాడు!!

ఇప్పుడు... విశ్వపతిశాస్త్రికి

నలభై అయిదేళ్ళు....!!!

అక్కడక్కడ.... పలిత కేశాలు తొంగి చూస్తున్నాయ్!!!

అయితేనేం!....

సంగీత విద్యలో తేజోవిరాజితుడైన విశ్వపతి శాస్త్రి...

మధ్యాహ్న భాస్కరుళ్ళా

వెలిగిపోతున్నాడు !!!

***

ఓ రోజు అర్ధరాత్రి....

మంగళ వాయిద్యాల ఘోషకి మెలకువ వచ్చింది.

బైటకొచ్చి చూస్తే.....

ఓ ఇంటిముందు పెళ్ళి!....

పిల్లాడికి పదేళ్ళు....

పిల్లదానికి ఎనిమిది

అష్టవర్షా త్భవేత్కన్యా!

బొమ్మల పెళ్ళిలా ఉంది!....

ఒక్కసారి విశ్వపతి ఆలోచనలు ముప్పై అయిదేళ్ళు వెనక్కెళ్ళాయ్!!

అవును... తనకు ఇలాంటి అనుభవం ఉంది!!

తనకు పదేళ్ళప్పుడు...

ఆ పిల్లకి ఎనిమిదేళ్లు...

తనను పెళ్ళికొడుకుని చేసారు....

పారాణి రాసారు... కాటుక పూసారు...

తనకేమో నిద్దరొస్తోంది!!

ఆ పిల్ల ఏడుస్తోంది!.....

బుగ్గన చుక్క.... కల్యాణ తిలకం...

కాటుక కళ్ళు ఏడ్చీ ఏడ్చీ .... కాటుకంతా బుగ్గలమ్మట కారిపోయింది!!

భజంత్రీలు మోగాయ్...

"తాళి కట్టరా!...."

నిద్దర కళ్ళు!

"తాళి కట్టరా.... వెర్రి సన్నాసీ..." ఎవరో పెద్దాయన కేకలు

తను తాళి అందుకున్నాడు.

కట్టాడు.... అంతా అక్షింతలు వేసారు.

పెళ్ళయిపోయింది.

తనకు కళ్ళు మూతలు పడ్డాయ్....

నిద్రలోకి జారిపోయాడు..

హ౦.... తనకి పెళ్ళయి ముప్పై అయిదేళ్ళయిపోయింది!

ఇన్నాళ్ళు సంగీతం ధ్యాసలో పడీ జ్ఞాపకమే రాదు.

పాపం... ఎల్లా ఉందో అది!!!

***

ఎలా ఉంటుందీ!

ఆ రోజు లెలాటివి....?

దేశాటం పోయిన విశ్వపతి శాస్త్రి గురించి....

కొన్నాళ్ళు వెతికారు.. కొన్నేళ్ళు ఆగారు...

ఇంక.... చనిపోయి ఉంటాడని.... ఘటా శ్రాద్ధం పెట్టేశారు!

అన్నిటి కన్న ఘోరం....

ముక్కుపచ్చలారని.... ఆ పిల్లని....

గాజులు బద్దలకొట్టించీ

తాళి తీయించి... గుండు గీయించీ!

విధవను చేయించి తెల్ల చీర చుట్టేశారు!!

***

ఊరొచ్చి... భార్యను చూసిన విశ్వపతి గుండెబద్దలైంది!!

తెల్లదనం... తెల్లటి పిల్ల.... తెల్లటి విబూది బొట్టెట్టుకునీ..... తెల్ల చీరలో.... తెల్లబోయి చూస్తోంది!!

"నేను బతికే ఉన్నాను....

నన్ను క్షమించు..." ఈ మాటలు దుఃఖంలో - ఏడుపులో కలిసి పోయాయి.

విశ్వపతి కంఠం మొదటిసారి బొంగురు



# తనికెళ్ల భరణి

పోయింది.

కావలించుకుని కరువుదీరా ఏడ్చింది!! భార్య!!

రాముణ్ణి చూసిన సీతమ్మవారైపోయింది!!

పరమేశ్వరుణ్ని కలిసిన పార్వతైపోయింది!!

మళ్ళీ పుణ్యస్త్రీ అయిపోయి... లక్ష్మీదేవల్లే తయారైంది!!

సంగీత సరస్వతి ఆ దంపతుల్ని.... మనసారా ఆశీర్వదించింది!!

ఇది వందేళ్ళ క్రితం బొబ్బిలిలో జరిగిన - విశ్వపతి శాస్త్రి కథ.... ఇది కల్పితం కాదు - సత్యం!!!

సంగీతం కోసం జీవితాన్ని ధారపోసిన ఇలాంటి పుణ్యమూర్తులు ఎందరో... వాళ్ళని స్మరించుకోవడమే మన జాతికి స్ఫూర్తి....

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయదలచుకునే వారు

**తణికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018 అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.




# తొలి హాస్య హీరో
# లంక సత్యం!!





నలభై ఏళ్లుగా సినీపరిశ్రమ తీరుతెన్నులపై అధ్యయనం చేసిన రచయిత,

జర్నలిస్టు, నటుడు

**రావికొండలరావు**

రాసిన వ్యాసమిది

**1968లో ఒక రాత్రివేళ...**

మద్రాసు సెంట్రల్ స్టేషను కిటకిటలాడుతున్నవేళ. ఆ రద్దీలో పెద్ద పెద్దలైట్లు, కెమెరా, ట్రాలీ మూవ్‌మెంట్లూ, సినిమా షూటింగు. సినిమా పేరు "సర్కార్ ఎక్స్‌ప్రెస్". ప్లాట్‌ఫాం మీద ఆగివున్న రైల్లోనూ, రైలు దగ్గరా షూటింగు. విపరీతమైన జనం. కెమెరా ముందు జనం, రైలు పెట్టె దగ్గర జనం. ఎవరూ కదలరు. కేకలు, గోల, పోలీసులూ, ప్రొడక్షన్ వాళ్ళూ జనాన్ని పక్కకి నెడుతున్నారు. ఓ పక్క నెడుతూవుంటే, ఇంకో పక్కనుంచి తోసుకొస్తున్నారు. సముద్రంలో ఓ కెరటం పడిపోతే, ఇంకో కెరటం లేచినట్టు. "పిన్నాడి పోంగయ్య - ఏం మేలమేల వర్రింగె" అని పోలీసులు, ఓ తెల్లబట్టలాయన్ని కూడా వెనక్కి నెట్టేశారు. "ఒర్నాయనో, నేనీ సినిమా డైరక్టర్నయ్యా బాబూ, నన్ను తోసేస్తున్నారేమిటి?" అని ముందుకు తోసుకొస్తున్నాయనే లంక సత్యం. "మీరు సినిమా డైరక్టర్లా లేరు. ఈ డ్రస్‌లో వుంటే మాకేం తెలుస్తుంది?" అన్నాడో పోలీసు తమిళంలో. "తెల్లపంచె, తెల్ల జుబ్బా వేసుకోవడం నేరంలావుందే! గొప్ప జోకు. డైరక్టర్నే పొమ్మన్నారు పోలీసులు" అన్నారు సత్యం గారు. 'సర్కార్ ఎక్స్‌ప్రెస్' సినిమాకి ఆధారం మలయాళ చిత్రం. ఆ చిత్రానికి దర్శకుడైన కృష్ణనాయరే, తెలుగు కీ డైరక్టరు-సత్యానికి. అసలు సత్యానికొస్తే - లంక సత్యమే చేశారు అంతా. అలా ఆ రాత్రి నెట్టుకుంటూ, తోసుకుంటూ గోలాకేకల మధ్య జరిగిపోయింది షూటింగు. అప్పట్లో సెంట్రల్‌లో షూటింగ్ చేసుకోడానికి, ఎక్కువ మొత్తంలో డిపాజిట్లు కట్టించుకుని అనుమతి ఇచ్చేవారు. చాలా కాలంగా ఇవ్వడం లేదు.

ఆ విధంగా - చేతిలో సిగరెట్టుతో, నెమ్మదిగా కబుర్లు చెబుతూ, 'సింపుల్'గా వుండేవారు లంక సత్యం. 1940లో మొక్కపాటి నరసింహ శాస్త్రి గారి నవల "బారిష్టర్ పార్వతీశం" సినిమాగా వచ్చింది. అంతకుముందు చిన్న చిన్న హాస్య సినిమాలు వచ్చినా, పూర్తి హాస్యచిత్రంగా తొలిసారి వచ్చిన సినిమా పార్వతీశమే. ఆ పార్వతీశం పాత్రధారి లంక సత్యం. అంచేత ఆయనే తొలి హాస్య హీరో.



'గులేబకావళి కథ' సినిమాలో
పద్మనాభం, పేకేటి, లంకసత్యం, బాలకృష్ణ

"నేనేదో స్టేజి మీద ఆడవేషాలు వేశానుగాని, హాస్య పాత్ర ఏనాడూ వెయ్యలేదు. సినిమా మీద మోజు పెరిగి బొంబాయి పారిపోయి, దర్శకత్వ శాఖలో పనిచేశాను. 1939లో వచ్చిన "అమ్మ"కి నేను సహకార దర్శకుణ్ణి - డైరక్టరు నిరంజన్‌పాల్‌కి తెలుగు రాదు గనక. ఆ సినిమాలో - చెప్పాలంటే 'ఏడుపు గొట్టు' వేషం వేశాను. "అమ్మ" -"అమ్మ!" అనిపించలేదు - "అమ్మో" అని పడిపోయింది. పాల్‌గారు "నువ్వు మెడ్రాస్ పోరా. ప్రకాష్ దగ్గర చేరు" అని ఉత్తరం ఇస్తే, ఆర్.ఎస్. ప్రకాష్ దగ్గర చేరాను - సహకార దర్శకుడిగానే. నాకు సరదాగా, నవ్విస్తూ మాట్లాడ్డం సరదా. జోకులు చెప్పడం సరదా. ఆ సరదా చూసి పార్వతీశం వేషం నాచేత వేయించాలని ప్రకాష్‌గారు సరదా పడ్డారు. నావల్ల కాదన్నాను. నాకు హాస్యం రాదు మొర్రోమన్నాను. 'నేనున్నాను వెయ్యి' అన్నారాయన. వేశాను. ఆయనే అంతా చేసి చూపించేవారు. నేను అలాగే చేశాను. ఆ విధంగా నేను హాస్య పాత్రధారిగా తయారు చెయ్యబడ్డాను". అని సత్యంగారు చెప్పారోసారి. ఐతే 'పార్వతీశం' సినిమా, అప్పుడొచ్చే పౌరాణికాలంత పెద్ద నిడివి గల సినిమా కాదు. అంత నిడివి వుంటే గాని, ప్రేక్షకులకి సయించదు. అంచేత, 'బొండాం పెళ్ళి' 'చదువుకున్న భార్య' అన్న మరో రెండు చిన్న సినిమాలు కలిపి, విడుదల చేశారు.

"ఆ సినిమా అయిన తర్వాత






'ఇద్దరు మిత్రులు' సినిమాలో ...పళ్లు రాలగొట్టమనే సన్నివేశంలో రమణారెడ్డి, అక్కినేని నాగేశ్వరరావుతో - లంక సత్యం

నన్నుచూసి - కామిక్ యాక్టర్లో - అనేవాళ్ళు. అప్పుడు కామిక్కేక్టర్లనే అనేవాళ్ళు - హాస్యం చేసినవాళ్ళని. హేళనగా కూడా అనేవాళ్ళు. శివరావు, రేలంగి వచ్చిన తర్వాతనే హాస్య నటులకి విలువ, విశిష్టతా పెరిగాయి" అని చెప్పారు సత్యంగారు. ఆయనకింకో రికార్డు కూడా వుంది. హాస్య నటుల్లో కొందరు డైరక్టర్లయ్యారు. వాళ్ళలో మొదటివాడు కూడా ఆయనే. 1947లో వచ్చిన జెమిని వారి 'జీవన్ముక్తి'కి ఆయనే డైరక్టరు. అందులో వేషం వేశారు, హాస్యమే చేశారు. ఆయనకి మంచిపేరు తెచ్చిన సినిమా 'బాల నాగమ్మ'. అందులో చాకలి తిప్పడుకి మంచి రెస్పాన్స్ వచ్చింది. బాగా ఆకర్షించింది. ఇంకో విశేషం చెప్పేవారు సత్యంగారు. "జోక్‌లా వుంటుంది - వినడానికి. జెమినివారు 'మదన కామరాజు' అని తమిళంలో తీశారు. ఆ తమిళ సినిమాలో నేనూ సూరిబాబూ కలిసి తెలుగు పాట పాడాం - నటిస్తూ. "ఏం పిల్లో సింకిరి బొంకిరిగున్నావు" అన్న పాట అది" మాయలోకం, మాయపిల్ల, ఇద్దరు మిత్రులు, జగదేక వీరుని కథ, గులే బకావళి కథ, రహస్యం మొదలైన సినిమాల్లో సత్యం హాస్య పాత్రలు ధరించారు.

"కొంత కాలానికి నా అసలు పళ్ళుపోయి, డబ్బు పెట్టి కొనుక్కున్న పళ్ళొచ్చాయి. అప్పుడు డాక్టరుగారు "జాగ్రత్తగా వాడకోండి పళ్ళు" అన్నారు. "ఎందుకు వాడుకోనూ! అవంటే ఉచితంగా వచ్చాయి. ఇవి డబ్బుపోసి కొన్నవి కదా" అని జోక్ చేశాను. ఆయనా నవ్వారు. ఈ పళ్ళని కూడా ఓ సినిమా వాడుకుంది. 'ఇద్దరు మిత్రులు'లో చిన్నవేషం. "పళ్ళు రాలగొడతాను జాగ్రత్త" అని అక్కినేని నాగేశ్వరరావు అంటారు నన్ను. వెంటనే కట్టుడు పళ్ళుతీసేసి - "ఏదీ, ఎలా రాలగొడతావో రాలగొట్టు" అంటానన్నమాట. మంచి జోకు".

సత్యంగారు - ఆయనే, చెప్పినట్లు అటు డైరక్టరూ కాదు, ఇటు హాస్య నటుడూ కాదు. 'మోహిని కీలు గుర్రం' (తమిళం నుంచి డబ్ అయిన తెలుగు చిత్రం పేరిది) "బెంగుళూరు మెయిలు" (కన్నడం) చిత్రాలు ఆయన డైరక్టు చేశారు. "దాంతో ఎందులోనూ స్థిర పడలేక ఏదీ కాకుండా - అంటే పూర్తిగా - అయి పోయాను" అన్నారాయన.

ఈ హాస్య నటుడి జీవితంలోనూ విషాదాంతం అన్నంత వింత సంఘటన జరిగింది. కొన్నేళ్ళ క్రితం కాజీపేట దగ్గర వంతెన మీదనుంచి రైలు పడిపోయి, చాలామంది ఘోరమరణం పొందారు. ఆ ప్రమాదంలో సత్యం గారు మరణించినట్టుగా వార్త వచ్చింది. పత్రికల్లో మృతుల పేర్లలో ఆయన పేరూ వుంది. అది చూసి బంధుమిత్రులు శోకం పట్టలేకపోయారు. ఐతే ఆ మర్నాడు ఆయన ఆనందంగా నవ్వుకుంటూ విజయవాడ చేరుకున్నారు. జరిగిందేమిటి? సత్యం గారు విజయవాడ వెళ్ళాలని ఆ మెద్రాసుబండి ఎక్కారు హైద్రాబాదులో. అప్పుడు ఒకటో తరగతి ప్రయాణికుల పేర్లే రైల్వేవారి దగ్గర వుండేవి. బండి బయల్దేరిన తర్వాత, ఘటకేశ్వర్ అనేవూళ్ళో కాబోలు సత్యం గారి మిత్రులు ఆయన పరిస్థితి చూసి, అక్కడ దింపేసి తీసుకెళ్ళారు. ఆయన "అతినిషా"లో వున్నారు. ఆ సంగతి ఎవరికీ తెలీదు. ఆ రాత్రి రైలు ప్రమాదం జరగడం, పేర్ల ప్రకారం లంక సత్యం కూడా మరణించినట్టుగా వార్త రావడం జరిగాయి! ఆ సంఘటన తర్వాత, మృత్యుంజయుడనీ, సత్యం జయుడనీ మిత్రులు ఆయన్ని అభినందించారు. "దాన్నే దైవలీల అంటాం. ఆయువుంది గనక, దేవుడే నన్ను అలా తప్పించాడు. ఆయువు లేనప్పుడు నేనింకా వుంటానన్నా, దేవుడు ఉండనీయడు" అన్నారు సత్యంగారు - నవ్వుతూ. వేసినవి తక్కువ పాత్రలే కావచ్చు, అవి గుర్తుండే పాత్రలు. బారిష్టర్లు ఇవాళ లేకపోయినా సత్యంగారు లేకపోయినా, 'పార్వతీశం' సినిమా ప్రింటు దొరక్కపోయినా, 'పార్వతీశం' చదివినప్పుడు మాత్రం ఆ తొలి హాస్య హీరో గుర్తురాక మానరు.










చెప్పదలుచుకున్న విషయాన్ని పాట రూపంలో చెప్పాలనుకున్నప్పుడు సాహిత్య రూపంగా వెలువడిన ఆ భావంలోని వస్తుగుణానికి ప్రాణం పోసేది సంగీతమే. అందుకే సాహిత్యానికి సంగీతం దోహదం చెయ్యాలే గానీ ద్రోహం చెయ్యకూడదు. 1954లో విడుదలయిన విజయా వారి

# చంద్రహారం

చిత్రంలోని ఈ రెండు పాటలను ఈ రోజున వింటే - కిక్కిరిసిన రోడ్డు మీద - ట్రాఫిక్ సెన్స్ లేని జనం మధ్య నుండి - ఒక్కసారిగా ఎగిరిపోయి తపోవనంలో పడిన వాడి మనసులో నిండే ప్రశాంతత, పోల్చుకోవడం వచ్చి మాట్లాడ్డం రాని పిల్లాడు సంతలో తప్పిపోయి ఏడుస్తుంటే అమ్మ కనిపించినప్పుడు అతగాడికి కలిగే ఆనందోద్వేగం - ఇవన్నీ అనుభూతిపరంగా అవగతమవుతాయి. ముందు ఉటంకించిన ఉపోద్ఘాతాన్ని అవునిపిస్తాయి. ఈ పాటలను పింగళి నాగేంద్రరావు రాశారు. ఘంటసాల సంగీతం సమకూర్చి గానం చేశారు. ఎన్.టి.ఆర్. అభినయించారు.



ఎన్.టి.ఆర్

ఇదినా చెలి, ఇది నా సఖి
నా మనోహరి
ఇదినా చెలి, ఇది నా సఖి
నా మనోహరి
మనసులోని మమతలన్ని
కనుల ముందు నిలచినటుల
వన్నెలతో చిన్నెలతో
మనసు గొనిన ఊహాసుందరి
ఇదినా చెలి, ఇది నా సఖి
నా మనోహరి
కలువ కనుల చల్లనిసిరి
ఉల్లములో ప్రేమలహరి
వినయసహన శోభలతో
తనివినించు సుగుణసుందరి
ఇదినా చెలి, ఇది నా సఖి
నా మనోహరి

ఎవరివో ఎచటనుంటివో ఓ సఖి!
నీలమేఘ మాలికలో మెరిసిపడే చంచలవో
చెలిమి చూపి చెంతరాక
మురిపించే మిలమిలవో!! ॥ఎవరివో॥
ఊహలోనె తలుకుమని -
మోహములో ముంచినావె
ఏనాటికినైన భువిని -
కనిపింతువో కనరావో!! ॥ఎవరివో॥



1948లో ప్రముఖ హిందుస్థానీ విద్వాంసుడు బడేగులాం అలీఖాన్ మద్రాసుకి వచ్చి సంగీత కచ్చేరీ ఇవ్వడం. ఆ ప్రభావంలో పడిన ఘంటసాల తన ఇంటికి బడే గులాం అలీఖాన్‌ని ఆహ్వానించి రెండు రోజుల పాటు ఆతిథ్యం ఇచ్చి ఎన్నో హిందుస్థానీ రాగాలను ఆకళింపు చేసుకోవటం ఇవన్నీ 'పాతాళ భైరవి'కి సంబంధించిన సమీక్ష (హాసం రెండవ సంచిక 16-31 అక్టోబర్, 2001)లో పాఠకులకు అందించటం జరిగింది.

'చంద్రహారం' చిత్రంలోని 'ఇది నా చెలి' పాటకు హిందుస్థానీ సంప్రదాయానికి చెందిన 'రాగేశ్వరి' రాగాన్ని ఉపయోగించడం వెనుక బడేగులాం అలీఖాన్‌తో పంచుకున్న సాంగత్య వైభవం ఉందంటారు కొంతమంది. అలాగే 'ఎవరివో ఎచటినుంటివో' పాటకు ఉపయోగించిన 'మోహన' రాగంలో చేసిన కొన్ని అన్యస్వరాల ప్రయోగానికి కూడా ఆ ప్రేరణ ఉందని వినికిడి.

జనరంజకత్వం కోసం రాగాలను మిశ్రమం చేసుకునే సౌలభ్యం, చెవికింపుగా ఉండేంత వరకూ ఆలాపనలలో స్వతంత్ర సంచారం చేసుకునే వీలు - హిందుస్థానీ సంప్రదాయంలోను, ముఖ్యంగా లలిత గీతాల స్వరకల్పనలోను వుంది. ఈ అవకాశాలన్నింటినీ అలవోకగా అందిపుచ్చుకుని అత్యద్భుతంగా స్వర పరచి - ముందు అనుకున్నట్టుగా - భావాన్ని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినంత సులువుగా తన గళ మాధుర్యంతో ప్రేక్షక శ్రోతల హృదయాలను ఈ పాటల ద్వారా రసప్లావితం చేయగలిగారు ఘంటసాల.

ఇక సాహిత్య పరంగా చెప్పాలంటే చెలి, సఖి, మనోహరి, చల్లనిసిరి, లహరి, తనివినించు,చంచలవో, మిలమిలవో ఇవన్నీ పింగళి వారి పాళిపై మురిసి, మెరిసిన తళతళలే...

ఈ 'ఎవరివో' పాట ముగియగానే ఆ సినిమాలో దుష్ట పాత్రను ధరించిన మహానటి సావిత్రి అభినయించిన ఓ స్వరఖండిక వస్తుంది. ఎ.పి. కోమల పాడగా, కళ్యాణి రాగంలో స్వరపరచబడిన ఆ చరణం సాహిత్యం ఇలా వుంటుంది:

**వలపు పాట వినగానె**
**నిలువలేక చేరితినోయ్**
**మనసు పడిన వరాలొసగి**
**నిను తరింపజేయుదునోయ్**
**సఖా ఓ సఖా...**


సావిత్రి

**ఈ రెండు పాటలూ కాక మరో పాటను కూడా ఇక్కడ ప్రస్తావించవలసివుంది.**

**ఒహూం ఒహూం హూం -**
**ఒహూం ఒహూం**
**ఏంచేస్తే అదే ఘనకార్యం**
**మనమేం చేస్తే అదే ఘనకార్యం**
**అదే ఘనకార్యం. ॥ఒహూం॥**
**నేను చెప్పినది నీకు తెలియక**
**నీవు చెప్పినది నాకు తెలియక**
**మనము చెప్పినది మనకే తెలియక**
**జిలిబిలి గిలిబిలి గిలిబిలిగా ॥ఒహూం॥**
**చెప్పే దెపుడూ చేయకుండగా**
**చేసే దెపుడూ చెప్పకుండగా**
**చెప్పిచేయునది ఒప్పకుండగా**
**గిలిబిలి గిలిబిలి గజిబిజిగా ॥ఒహూం॥**
**వాడి జుట్టు ముడి వీడికి పెట్టి**
**వీడి జుట్టు ముడి వాడికిపెట్టి**
**వాడు వీడు సిగపట్లు పట్టగా**
**గజిబిజి గిజిబిజి గడబిడగా ॥ఒహూం॥**


జోగారావు


పద్మనాభం, కె.వి.యస్. శర్మ


పద్మనాభం, జోగారావు, కె.వి.యస్. శర్మ, ఋష్యేంద్రమణి

ఈ పాటను పిఠాపురం నాగేశ్వరరావు, బృందం పాడగా జోగారావు, పద్మనాభం, శర్మ (కె.వి.యస్. శర్మ) అభినయించారు. ఆనందభైరవి రాగం ఈ పాటకు ఆధారం. పూర్తి శాస్త్రీయత తొణికిసలాడే ఈ రాగాన్ని హాస్య, వ్యంగ్య గీతానికి ఉపయోగించటంలో సంగీత దర్శకుడిగా ఘంటసాల చతురతను మనం ప్రత్యేకంగా గమనించాలి. ఈ పాట ఓపెనింగ్ బిట్‌ని, ఇంటర్ లూడ్‌లని జాగ్రత్తగా వింటే 'బంగారుపాప' లోని 'తాధిమి తకధిమి తోల్‌బొమ్మ' పాట గుర్తుకువస్తే అందుకు కారణం ఆనందభైరవి రాగమే! ఇక సాహితీ పరంగా పాటలో పింగళి చేసిన గమ్మత్తులు, విసిరిన చెళుకులు ఎప్పుడు విన్నా, అన్వయించుకున్నా నిత్య నూతనంగా ఉంటాయి. వ్యంగ్యం అంటే ఇలా ఉండాలి అని అనిపించేలా ఉంటాయి. పాట సాహిత్యాన్ని పదే పదే మననం చేసుకుంటే మన చుట్టూ ఉండే వారిలోనే బోలెడంత మంది జ్ఞాపకం వస్తారు. అంతటి విశ్వజనీయత ఉందీ గీతంలో!

మొదటి చరణం చివరి వాక్యమైన 'జిలిబిలి గిలిబిలి గిలిబిలిగా'లో 'గిలిబిలి'ని తీసుకొని రెండవ చరణం చివరి వాక్యంకి మొదటగా చేర్చి 'గిలిబిలి గిలిబిలి గజిబిజిగా' అనీ, ఈ వాక్యం చివర్న వున్న 'గజిబిజి'ని తీసుకుని మూడో చరణం చివరి వాక్యమైన 'గజిబిజి గిజిబిజి గడబిడగా'కి మొదట చేర్చటం పింగళి చేసిన మరో తమాషా! ▲



# 1-15 జనవరి 2002లో శ్రీ డి.వి. నరసరాజు రాసిన
# ఐడిల్ క్యూరియాసిటీ కథకు వచ్చిన స్పందన

శ్రీ నవరస రాజు గార్కి ఉరఫ్ డి.వి. నరస రాజు గార్కి నమస్కారములు.

నేను ఒక బుక్ సెంటర్ 'అద్దె'పతిని, హాసం పత్రికలో మీ "ఐడిల్ క్యూరియాసిటీ" కథ "సూక్ష్మంలో మోక్షం'లా ఉంది. మీరు రాసిన ఈ చిన్న కథలో నూటికి 90 శాతం మనుషులలో ఉండే అతి సాధారణ బలహీనతకి హాస్యం జోడించి మెప్పించారు. ఈ సారి వెయింగ్ మిషన్‌పై నా వెయిట్ చూసుకొన్నప్పుడు వచ్చే కార్డు వెనక వైపు "నీవు త్వరలో డి.వి. నరసరాజు గారి మరో కథ చదవబోతున్నావు" అని వస్తే నా ఆనందం అంతు చిక్కని ప్రవాహం. మీరు ఇటువంటి కథలు ఎన్నో వ్రాస్తూ మాలాంటి బలహీనులకి చురకలు అంటిస్తూ ఉండాలని ఆకాంక్షిస్తూ... మీ...

**అక్షర అభిమాని**
**పి. సత్యం, ఇ.నెం.10, 50 బిల్డింగ్స్, కాకినాడ-3**

అసలైన డి.వి. నరసరాజుగారి మార్కు రచన 'హాసం' 1-15 జనవరి సంచికలో చూడగలిగాము. కథ పేరు క్రింద బోల్డ్ లెటర్సులో మీరిచ్చిన వ్యాఖ్యానంలోనే జీవితాన్ని, సంఘాన్ని నిశితంగా పరిశీలిస్తున్న మీ సునిశిత విశ్లేషణ గోచరించింది. అనవసర విషయాల గురించి అన్వేషణ ప్రారంభించి చేతులు కాల్చుకొనే మిత్రులు ఈ నాటి అస్తవ్యస్త వ్యవస్థలో అడుగడునా కనబడతారంటే అతిశయోక్తి లేదు. సరిగ్గా ఇలాంటి వ్యక్తినే అదే వెయింగ్ మిషన్ మీద నేను ఇటీవలనే సికింద్రాబాద్ బస్టాండ్‌లో చూడడం జరిగింది. మీ మిత్రుడంత ఖర్చు పెట్టలేదు కాని, తాను కాక మరి ఇద్దరికి పైసలిచ్చి వారి వెయింగ్ టికెట్సు పరిశీలించడం చూసి 'పిచ్చాడురా' అని నవ్వుకున్నాం. ఈ స్మాల్ స్టోరీలో ఆ వ్యక్తి వ్యవహారానికిచ్చిన విశ్లేషణ రియల్లీ సూపర్బ్. పరిణతి చెందిన వ్యాఖ్యానమది. ఇక కథలోకొస్తే స్మాల్ స్టోరీ అయినా రాజుగారి మార్క్ తళుకు మంటుంది. తాను అప్పులిచ్చి మోసపోయిన దానికి టికెట్ మీది రాతలను అన్వయించుకోవటం, అనాథాశ్రమం నడపటం అంటే ఇతరుల బాధ చూడలేరు అనటం, క్యాంటిన్ వాడు కాయిన్స్ పూరికినే యివ్వడని కాఫీ తాగడం, బుక్‌షాపులో న్యూస్ పేపరు కొనడంవంటివి హాస్యపు వాసనలు గుబాళిస్తాయి.

30-40 కాయిన్స్ వేయించాక కూడా కుతి తీరని మిత్రుడు తను దిగే విమానాశ్రయంలో 2-3 వేయించాలనుకోవడం ఆ సందట్లో స్పేర్‌గా వున్న గంట సమయం ఎపుడో కొండెక్కిందని గమనించక చేతులు కాల్చుకొని అయ్యో! పాపం! అనిపించాడు. తానే మళ్ళీ కాయినేసి వచ్చిన టికెట్టు మీద వున్నట్టు (విమానం వెళ్ళిపోవడం) మీరు చెప్పినది ఈ స్మాల్ స్టోరీని అందంగా మలిచింది." ఆ లేదు! ఉ లేదు! అది పోయి అరగంటవుతోందని చెప్పారు'' అంటూ ముగించడం బాగుంది. మీకు వ్యవధివుంటే బిగ్ స్టోరీ చదివేవాళ్ళం.

**-జి. ప్రభాకర్ రావు**
**హైదరాబాద్**

గౌరవనీయులు, పూజ్యులు, సాహితీ పుత్రులు
శ్రీ డి.వి. నరసరాజు గారికి
వందనాలు... అభివందనాలు... శ్రీ చందనాలు

ఆర్యా! 1-15 జనవరి 2002 'హాసం' పత్రికలోని మీ కథ 'ఐడిల్ క్యూరియాసిటీ' చాలా చిన్నదైనప్పటికీ ఎంతో నవ్వు తెప్పించింది. కథలో నిగూఢమైన నీతిని చొప్పించారు. 'ఎవరి పనివారు చేయాలి. అనవసర విషయాలలో తల దూర్చకూడదు' అని నేను ఇంటర్మీడియట్ చదివే రోజుల్లో మాకు శ్రీ తుంబనాథం గారని ఓ ఇంగ్లీషు లెక్చరర్ ఉండేవారు. ఆయన ఎప్పుడూ ఓ స్లోగన్ చెబుతుండేవారు. క్లాసుకు కాస్త లేటుగా వచ్చినా లేదా అడిగిన ప్రశ్నలకు సరిగా జవాబులు చెప్పక పోయినా 'ఎందుకయ్యా మీకు చదువులు... వేస్ట్ ఆఫ్ ఎనర్జీ... వేస్ట్ ఆఫ్ టైమ్... వేస్ట్ ఆఫ్ మనీ... వేస్ట్ ఆఫ్ ఆల్ థింగ్స్' అని! మీ కథను చదివాక మా లెక్చరర్ అడిన పై మాటలన్నీ నాకొక్క సారిగా గుర్తుకు వచ్చాయి. మీ కథానాయకుడు గారు ఆయన విమానయానమేదో ఆయన చూసుకోక వెయింగ్ మిషన్ వెర్రిలో పడడమేలా? పైవన్నీ వేస్ట్ చేసుకోవడమేలా?

**-కె. ఆదినారాయణరావు, తర్లాగడివూరు.**

ప్రయాణ సందర్భాల్లో కాకతాళీయంగానో, కాలక్షేపం కోసమనో రకరకాల సంఘటన లు జరుగుతుంటాయి. అయితే అనవసర విషయాల జోలికి పోతే జేబుకి చిల్లి, అసలు పనికి మోసం జరగక మానక పోదు. ఏది ఏమైనా మీరు విమానాశ్రయాన్ని కథాకేంద్రంగా వుపయోగించుకున్నా, సాధారణంగా రైల్వే స్టేషన్లలోనూ, బస్టాండులోనూ ఇలాంటివి, ఇలాంటివాటిని పోలిన సంఘటనలు కోకొల్లలుగా జరుగుతూనే వుంటాయి. వెయింగ్ మిషన్‌లో బరువు చూసుకుందామనుకున్న తీరు అసమానం. చిన్న విషయాన్ని కథగా ఎలా మలచవచ్చో ఔత్సాహికులకు ఇటువంటి కథలు మార్గదర్శకమవుతాయనడంలో అతిశయోక్తి లేదు.

**నీలంరాజు రామ్‌బాబు**
**ఇందిరానగర్, ప్రకాశం జిల్లా**

నరసరాజు గారు కథలు, సరదాగా, హుషారుగా, పసందుగా వుంటాయే తప్ప మరోలా ఎలావుంటాయి కనుక. ఐనా, అనుకున్న ఐదు నిమిషాల్లో రాసే తీరు, వుండే వారెందరని?

నిజమే అదో చక్కని హాబీ. అదెంతటి కుతూహల పరుస్తుందని అలాంటి ఉత్సాహం వుండే వాళ్ళెందరని. సాఫీగా, హాయిగా స్కెచ్‌లా సాగినదది. కథలాగే సాగింది కదా.

జస్ట్ కోయిన్ సిడెన్స్ అనుకున్నవి అనుకున్నట్టే వెయింగ్ మిషన్‌లో వచ్చే కార్డుల పరంపరలు. ఇది కథలోనేగా సాధ్యం. కాకపోతే ప్లెయిన్ హేజ్ ఆల్‌రెడీ లెఫ్ట్ అని కార్డు రావడం కథా పరంగా గాక మరోలా అనుకునేందుకు అవకాశం ఏదీ? జస్ట్ ఫర్ ఫన్. చక్కటి ఊహ! చక్కని హాసం.

శ్రీ నరసరాజుగారు, ఈ వయసులో కూడా, ఇంతటి సున్నిత హాస్యాన్ని అందించినందుకు నమోవాకాలు.

**యస్.జె. శాస్త్రి. జి., విశాఖపట్నం.**

**వచ్చిన ఉత్తరాలలో పై ఐదు బాగున్నాయని వాటిలో పి. సత్యం రాసిన లెటర్ బహుమతికి అర్హమైనదని డి.వి. నరసరాజుగారు తెలిపారు. ప్రకటించిన ప్రకారం బహుమతి గ్రహీతకు 6 నెలల పాటు 'హాసం' పత్రికను ఉచితంగా పంపుతున్నాము. తక్కిన నలుగురికి 'హాసం' 1-15 ఫిబ్రవరి 2002 సంచికను సముచితంగా పంపుతున్నాము.**

**- ఎడిటర్**




పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## తారాగణం

కృష్ణ, జయప్రద, సుమన్, రూప, నరేష్, రాధికా వర్మ, రోహిత్, ప్రియాశర్మ, శివాజీ, శ్రీదేవి, తనికెళ్ల భరణి, ఏవీయస్, ఎమ్మెస్ నారాయణ, ఎల్.బి. శ్రీరామ్, సుధాకర్, సూర్య, గుండుహనుమంతరావు, జూ॥ వేణుమాధవ్, విజయలక్ష్మి, మురళీధర్, సూర్యవంశి, తెలంగాణా శకుంతల, మాధవి, శోభారాణి, విజయ భాస్కర్, చలపతిరాజు, ఏడిద గోపాలరావు, జి.వి. ప్రసన్న కుమార్, శారద, శ్రీహర్షిణి.

## సాంకేతిక నిపుణులు:

కథ, సంగీతం, నిర్మాణం : జె.కె. భారవి
మాటలు : శ్రీకృష్ణ
ఫోటోగ్రఫీ : విజయ్‌కుమార్
మేకప్ : శోభ
కాస్ట్యూమ్స్ : రాంబాబు
డాన్స్ : కృష్ణారెడ్డి
ఆర్ట్ : కిశోర్, ప్రవీణ్
పి.ఆర్.ఓ : యల్. వేణుగోపాల్
పాటలు : వేదవ్యాస, జె.కె. భారవి, గురుచరణ్, కలువ కృష్ణసాయి
స్టిల్స్ : రఘు
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ : శ్రీనాథ్
పబ్లిసిటి : ఏలే ధని
కో డైరక్టర్ : డి.వి. రాజశ్రీ
ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ : కల్పన
స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : వి. ఉమాకాంత్





భారవి




చంద్రవంశం




## తారాగణం

వేణు, భరణి, చంద్రమోహన్, చలపతిరావు, యం.యస్. నారాయణ, ఎల్.బి. శ్రీరామ్, గణేష్, ప్రసాద్ బాబు, మాళవిక, షేమ, అన్నపూర్ణ, ఢిల్లీ రాజేశ్వరి, శోభారాణి

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
**'రాజా'**
పర్యవేక్షణలో
**'హాసం'**
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

## సాంకేతిక నిపుణులు

కెమేరా : కె. ప్రసాద్
ఆర్ట్ : రామ్మోహన్
ఎడిటింగ్ : నందమూరి హరి
కో డైరక్టర్ : వెంకట్
ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్: వై. ప్రకాష్
మేకప్ : చంద్ర
డాన్స్ : రాజు, శివ శంకర్
కాస్ట్యూమ్స్ : బాషా
మాటలు : చింతపల్లి రమణ
పాటలు : సీతారామ శాస్త్రి, భువనచంద్ర, చంద్రబోస్, సుద్దాల అశోక్‌తేజ
సంగీతం : భరణి
దర్శకత్వం : గణపతి
నిర్మాత : రామోజీరావు



రామోజీరావు ఆర్.గణపతి






సిరివెన్నెల



భువనచంద్ర



అశోకతేజ



చంద్రబోస్

ప్రియనేస్తమా...

రచన: యస్.డి. బాలు **1** గానం: గంగాధర్, చలపతిరాజు, జె.కె. భారవి, శ్రీరామ్ భట్టార్

ప/అ: ఓ... పిన్నీసుల పిల్లో...
కో: ఏ... ఏ... ఎహె... ఎహె...
అ: ఒన్... టూ... త్రీ... ఫోర్...
ఓ... పిల్లో పిన్నీసుల ఫిగరో...
పిటపిటమంటున్నావే... నువు
పిటపిటమంటున్నావే...
పోరగాని ఫోజు చూస్తే
లబ్బ లబ్బ అంటావే... లగ్గా లగ్గ
అంటూనే
లబ్బో దిబ్బో అంటావే ॥పిల్లో॥
చ/అ:ఓ... హోయ్...
పచ్చరంగు పైటా పిల్లా...
పందానికొస్తావా... హో...
పందానికొస్తావా...
ఆ: ఆ... వస్తా.. వస్తే...
ఏం చేస్తావ్...
అ: పవరుస్టారు పవను లెక్క...
పట పట పట పటలాడిస్తా...
ఆ పందెంలో ఓడిస్తా...॥పిల్లో॥
చ/అ: ఏ... హోయ్...
మల్లెమొగ్గ జడల పిల్లా...
మాపటి కొస్తావా... (2)
ఆ: ఆ... వస్తా... వస్తే...
ఏం చేస్తావ్...
అ: మహేష్‌బాబు తీరుగ...
మా మహేష్‌బాబు తీరుగా...
నీ మనసుమీద పడతా...
మంచాలే
ఇరగ గొడతా... ॥పిల్లో॥
చ/అ:అరెరె... అరెరె... అరె...
అరెరెరెరె...
తమలపాకు నమిలేపిల్లా...
తోటకాడి కొస్తావా...
మా తోట కాడికొస్తావా...
ఆ: ఆ... వస్తా... వస్తే...
ఏం చేస్తావ్...
అ: తరుణు గాని టచ్చులిచ్చి...(2)
టపటప టపటప లాడిస్తా...
తామర పూలెడతా... ॥పిల్లో॥
చ/అ:బల్లే... బల్లే... బల్లే... బల్లే...
ఉలికులికి పడే పిల్లా...
ఊరిబయటికొస్తావా...
మనఊరి బయటికొస్తావా...
ఆ: ఆ.. వస్తా... వస్తే...ఏం చేస్తావ్...
అ: ఉదయకిరణ్ గానీలాగా...(2)
ఉయ్యాలూపిస్తా...
నీ ఊపిరినైపోతా... ॥పిల్లో॥
చ/అ:చిక్‌బం... చిక్‌బం... (2)
చిర్రు బుర్రు లాడే పిల్లా...
సినిమాకు వస్తావా... (2)
ఆ: ఆ... వస్తా.. వస్తే...
ఏం చేస్తావమ్మా...
అ: చిరంజీవి లెక్క నిన్ను... (2)
చింతచెట్టు ఎక్కిస్తా...
నీ చింతలన్నీ తీర్చేస్తా.. ॥పిల్లో॥
చ/అ:బంగారు రంగు పిల్లా...
బరిలోకి వస్తావా... (2)
ఆ: ఆ... వస్తా... వస్తే ఏం చేస్తావ్
అ: బాలకృష్ణ లాగా నీతో... (2)
కిస్సుకబడ్డీ ఆడేస్తా...
నీకింద పడి పోతా... ॥పిల్లో॥

రచన: గురుచరణ్ **2** గానం: గంగాధర్, మణినాగరాజ్

ప/ఆ:ఎంత ముద్దుగున్నాడే ఈ ముద్దుల పిల్లాడు (2)
గుండెల్లో దూరాడూ మనసంతా తడిమాడూ
ఏకంగా ఎక్కడికో ఎత్తుకెళ్ళిపోతున్నాడూ...



అ: అహ్హాహ్హా... హహ్హాహ్హాహ్హా
ఆ: కోక జారుద్దిరా కొంప మునుగుద్దిరా...
అ: అహ్వాహ్వా... హహ్వాహ్వాహ్వా
దిన్ దిన్ దిన్ లక్ (4)
తినర తిక్కలోడా ॥మామ మామ॥
చ/ఆ: తింగరి బుచ్చీ వస్తా
అ: రా
ఆ: తినిపిస్తా బాదం పిస్తా
అ: అహో
ఆ: తిమ్మిరి వదిలించేస్తా తిత్తి తీస్తా
అ: నేను రెడీ
ఆ: తేనె తెట్టె చూపించేస్తా
అ: చూస్తా
ఆ: తేలుతో కుట్టించేస్తా
అ: అహా
ఆ: తై తక్కలు ఆడించేస్తా కళ్ళేమేస్తా
అ: ఏస్కో
తప్పతాగి తాపమెక్కి తప్పులోన తాళమేస్తే
ఒక్క తొక్కు తొక్కి తోక కత్తిరించి పారేస్తా ॥మామ మామ॥
చ/అ: ఇదిగో నాకో చిన్న డౌటు... చెప్పనా... చెప్పనా
దగ్గర్రా.. చెవిలోనే చెప్తా...
ఆ: తీట తీట తీట గుందా
అ: అవును
ఆ: తిప్పి తిప్పి తిత్తే తీస్తా
అ: తీయ్
ఆ: తిన్నదంతా కక్కేదాకా తీగ లాగుతా
అ: లాక్కో
ఆ: తొక్కుడు బిళ్ళాడిస్తా
అ: నేను రెడీ
ఆ: తోలు వలిచేస్తా అ: నో... నో... నో...
ఆ: తాట తీసి తాయిలమెట్టి టాపులేపుతా
అ: హో... హో...
తొక్కలోది తిక్కలేస్తే తుక్కు తుక్కు కింద కొట్టి
డొక్క చింపి డోలు కట్టి తూరుపార పట్టేస్తా ॥మామ మామ॥



రచన: చంద్రబోస్ **1** గానం: టిప్పు

అరెరె అరెరె అందగత్తెరో
పగలె వెలిగే చందమామరో
కింగులాంటి నన్ను చూసి
గంగ వెర్రులెత్తిపోయి
నింగి నుంచి నేలకొచ్చెరో (2)
ఎంకి పాపలా ప్రియాంక చోప్రాలా
ఎంత ఎంత ముద్దుగా వుంది చూడరో
కరణం మల్లిలా కరిష్మ చెల్లిలా
కొంత కొంత కొంతగా చేత చిక్కెరో
చిలకై కులికి చెరుకై కొరికి నెమలై నమిలెను యారో ॥అరెరె॥
ప్రేమించే మనసే వుంటే లైఫ్ కాదా సెలయేరు
పాలించే పవరే వుంటే ఆపలేరెవరూ
లక్కీగా లవరే వుంటే దొరికినట్టె కోహినూరు
ఖాళీగా తిరిగావంటే మారునోయ్ స్టారు
అందుకోసమే ఓ ఆడపిల్లకి అప్పణంగ ఇవ్వరా గుండె లాంతరు
తప్పుకాదురా అమ్మాయి గారికి లైఫులాంగు చెయ్యరా రేయి నౌకరు
మతులే చెడనీ జతలో పడనీ బ్రతుకే యమయమ బోరు ॥అరెరె॥
మోహించే సొగసే వుంటే ఎందుకంట సీషోరు
ఊరించే ఫిగరే వుంటే ఎందుకోయ్ షుగరు
అందించే అందం వుంటే ఎందుకంట ఆస్కారు
వర్షించే పరువాలుంటే ఎందుకోయ్ షవరు
నీలవేణిని నీ ప్రేమరాణిని అంటకుండ వుండటం పాత కల్చరు
నీలి తారని నీ ప్రేమ స్టారుని అంటిపెట్టుకోవడం కొత్త ఫీచరు
ఖుషిగా కసిగా రుచిగా బుషిగా అడిగెయ్ ఇక వన్‌మోరు ॥అరెరె॥

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి **2** గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం

ప్రియనేస్తమా స్వాగతం అంటున్నది పరిమళం
గమనించుమా ఈ దినం సరికొత్త సూర్యోదయం
నిదురించిన ఊహలు లెమ్మని



శిథిలం చేసినదో ఈ ప్రేమ... ఓ... ఆ...
దక్కినవన్నీ బొక్కేవాడే దసరా బుల్లోడు
చిక్కిన దానిని అక్కునపట్టి చేసెస్కో ఛీపాడు
ఎవరికి ఎప్పుడు ఏమిస్తాడో అపై వున్నోడు
పబ్బంగడుపుతు పోయేవాడే మొనగాళ్ళకి మొనగాడు
లోకాన బ్రతికేది ఒకసారే సరదాలు చేసెయ్యి సయ్యారే
కాలాన్ని కౌగిట్లో బంధించు పరువాల బాణాలు సంధించు
చక్కని చిన్నది ఎదురుగ వుంటె
దిక్కులు చూస్తూ కూర్చుంటావే... ఓ... ఆ...

రచన: చంద్రబోస్ **6** గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, చిత్ర

ఆ: నీలి మబ్బుల్లారా కథ వినరే వేల చుక్కల్లారా వ్యథ కనరే
ఓ దారిలోన శుభమస్తులే ఓ దారిలోన శోధనలే
ఆ దారులన్నీ నావేనులే అన్ని దారుల్లోనా ఒంటరినే ॥నీలి॥
ఆత్మ బంధువులా వచ్చాడు నిండు చందురుడు
మమత వెన్నెలలే పంచాడు మనసుతో అతడు
నా బాటను చూపించాడు తన మాటను నిలబెట్టాడు
కనుమూసి తెరిచేలోగా తను మాత్రం మరుగయ్యాడు
వాడిపోయినా నేను ఓడిపోయినా
తన సౌఖ్యమే నాకు సంతోషము
దేవుణ్ణి వేడాను తన కోసము ॥నీలి॥
అ: కొమ్మ మీది మైనా కథ వినవే
నమ్మరానిదైనా వ్యథ కనవే
ఓ దారిలోన శుభమస్తులే ఓ దారిలోన శోధనలే
ఆ దారులన్నీ నావేనులే అన్ని దారుల్లోనా ఒంటరినే ॥కొమ్మ॥
హోరు గాలులలో చిక్కింది చిన్ని ఓ దీపం
స్నేహ భావనతో చేరింది చిలిపి ఓ నేస్తం
తన చేయిని అందించింది ఆ గాలిని ఆపేసింది
దీపానికి కళ పెంచింది నేస్తానికి చెయి కాలింది
చెయి కాలినా చెమ్మగిల్లినా ఆ బాధలోవుంది ఆనందము
ఏ స్వార్థమెరగంది ఈ బంధము ॥కొమ్మ॥

రచన: శ్రీ వేదవ్యాస **5** గానం: గంగాధర్, చలపతిరాజు, శ్రీరాం భట్టార్, శ్రీకాంత్, మణినాగరాజ్,

ప/పాప:సెన్సేషనల్ ఫ్యామిలీ...
సెంటిమెంట్ల లోగిలి...
జాయింటే జాలీ... జాలీ...
బాబు: స్వీట్ స్వీట్ ఫ్యామిలీ...
సూపర్ ఫ్యామిలీ...
డైలీ దీపావళి...
అ/ఆ: సెన్సేషనల్ ఫ్యామిలీ...
సెంటిమెంట్ల లోగిలి...
జాయింటే జాలీ... జాలీ...
ఆ: స్వీట్ స్వీట్ ఫ్యామిలీ...
అ: సూపర్ ఫ్యామిలీ...
ఆ: డైలీ దీపావళీ...
అ: బ్రదర్సే లవర్సు
కో: లవర్సు
ఆ: లెవల్స్ అదుర్సు
కో: అదుర్సు
అ: మా పవరుకి స్కయ్యే లిమిటు ॥సెన్సేషనల్॥
చ/ఆ:కలతలకు కష్టాలకు గుడ్‌బై లే...
అ: ఫియర్సుకు టియర్సుకు బైబైలే...
ఆ: హైటెక్కుల హ్యాపీకి హైవేలే...
అ: ఆల్వేస్ ఫుల్లుమూను
ఫోకసులే...

ఆ: బృందావనం బ్యూటీ
ఈ ఇంటి ముందు ఏ పాటి...
అ: మా అన్న వదినల ఒడి
అదే మాకు ప్రేమ గుడి...
ఆ: ఎవరెస్టు శిఖరమంటి
ఎవర్‌గ్రీన్ హార్టు తోటి
అ: లైఫ్ లాంగ్ చేస్తాము
లవ్వులూటీ... ॥సెన్సేషనల్॥
చ/ఆ:మంచి తనానికి అడ్రస్ మా ఇల్లే
అ: నీతీ... నిజాయితీ మా బ్లడ్డే...
ఆ: ఈర్ష్యలకూ... ఈగో లకు నో
ఛాన్సే...
అ: ఈ మిలీనియం
వండర్ హోమ్ ఇదే...
ఆ: ఏ నాటికి మునిగిపోని
టైటానిక్ షిప్పు ఇది
అ: టాటాలకు బిర్లాలకు
మతిపోయే మందిరమిది...
మా వదినలె మా మదర్సు...
ఆ: మా మరుదులె మాకు సన్సు...
అ: ఒకరి కోసమింకొకరం
పుట్టామండి ॥సెన్సేషనల్॥

రచన: కలువ క్రిష్ణసాయి **6** గానం: గంగాధర్, మణినాగరాజ్

ప/ఆ: మామ మామ మస్తీ మాపటేల కుస్తీ
అ: తింగర బుచ్చీ... తింగర బుచ్చీ... తింగర బుచ్చీ... తింగర బుచ్చీ...
ఆ: మామ మామ మస్తీ మాపటేల కుస్తీ
చందమామ మామ మస్తీ మాపటేల కుస్తీ
కొంటె కోణంగుడా కోడి కూరుందిరా



అ: ఎంత ముద్దుగున్నది ఈ ముద్దుల చిన్నది (2)
గుండెల్లో దూరిందీ మనసంతా తడిమిందీ
ఏకంగా ఎక్కడికో ఎత్తుకెళ్లిపోతోంది ॥ఎంత॥
చ/అ:పరువాల పంట ఒంటిపై పండించింది
గిలిగింతకు గ్రీన్ సిగ్నల్ ఇచ్చేసింది
ఆ: నూనూగు మీసానికి మాటొచ్చింది
నా ఏజికి ఏం కావాలో చెప్పేసింది
అ: మిస్సు వరల్డ్ మిస్సైల్లే కురిపించింది ॥మిస్సు॥
ఆ: హార్టెటాక్ వచ్చింది హాయి హాయిగా ఉంది ॥ఎంత ముద్దు॥
చ/ఆ:స్వయిలంటే ఏమిటో తెలిసొచ్చిందీ
స్టైలంటే అదేకదా అనిపిస్తోందీ
అ: డ్రీంగర్లు కంటి ముందే కదలాడిందీ
డిడిక్కీ గంటలు నాలో మోగించిందీ
ఆ: ఇన్నాళ్లూ లేనిదేదో మొదలయ్యింది ॥ఇన్నాళ్లూ॥
అ: ఈ పిల్ల ఫ్రెండ్ షిప్ తప్ప
ఇంకేం వద్దనిపిస్తోందీ... ॥ఎంత ముద్దు॥

రచన: గురుచరణ్ **3** గానం: గంగాధర్, మణినాగరాజ్

ఓం ప్రేమ బ్రహ్మః
ప్రేమే విష్ణువు:
ప్రేమ దేవో మహేశ్వర:
ప్రేమ సాక్షాత్ పరబ్రహ్మః
తస్మైశ్రీ ప్రేమాయనమః
ప/అ: ధీం తకిట.. తకిట...
ధీం తకిట...ధీం తకిట... తకిట...
ధీం తకిట... భంగిమట...
తకిట బంధమట... భామ అట
తకిట బావనట... మనసు అట
తకిట మంత్రమట... మువ్వలట
తకిట ముద్దులట...
ప్రణయ సంపద...
ప్రాణమీయదా...
మదన కళల కదన కథల
లలిత చలిత లయల
హొయల ॥ధీం॥
చ/అ:నువ్వులేనిది ఉందా
ఆకుకు మడుపు

ఆ: మడుపున ఉన్న రుచులు
తమకే ముడుపు
అ: ముడుపులు ఇచ్చింది
ఊహల మంచం
ఆ: ఊహల మంచానికి
మల్లెలు లంచం
అ: అరెరె... (2) పువ్వు
తగిలె... నా పొగరదిరె...
ఆ: అదిరె... అదిమె...
పెదవులపై నీ మధుపాలికే...
అ: కోక సెలవుకు...
ఆ: రైక సంతకం
ఇ: కనులు కనులు
కలుసుకొనుటె
కలిసి మెలిసి
మసలు కొనుటె ॥ధీం॥
చ/అ: అణిగే పెట్ట చూస్తే
ఆగదు పుంజు
ఆ: వలచే పుంజు వస్తే



ఆ: ఓ అంటె చాలండి కొండెక్కి కూర్చున్న
కోతినైన తీసుకొచ్చి కానుకివ్వలేమా ॥నింగినేల॥
ఆ: పెళ్లికొడకా అంత తుళ్లిపడకా మూడు ముళ్ళు వేసేదాకా
అందరి ముందర చిందరవందర తొందర ఎందుకు ఈలోగా
అ: రామ చిలకా నువ్వు ఆపలేవుగా ముందే రాసివున్నదిలే గనక
ఆశపెట్టి చంపక జాడకూడ చెప్పక గమ్మున వుండకు వెనకాల
ఆ/కో: ఏ ఊహలో ఉందోమరి ఊ కొట్టనీ కన్యామణి
ఆ ఊసులే విందామని ఉబలాటమే కుర్రోడికి
ఆ: మన ఇంటి పెళ్లితో పొరుగింటి వాళ్లకు
నిదరన్నదే ఇక రారాదట ఇటువంటి సందడి
కనులార చూడగ నిజమా కలా అనిపించాలట
అ: అల్లాడు పిల్లాడి పిల్లాడి ఆరాటం
అంతవరకు కళ్లెమేసి ఆపటం ఎలాగా
ఆ: డోలుకట్టే ఆ శుభలేఖ అందనీవయ్యో
అ: తాళికట్టే తరుణందాకా తాళలేనమ్మో
గోలపెట్టే ఆశలకేక ఆలకించమ్మో
ఆ: కుదరవయో పరువు చెడే పదనిసలు
అ: వినపడవా సైగలలో సరిగమలు

రచన: భువనచంద్ర **5** గానం: రాధిక

చందమామ పైనుందీ మల్లెమొగ్గ కిందుంది
ఆశపుడితే హైరామా ఆడుకుందాం రమ్మంది... ఓ... ఆ...
మత్తెక్కించే మందుంది ఆపై ముద్దుల విందుంది
విప్పీ విప్పని సొగసుంది వెచ్చంగా వాటెయ్‌మంది
మధుర మీక్షణం మరలరాదురా మోజు తీర్చుకోరా... ఓ... ఆ...
ప్రేమా ప్రేమని అరిచేవాళ్లకి తెలిసిందేంటంట
ప్రేమకి బానిస అయిపోయాక మిగిలిందేముందంట
అందీ అందని ప్రేమలకోసం పరుగే వద్దంట
పిటపిటలాడే అందాలన్నీ దోచిస్తా రమ్మంట
ప్రేమల్లో పడతారు పిచ్చోళ్ళు
పడ్డాక మిగిలేది కన్నీరు
తప్పించుకున్నోళ్లె ఘనులంట తప్పించుకున్నోళ్ళు లేరంట
ఎందరి మనసులు ఎందరి బతుకులు



కమ్మని పాటల బాటలు చూపెను రమ్మని...
నింగినే ఈదుతూ ఎగిరింది ఎద పావురం
ఆశనే తరుముతూ సాగింది మది సంబరం ॥ప్రియ॥
చీకటి ఒడిలో కలలను రేపే రేయి వేకువ
చలి దూకిన తోటకు రంగులు పూసే పూల వెల్లువ
అరచేతులలో స్వర్గము విప్పే కాంతి జల్లువ
గగనానికి నేలకు వంతెన వేసే వాన వెల్లువ
అలలకు సైతం శృతిలయ తెలిపే ఆలాపన నీవా
శిలలకు సైతం కులుకులు నేర్పే ఉలి చెలివే నీవా
ఋతువుల అర్థం మార్చే మహిమవున్న మది నీవేనా
ఎడారింట ఆమని చేర్చే సరాగాల కథవేనా
అని తననే అడిగి స్నేహం పంచే ఓ హృదయం కోసం
కొనసాగే ఈ పయనం వెతికింది తన గమ్యం ॥ప్రియ॥
కలతల భారం జలజల కరిగే జాలి మేఘమై
నలు దిక్కుల దూరం చెరుపుతు తిరిగే గాలి వేగమై
ఎదురుగ లేని ఎదలను మీటే తేనె రాగమై
గత జన్మలలోని బంధం తాకే భావ గీతమై
ఎవ్వరికోసం వెతుకుతువుందో ఏమో ఈ హృదయం
కోరిన తీరం ఎక్కడ వుందో ఎన్నాళ్లీ గమనం
కలవరించు ఎద సవ్వడినే కవితలల్లి పలికిస్తుంది
బదులురాని ఆవేదనతో నిరంతరం చూస్తోంది
ఆ మనసును తడిమే మనసెదురైతే ఫలితం రసభరితం
తన మధనం అతి మధురం ఆ కథనం అమృత స్వరం ॥ప్రియ॥

రచన: సుద్దాల అశోక్‌తేజ **3** గానం: సోను నిగమ్, కవితా సుబ్రహ్మణ్యం

అ: వెన్నెలలో తిరగాలి కౌగిలిలో ఒరగాలి ముద్దులలో కరగాలి
చిలక పలుకులతో హంస నడకలతో నడిచి రావె లలనా
కాలి అందెలతో గుండె సవ్వడితో శృతిని కలిపి రావే
ఆ: కన్నులతో పిలవాలి కబురులే అడగాలి కవితలే పాడాలి
కన్నె పిలుపులను సన్నజాజులతో చూసి తెలుసుకోవా

గంపకు రంజు
అ: పాచికలాడుదాము
పదవే పిల్లా...
ఆ: పగలే బిగువంతా
రాతిరి గుల్లా...
అ: అదును పదును కుదిరింది
అడ్డు తొలిగింది
ఆ: ఆటపాట కలసింది
హంగు తెలిసింది
అ: ఇరుకు లోగిలి
ఈడులో 'గిలి'
ఇ: చిలికి చిలికి చలికి వణికి
ఎదలపొదల రగులు కొలిపె
॥థీం॥
చ/ఆ: చల్లగా వచ్చిందీ...
చల్లగా వచ్చింది
వెచ్చగా గిచ్చింది
ఎక్కడో హరి హరి
ఏమిటీ ఈ కిరికిరి
బావల హరుల హరి
అ: తడిపొడి శిల్పంలో

షకలక బాలా...
ఆ: షాకులు ఇవ్వకురో
చిక్‌బుక్ బావా...
అ: నడుమే కనపడని
నాగిని నీవా
ఆ: ఒడిలో పెనవేసి
అల్లుకుపోవా
అ: కసిగా కలిసే వంటగదిలో
జంటగూడీ...
ఆ: కొసరు అసలు
కలగలిపి మిక్సీ చేసీ...
ఇ: పాట పాడుకో
పోపు పెట్టుకో
పులుపు కూర
కుత కుత మని
ఘుమాయింపు
జమాయిస్తే
అ: సిగ్గులట తకిట మొగ్గలట
ముద్దులట తకిట ముద్రలట
ముత్యమట నుదుట ముగ్గులట
ఈ సృష్టి గతే, శృంగారమట

రచన: డి.యస్. బాలు **4** గానం: గంగాధర్, చలపతిరాజు, శ్రీకాంత్, కిషోర్, జె.కె. భారవి, మణినాగరాజ్, విష్ణుప్రియ

అ: మస్తు మస్తు పెళ్ళి
మజాకైన పెళ్ళి
కో: ముచ్చటైన పెళ్ళి
మురిపాల పెళ్ళి...
హోయ్... ॥మస్తు॥
జోకులు వేసుకో
జిందగీ నీది
సోకులు చూసుకో
చిన్నదే నీది
అ/కో: తీస్కో తీస్కో
ఆ/కో: అల్లమురబ్బా
అ/కో: కాస్కో కాస్కో
ఆ/కో: అల్లుడి దెబ్బా

అ: కొట్టు కొట్టు కొట్టు
తీన్‌మార్ కొట్టు
కొట్టు కొట్టు కొట్టు
దిమ్మ తిరిగేటట్టు
ఝుంచక్కా ఝుంచక్కా
డ్యాన్సే మొదలెట్టు
హైటెక్కు డాంబర్రోడ్డదిరి
పోయేటట్టు
పెళ్ళంటే ఇదేనని
పెద్దలు దీవించేటట్టు
కో: శ్రీరస్తు... శుభమస్తు...(2)॥మస్తు
మస్తు॥
చ/అ: బంధువులంతా



బంతి పూవులై
ఆ: దీవెనలన్నీ దీపకాంతులై
అ: షోకుల శాఖకు నువ్వు మంత్రివై
ఆ: మంచి తనానికి నవ్వు రాజువై
అ: గోపురమంటి కాపురమంటూ
గోపికా కృష్ణులు మీరేనంటూ
ఆ: ఊరూ వాడంతా ఉయ్యాలో
ఉడికుడికి పోవాలి ఉయ్యాలో
నింగినేలంతా ఉయ్యాలో
నింగినేలంతా ఉయ్యాలో
నివ్వెరపోవాలి ఉయ్యాలో
అ: కొట్టు కొట్టు కొట్టు
అరె తీన్ మార్ కొట్టు
కొట్టు కొట్టు కొట్టు
అరె దిమ్మ తిరిగేటట్టు
అ/ఆ: పుట్టింటి పరువే నిలబెట్టు
అ/ఆ: నట్టింట్లో
నవ్వులు పండించు ॥మస్తు॥
చ/అ: బంగారానికి బదులుగ పుట్టిన
సీతమ్మే మా చిట్టికూతురు
నిప్పులాంటోడు
నిందలు వేయని
శ్రీరాముడు
మా బుజ్జి తమ్ముడు
అన్నా వదినలె
తల్లిదండ్రులట...
కోడలు కాదట నువ్వు
కూతురట...
అలకలు కురిపిస్తే
ఉయ్యాలో
అతలకుతల మైపోతా
ఉయ్యాలో
ఆ: అరనవ్వే ఇస్తే ఉయ్యాలో...

అంకితమైపోతా ఉయ్యాలో...
అ: అబ్బో అబ్బో అబ్బో అబ్బో
తీన్ మార్ కొట్టు
లగా లగా లగా లగా
దిమ్మ తిరిగేటట్టు
అ: మెట్టింటి మర్యాదలు
కొల్ల గొట్టు
మన ఇంటి పరువే
నిలబెట్టు
ఈల కొట్టు గోలచెయ్యి
గానాపాడు ఆఁ...
గంతులెయ్యి...
జిజ్జినకరి జినారే...
నాభిలోని నగారాలా
గూబ పగిలి పోయేటట్టు
నరాలలో నఖశిఖాలు
నజ్జు నజ్జు అయ్యేటట్టు॥నాభి॥
ఎయ్‌రా ఎయ్‌రా మావా...
ఎర్రెక్కించే స్టెప్పులెయ్‌రా మావా...
ఎయ్. ఏయ్... ఏయ్...
మైకాన్ చేస్కో
హలో మైక్ టెస్టింగ్ ...
ఓ.కె. ఓ.కె.
మైసమ్మ పాటేస్కో
మస్తుగుంటది...
మాయదారి మైసమ్మో
మైసమ్మా...
మనం మైసారం బోదామే
మైసమ్మా... ॥మాయదారి॥
ఆ: పిల్లా పాపలతో విలసిల్లండీ...
చల్లా చల్లంగ వర్ధిల్లండీ...
॥పిల్లా॥



చిలిపి నవ్వులను సిగలో పూలవలె తురిమి చూసుకోవా
అ: చెలియా... చూసే... చూపే... మోక్షం
ఆ: ఇదిగో అ: ఇపుడే
ఇ: మనసు కలిసె సమయం ॥వెన్నెలలో॥
అ: మబ్బులను తాకిన గాలులకు జారిన
తొలకరి చినుకువు నీవేనా
ఆ: నిద్దురలో కురులను ఒద్దికగ జరిపిన
ఉంగరపు వేలి కొస నీవేనా
అ: బాపు తొలి బొమ్మకు రేఖలను తీర్చిన
ఊహలకు ఊపిరి నీవేనా
ఆ: వేసవిలో చల్లని చందనపు చల్లిన
ఆశలకు రూపము నీవేనా
అ: నీ ఊపిరి తగిలిన గాలి పరిమళమై నను చేరాలి
ఆ: నిన్ను నన్ను కలిపిన దారి పారిజాత వనమవ్వాలి
అ: నిదుర చెరిచి పోవడమే ఆడవాళ్ళ జాణతనం
హాయి వంటి బాధ ఈ ప్రేమ ఆ: ॥కన్నులతో॥
అ: అందమైన అమ్మడి మాటలకు
గారడి నేర్పినది ఇంతగ ప్రేమేనా
ఆ: గుండెలోన సందడి పువ్వులలో
పుప్పొడి నింపినది నిండుగ ప్రేమేనా
అ: రెప్పలకు సైగలు సెగలకు భాషలు
చెప్పినది గుట్టుగ ప్రేమేనా
ఆ: పైటకు సిగ్గులు కులుకుకు తళుకులు
ఇచ్చినది ముద్దుగ ప్రేమేనా
అ: ప్రేమనేది ఈ పిచ్చిగదా నీ కమ్మని కవితిచ్చినదా
ఆ: నా గుప్పెడు గుండే కవిత
కవిత నడిచి వస్తే నేనే
అ: ప్రేమనేది ఆపడమూ దేవునికే అసాధ్యమూ
ఓటమింక లేనిదే ప్రేమా హా... ॥వెన్నెలలో॥





ఆ: ॥కన్నులతో॥
అ: చెలియా... చూసే... చూపే... మోక్షం... నిన్నే...
ఆ: నాకై
ఇ: రాసినాడు బ్రహ్మ

రచన: సిరివెన్నెల సీతారామశాస్త్రి **4** గానం: యస్.పి. బాలసుబ్రహ్మణ్యం, సుజాత

ఆ: నింగినేల ఒకటయ్యేలా పందిరేద్దామా
అ/కో: నింగినేల ఒకటయ్యేలా పందిరేద్దామా
ఆ: ఊరు వాడ హోరుమనేలా పెళ్ళి చేద్దామా
అ/కో: ఊరు వాడ హోరుమనేలా పెళ్ళి చేద్దామా
అ/కో: అల్లదిగో చేరువయే హంగామా
ఆ/కో: అల్లరితో స్వాగతమే అందామా
అ: తాళికట్టే తరుణందాకా తాళలేనమ్మో
గోలపెట్టే ఆశలకేక ఆలకించమ్మో
ఆ: డోలుకట్టే ఆ శుభలేఖ అందనీవయ్యో
అ: వినపడవా సైగలలో సరిగమలు
ఆ: కుదరవయో పరువు చెడే పదనిసలు
అ/కో: అక్షింతలు కాస్త పడనియ్యి ఆపై నీ ఇష్టం అబ్బాయి
ఆ/కో: ఓ మాదిరి సరదా పడనియ్యి
మేం చూడములేవే అమ్మాయి ॥తాళి॥
అ: కంచిపట్టు చీరతో కన్నె హంస తీరుతో
నన్ను చేరవే అమ్మాయి
కళ్ళు దించుకో కాస్త సిగ్గు నేర్చుకో
పెళ్ళి కళ పెంచుకోవే పాపాయి
ఆ: పట్టపగలే ఇంత పిచ్చి కలలెందుకు మతి చెదిరే మొగలాయి
ఇప్పటికిప్పుడె చప్పుడు దేనికి మోగకముందే షహనాయి
అ: తాంబూలమే ఇచ్చాం కదా తథాస్తనే అన్నాం కదా
ఆ: తయ్యారయే వచ్చాం కదా తతంగమే చేస్తాం కదా
అ: తెరచాటు తీయగ తరువాయి వేడుక
త్వరలోనె జోరుగ జరగాలిక
అ: మగపెళ్ళి వారికి సరదాలు తీరగ
మరియాదలేమిటొ చూడాలిగా

# సేవక భర్త



## రచన: ఆదివిష్ణు

(తెర తొలిగింది. రెండు సంచుల్తో రామకృష్ణ లోపలికి వస్తున్నాడు. అతని వెనుక మరో రెండు సంచుల్తో రిక్షా మనిషి వస్తున్నాడు. రామకృష్ణ తన సంచుల్ని ఒక చోట పెట్టేడు).



1940లో వినాయక చవితి నాడు - నాకిష్టమైన బందర్లో పుట్టేను. పుట్టింరోజు పండుగ చేసుకునే అలవాటు నాకు లేకపోయినా - దేశ ప్రజలు వినాయక చవితినాడు నా పుట్టింరోజు చేసుకోవడం నా అదృష్టం. ఇంటి పేరుతో కాలేజీ రోజుల్లోనే - 1959 నుంచీ కథలు నవలలు నాటకాలు రాయడం ప్రారంభించి ఆ తర్వాత సినిమాలకు రాయడం అలవాటు చేసుకున్నాను. ఆర్టీసిలో ప్రజా సంబంధాల శాఖకి ప్రధాన అధికారిగా పని చేస్తూ 1998లో రిటైరయ్యేను. ఆ తర్వాత ఉషాకిరణ్ మూవీస్ కథా విభాగంలో రెండేళ్ల పాటు పని చేసి - మనవళ్లతో ఆడుకునే టైం దొరక్క అక్కడ కూడా రిటైరయ్యేను. ఉద్యోగం చేస్తూనే సినీమాలు రాసుకునే అవకాశం నాకు ఆర్టీసి యిచ్చింది. రామానాయుడి గారికి 'అహ నా పెళ్లంట' చేసేను. ఆ పండుగ రెండొందరోజులు నడిచింది. రామోజీరావు గారికి 'సుందరీ - సుబ్బారావు' రాసి ఉత్తమ స్క్రీన్ ప్లే రైటర్‌గా నంది అవార్డు తీసుకున్నాను. హాస్యం సినిమాలక్కూడా నంది అవార్డులు యివ్వబడుననే మర్యాద నాకు లభించినందుకు సంతోషం.

-ఆదివిష్ణు, 306 మెహతా టవర్స్, అశోక్‌నగర్, హైదరాబాద్

రిక్షా: ఈటిని కూడా ఆటి పక్కనే పెట్టేమంటారా బాబూ?

రామ: ఇక్కడొద్దు! వాటినీ.... (అటూ ఇటూ చూసి) ఇక్కడ పెట్టు... (అతను పెట్టబోతాడు) వొద్దొద్దు... అక్కడ పెట్టు.... (రిక్షా మనిషి వాటిని అక్కడ పెట్టలేదు).... అక్కడకూడా వద్దు! ఇక్కడ పెట్టు.

రిక్షా: బాగా ఆలోచించుకుని చెప్పండి బాబూ! పెట్టమంటారా?

రామ: పెట్టు!

రిక్షా: పెడుతున్నాను.

రామ: పేరేమిటన్నావ్?

రిక్షా: నా పేరండీ? అప్పల్సామండీ!

రామ: (పర్సుతీసి) రిక్షా తొక్కడం కూడా ఒక ఆర్టేనోయ్ అప్పల్సామీ! అరే - సంచుల్నీ నన్నూ - గోదారిమీద పడవలాగా ఎంచక్కా తీసుకొచ్చేవ్!? (పర్సులోంచి అయిదు కాగితం తీసి యిస్తూ) వుంచు!

అప్ప: (ఇబ్బందిగా) ఏంటండీ ఇది?

రామ: (గొప్పగా) ఫైవ్ రూపీస్! అయిదు రూపాయల నోటు అప్పల్సామీ! ఇందులో రెండో మూడో తీసుకుని మూడో రెండో యిచ్చెయ్!

అప్ప: (తీసుకోలేదు) చాల్చాల్లే ఊరుకోండి! ఆప్టరాలైదు నోటు తీసి వందలో వేలో యిస్తున్నట్టు మాటాడతారే?

రామ: అప్పల్సామీ!

అప్ప: మార్కెట్టు నుంచి ఇక్కడకి ఎంతిచ్చుకుంటారో తెలుసా మీకు?

రామ: ఈ ఊరికి కొత్తగా వచ్చేం అప్పల్సామీ! అంచేత ఏమిటంటే రిక్షా ఫీల్డులో నాకు అనుభవం అంతగా లేదు. పోన్లే - చిల్లరొద్దుగానీ అయిదు సరిపెట్టేసుకో!

అప్ప: (తీసుకుంటూ) ఇది మడిసికి సరిపోద్దిలెండి! మరి సంచులకో?

రామ: అంటే - లగేజికి సెపరేట్ ఛార్జా?

అప్ప: (సీరియస్‌గా) తమరు తీసుకోడం లేదంటండీ?

రామ: ఓర్నీ! నేనెప్పుడు తీసుకున్నానయ్యా బాబూ? (క్షణమాగి) అంటే - అమ్మో - నీకంటికి రిక్షాతొక్కే మనిషిలాగా కనిపిస్తున్నానా అప్పల్సామీ?

అప్ప: లగేజీ లెక్కలు తెలుసుకోడానికి రిక్షానే తొక్కక్కర్లేదండీ! ఆర్టీసిలో ఉజ్జోగం చేస్తున్నా తెలిసిపోద్ది!

రామ: అంటే? నేను ఆర్టీసిలో ఉద్యోగం చేస్తున్నట్టు నీక్కూడా తెలిసి పోయిందా అప్పల్సామీ?

అప్ప: చిత్తం! మా డ్యూటీ అండీ!

రామ: (వళ్లుమండి పోయింది కాబోలు) ఇంకోటి అడుగుతాను - చెబ్తావా?

అప్పు: అడిగిచూడండి బాబూ! తెలుస్తే చెబ్తాం, తెలవకపోతే కుదర్దంటాం!
రామ: (వ్యంగ్యంగా) అల్లాగా! ఇప్పుడు నాకు పుట్టుమచ్చలెక్కడున్నాయో చెప్పగలవా?
అప్పు: చిత్తం! తమ పేరంటీ బాబూ!
రామ: నా పుట్టుమచ్చలకీ పేరుకీ లింకేమిటి?
అప్పు: అదంతే బాబూ! పేరును బట్టే పుట్టుమచ్చ! చెప్పండి బాబూ!
రామ: రామకృష్ణ
అప్పు: (వేళ్లు ముడుస్తూ) రా...మ... కి....ష్ణ.. (నెత్తిన రెండు చేతులూ చేర్చి పోజుగా కాళ్లూపుతూ) బాబా! తమ కుడి భుజం మీ్మద ... కందిగింజంత పుట్టుమచ్చుందండి!
రామ: (ఆత్రంగా చూసుకున్నాడు, ఆశ్చర్యంగా అరిచేడు) అప్పల్సామీ!
అప్పు: చెప్పండి బాబో!
రామ: వుందయ్యా నీ దుంపతెగ! సరిగ్గా కందిగింజంతే వుంది! ఇన్నేళ్లూ నాక్కనిపించనిది, నీకెట్లా కనిపించింది?
అప్పు: శాత్రం బాబూ! దానికి తిరుగుండదు! (పోజుగానే అన్నాడు)
రామ: శాస్త్రమా? అంటే-
అప్పు: (అదే పోజులో కాళ్లూపుతూ) ఆటో తొక్కక ముందు నా ఉజ్జోగం అదేనండి! పుట్టుమచ్చలు ఎక్కెడెక్కడున్నాయో చెప్పేవోడ్ని!
రామ: అమ్మో! నువ్వు మామూలు మనిషివి కావు! ఇంకేమీ అడగను!
అప్పు: లగేజి సంగతేంటో అడక్కపోతే ఎట్టా?
రామ: (అమాయకంగా) ఎంత?
అప్పు: ఇంకో అయిదిప్పించండి!
రామ: బావుండదప్పల్సామీ! నోటికి ఏ ఫిగరొస్తే అదడిగేస్తావా?
అప్పు: కన్సెషన్ కూడా యిచ్చేనండి!
రామ: (ఆశ్చర్యంగా) కన్సెషనా?
అప్పు: చిత్తం! పుట్టుమచ్చ గురించి కూడా చెప్పేకదండి మరీ!
రామ: ఓహో! ఎరక్కపోయి అడిగినందుకు అదొకటుంది గదా! (రెండు అయిదు నోట్లిస్తూ) ఇంద (గొణుక్కుంటున్నాడు) సంచులు రిక్షాలో వేసి నడిచొచ్చినా బావుండేది. అయిదుతో సరిపోయేది. (అప్పల్సామితో) ఇచ్చేగా పది! ఇంకా నిలబడ్డావే?
అప్పు: జాతకంగాని చెప్పించుకుంటారేమో చెప్పిపోదామనీ-
రామ: ఓర్నాయనో ఆ ఆర్టు కూడా వుందా? ఇన్నేసి ఆర్టులు పెట్టుకుని రిక్షానే నమ్ముకున్నావా అప్పల్సామీ! ఈ కొత్త ఊళ్లో నా జాతకం ఏ విధంగా తగలడు తుందో శాంపిల్ చూపించేవు గదా! అచ్చాలు! వెళ్లింక!
(అప్పల్సామి వెళ్లిపోయేడు. రామకృష్ణ నిట్టూర్చేడు. కుర్చీలో కూచోబోతూ మీనాక్షీ అని పిలిచేడు. మీనాక్షి గరిట పుచ్చుకుని వచ్చి అడిగింది)
మీనా: రిక్షా అబ్బిని పంపించేసేరా?
(ఆ మాట వినగానే రామకృష్ణ కుర్చీలో కూర్చునే ప్రయత్నం మానుకుని స్టడీగా నిలబడి అడిగేడు)
రామ: (ఆశ్చర్యంగా) వచ్చింది రిక్షా అబ్బి అని నీకెట్లా తెలిసిందీ?
మీనా: అదేం గొప్ప విద్యా?
రామ: కాదా మరి? నేను ఒంటరిగానే రావచ్చు. లేదా మా కొల్లీగ్ నా వెంట వచ్చి వెళ్లి పోవచ్చు. అదీ కాదనుకుంటే దారిన పోయే దానయ్య ఏమీ తోచక నా వెంట పడచ్చు. ఇన్ని ఛాన్సులుండగా - రిక్షా అబ్బీ అని కరెక్టుగా ఎట్లా చెప్పేవు?
మీనా: ప్రతి చిన్న విషయానికీ ఆశ్చర్యం నటించకండి! అసహ్యంగా వుంటుంది! ఇంతకీ రిక్షాకెంత యిచ్చేరు?
రామ: (తేలిగ్గా అన్నాడు) ఎంతోనా? జస్ట్ టెన్‌రూపీస్! పదిచ్చేను!
మీనా: (గాభరాగా) పది రూపాయలే? ఇక్కడే కదండీ మార్కెట్టు! నాలుగు సంచులకి పది రూపాయలా? పక్కింటి బాబాయిగారు సంచికో రూపాయి చొప్పున యిస్తారుట!
రామ: ఇంచుమించు నేనూ ఆ లెక్కనే యిచ్చేను మీనాక్షి! కాకపోతే - సంచుల్తో పాటు నేను కూడా రిక్షా ఎక్కేను గదా! అంచేత మరో అయిదు రూపాయిలు పుచ్చుకున్నాడు.
మీనా: అంటే? బాబాయిగారు సంచులు మాత్రమే రిక్షాలో పెట్టి - రిక్షా వెనక పరుగెత్తుకుంటూ వస్తారనా మీ ఉద్దేశం?



రామ: ఆ టైపులో వస్తేనే గాని రిక్షా వాళ్లకి గిట్టుబాటవదు మీనాక్షి!
మీనా: చాల్లే ఊరుకోండి! ఎంచక్కా బాబాయిగారు కూడా సంచుల మధ్యనే కూచునే వస్తారట. అసలే భారీ శరీరం! అయినా సరే! రేటు మాత్రం సంచులకే యిస్తారుట! ఇంతకీ ఏం కూరలు తెచ్చేరు?
(రామకృష్ణకు వళ్లు మండిపోయింది కాబోలు - కూరలమ్మే మనిషిలాగా ఆ బాణీలో లిస్టు చదువుతున్నాడు)
రామ: బంగాళ దుంపలు వంకాయలు టమోటా కాకరకాయలు బీన్స్-
మీనా: ఏం కూరలు తెచ్చేరని అడిగేనేగాని తెచ్చినవి అమ్ముకురమ్మని చెప్పలేదు!
(టేబుల్ దగ్గరకెళ్లి దానిమీదున్న కాగితాల్లోంచి ఒక కాగితం తీసింది)
రామ: ఏమిటది?
మీనా: లిస్టు! కూరల లిస్టు! ఏ ఏ కూరలు ఎంతెంతకు కొనవచ్చో కనుక్కుని రాసుకున్నాను!
రామ: (కీడు శంకించి నీళ్లు నములుతూ అన్నాడు) అదంత మంచి పద్ధతి గాదేమో మీనాక్షి! ఎందుకంటే అమ్మకాలూ కొనడాలూ అన్ని చోట్లా ఒకలా వుండవు గదా!
రామ: (బెరుగ్గా) కాదనుకో!
మీనా: బంగాళ దుంపలెంతకిచ్చేరు?
రామ: (హుందాగా) బంగాళదుంపలా? కిలో అయిదు రూపాయలు! ఫైవ్ ఓన్లీ!
మీనా: అమ్మో! అయిదు రూపాయలే?
రామ: నీ లిస్టులో ఎంత వుంది?
మీనా: నాలుగు రూపాయలు! సుబ్బలక్ష్మి వాళ్లాయిన నాలుగు రూపాయలకే తెచ్చేర్ట!

రామ: తెచ్చి వుండొచ్చు! ఆయనకి వాళ్ల బావమరిదెవడో చీప్‌గా అమ్మి వుంటాడు.

మీనా: చాల్లే ఊరుకోండి! వాళ్ల బావమరుదులకు కూరలమ్ముకునే ఖర్మేం పట్టింది! వాళ్లంతా ఎంచక్కా డాక్టర్లూ, ఇంజనీర్లుగా వున్నారు!

రామ: మీనాక్షీ! (తియ్యగా పిలిచేడు)

మీనా: ఊ!

రామ: మనం ఈ ఊరికి కొత్తగా వచ్చేం గదా! ఎవరో బావమరదుల వివరాలు ఇంతలోనే నీకెట్లా తెలిసేయి?

మీనా: విడ్డూరంగా అడుగుతారే! నేను అడగాలేమిటి? అన్ని వివరాలు సుబ్బలక్ష్మి గారే చెప్పేరు! ఊ... వంకాయలెంతక్కొన్నారో?

రామ: (ధైర్యం కూడగట్టుకుని ఈజీగా అన్నాడు) అడక్కు! పరమ చీప్‌గా కొన్నాను! ఎంత చీపో చెప్పలేను మీనాక్షి! యమ చవకన్నమాట!

మీనా: అదే! ఆ చవక రేటే చెప్పమంటున్నాను!

రామ: ఎంతోనా? జస్ట్... కిలో ఆర్రూపాయలు!

మీరా: రామరామ!

రామ: (అసహనంగా) ఆగు! సుబ్బలక్ష్మి గారి మొగుడు ఎంతక్కొన్నాడో చెప్పు?

మీనా: ఆయనే కాదు! తాయారమ్మ గారి తమ్ముడు కూడా చవగ్గానే కొన్నాడు.

రామ: చవకోకాదో చెప్పవలసింది నేను! (కోపంగా) ఎంతక్కొన్నాడట తాయారమ్మగారి తమ్ముడు...?

మీనా: కిలో నాలుగంటే నాలుగు రూపాయలు.

రామ: (కుర్చీలో కూలిపోతూ) ఇదెక్కడ గొడవ బాబూ! మీనాక్షీ (అక్షరాలని విడగొడుతూ) అయితే - టమోటాలు - కూడా - నేను - చాలా కాస్ట్‌లీగానే - కొని - వుంటానేమో?

మీనా: ఎంతక్కొన్నారు?

రామ: కిలో - పది - పదిరూపాయలు.

మీనా: (అతన్ని అనుకరిస్తూ) ఎనిమిది - ఎనిమిదికిచ్చేరుట!

రామ: ఎవరు - ఎవరు కొన్నారట?

మీనా: సుభద్రమ్మగారి భర్త!

రామ: (నీరసంగా లేస్తూ, నీరసంగానే అంటున్నాడు) మీనాక్షీ! ఈ చవక భర్తలు, చీపు తమ్ముళ్లు - వీళ్లంతా నా పాలిట శత్రువుల్లాగా ఈ వీధిలోనే వున్నారా మీనాక్షి?

మీనా: అంతేలేండి! అంతే! బేరసారాలు తెలిసిన బుద్ధిమంతులకు చవక భర్తలనీ, చీపు తమ్ముళ్లనీ బిరుదులిచ్చి మనం సంతోష పడటమే గాని - వాళ్లు తెచ్చేధరకి మనమెందుకు తేలేమో ఆలోచించరు!

రామ: నో! నాకంత అవసరం లేదు. బేరాలు సారాలూ అయ్‌డోంట్‌లైక్! అమ్మేవాళ్లు రేటెంత అని చెబ్తారు! మనం ఓ.కె. ఇచ్చేయమంటాం! అది మగాడి నేచర్!

మీనా: అంటే? చవగ్గా కొనేవాళ్లంతా ఆడంగులనా మీ ఉద్దేశం?

రామ: వద్దు! ఆర్య్గుమెంట్లు వద్దు! అర్థతాత్పర్యాలడక్కు!

మీనా: ఏం? ఎందుకు అడక్కూడదు? ఆ మగాళ్లందరికీ ఎంచక్కా అంతంత చవక ధరలలో అమ్ముతుంటే - మీ ఒక్కరికి మాత్రమే రెచ్చిపోయే రేట్లు చెప్పాలా? బేరమాడటానికి ఎవరికీ లేని నామోషీ తనం మీ ఒక్కరికే వుండాలా?

రామ: (ఆమెను శాంతింప చేయాలనే ఉద్దేశంతో) మీనాక్షి! నన్ను చెప్పనిస్తావా?

మీనా: ఊ! చెప్పండి! వింటాను! వినక ఛస్తానా?

రామ: మరేం లేదు మీనాక్షి! మగాళ్ల మొహాల్లో రెండు రకాలుంటాయి! నెంబర్ వన్ - ఖరీదైన మొహం! గొప్ప దర్జాగా వుంటుందన్న మాట - నా మొహంలాగా!

మీనా: అల్లాగా (వ్యంగ్యంగా)

రామ: చెప్పనివ్వు! అంచేత ఏమిటంటే - మాలాటి గొప్ప మొహాన్ని చూచినప్పుడు అమ్మే మనిషి ఆటోమేటిక్‌గా రెచ్చిపోతాడు. ఆర్రూపాయలకిచ్చే వస్తువుని అరవైకి అమ్ముతానంటాడు. అది పాపం అతని వీక్నెస్సు! మావి దర్జామొహాలు గదా - అంచేత అతనెంతకి చెబితే అంతక్కొనేస్తాం! ఇది మా వీక్నెస్సు!

మీనా: మరీ-

రామ: మాటాడకు! నన్ను చెప్పనివ్వు! ఇక రెండో రకం మొహముంది చూసేవు - ఆ మొహాన్ని చీప్ మొహమంటారు! చవక మొహమన్న మాట! ఆ జాతి మొహాల్ని చూడగానే అమ్మేవాడు అరవై రూపాయల వస్తువుని ఆర్రూపాయలు చాల్లెండి తీసుకెళ్లండని ప్రాధేయ పడతాడు. ఇప్పుడు చెప్పు మీనాక్షి- నా మొహం ఎట్లా వుంటే బావుంటుంది? అహ నీ ఉద్దేశం అడిగేనంతే?

మీనా: చెప్పమంటారా?

రామ: చెప్పమనేగా అడిగింది?

మీనా: మీ మొహం చీప్‌గా వుంటేనే బావుంటుందండీ?

రామ: (వెర్రెక్కి పోయి అరిచేడు) మీనాక్షీ!

మీనా: అరుస్తారెందుకూ మీ మొహం చీప్‌గా వుంటే - ఎంచక్కా అరవై రూపాయలు వస్తువు ఆర్రూపాయలకే దొరుకుతుంది. బోలెడు ఆదా!

రామ: అంతేనా?

మీనా: చవగ్గా సరుకులు దొరుకుతున్నప్పుడు మీ మొహం ఎట్లా అఘోరిస్తే మనకెందుకు చెప్పండి?

---

రచన: ఎం.వి.యస్.హరనాథరావు

## సినేమా హంగులు

బొమ్మలు: ఎమ్.ఎస్.రామకృష్ణ

తోటమాలి బాధలకు కేరాఫ్ అడ్రస్.
ఎండలో నేడి టీ తాగుతూ, తండ్రులు పైపులు కాల్చడానికి, హీరోయిన్స్ కుక్కపిల్లలతో ఆడుకోడానికి - తల్లుల కార్డ్‌లెస్‌లో నవ్వుకోడానికి వాడుకునే పిచ్చెక్కిన రిచ్‌నెస్.

భవనం ముందు గార్డెన్



రామ: అదికాదు మీనాక్షి! ఇప్పుడూ!

మీనా: (వంటగదిలోకి నడుస్తూ) వంట పని వదిలేసి వచ్చేను! ఏం తగలడిందో ఏమిటో?

(మీనాక్షి వంట గదిలోకి వెళ్లిపోయింది. రామకృష్ణ కూడా విసురుగా ఆమెను అనుసరించబోయేడు. అంతలో బాబాయి గారు లోపలికి అడుగు పెట్టేసి - చూడు నాయనా అగ్గిరావుడూ కదా అని పిలిచేరు. రామకృష్ణ ఆగిపోయి బాబాయిగార్ని చూసి - ఆయన వేపు నడుస్తూ)

రామ: ఎవర్నో పిలిచినట్టున్నారు?

బాబా: వచ్చింది నీ యింటికి? నిన్ను పిలవక యింకెవర్నో ఎందుకు పిలుస్తాన్నాయనా? ఒక ఉదాహరణ వదుల్తాను. గుండెల్లో దాచుకో! హోటల్లో కూచుని బంటుమిల్లికి రెండు బస్సుటిక్కెట్లివ్వమని అడగలేం కదా!

రామ: అడిగితే కొడతారు గదా!

బాబా: అవునుగదా! అంచేత హోటల్లో కూచున్నప్పుడు కాఫీ టిఫిన్లే ఆర్డరిస్తాం! ఆ విధంగానే -

రామ: నా పేరు రామకృష్ణండి! కానీ తమరెవరో కొత్త పేరుతో పిలుస్తేనూ-

బాబా: అగ్గిరావుడూ అన్నాను! అంతేగదా! మీ పెద్దలు పెట్టిన పేరు రామకృష్ణ కావచ్చు. నా కంటికి నువ్వు అగ్గిరాముడివే! ఇప్పుడు - దేవుడనే వాడు ఒక్కడే వుంటాడు. నువ్వు రాముడంటావ్! నేను వెంకన్న అంటాను! మరో మనిషి అల్లా అనో, క్రీస్తు అనో పిలుస్తారు! ఎవరు ఏ పేరుతో పిలిచినా కొలిచినా - పలికేది ఒక్కడే! వాడే దేవుడు! అదే విధంగా-

రామ: దేవుడొద్దులెండి! మీ సంగతి చెప్పండి! తవర్ని ఏవని పిలవాలీ? సుత్తి రాముడూ అని పిలవచ్చా!

బాబా: తప్పు రామకృష్ణా! అందుకు రూలు వప్పుకోదు!

రామ: ఏం? ఎందుకు వప్పుకోరూ? నన్ను అగ్గిరాముడు అని పిలుస్తే తప్పులేదు గానీ మిమ్మల్ని సుత్తిరాముడూ అంటే నేరమైపోయిందా? ఎందుకొచ్చేరో చెప్పండి?

బాబా: అట్లా అడిగేముందు - కూచోండి బాబాయిగారూ అని నువ్వొక డైలాగంటే బావుంటుందేమో!

రామ: (అదిరిపోయేడు ఆ పేరు వినగానే) అమ్మో! బాబాయిగారంటే తమరేనా? నాలుగు సంచులు ప్లస్ మీరూ! నాలుగు రూపాయలే రిక్షా ఛార్జి! అర్థమైంది బాబాయి గారూ కూచోండి!

బాబా: (కూచుంటూ థేంక్సు! కూచోమన్నావు బావుంది! సంచుల గొడవేమిటి?

రామ: మరేం లేదండీ! మార్కెట్లో మీరెప్పుడు సంచుల్తో రిక్షా ఎక్కినా - ఇంటిదగ్గర దిగి - మిమ్మల్ని మినహాయించుకుని సంచికో రూపాయి మాత్రమే రిక్షా వాడికిస్తారని యింతకు ముందే తమ యొక్క కేరెక్టరు గురించి విన్నానండి!

బాబా: సంచుల్లెక్కలొద్దు రామకృష్ణా! సంచిలోపల ఇంకో సంచి వుంటుంది! దానికేమంటావ్! అచ్చెప్పు నాకూ!

రామ: ఆ రహస్యం మా ఆవిడ నాకు చెప్పలేదండి!

బాబా: మీ ఆవిడ అంటావేమిటి రామకృష్ణా! నా గురించి మీ ఆవిడ కేం తెలుసు! ఎట్లా తెలుసు!

రామ: మీ ఆవిడ! అంటే - పిన్నిగారు మా ఆవిడకి చెప్పేరండి!

బాబా: పిన్నిగారు! ఆ పిన్నిగారికి మాత్రం నా గురించేం తెలుసు?

రామ: అదేమ్మాటండీ! సాక్షాత్తు ఆవిడ మీ అర్ధాంగి కదా! ఆ మాత్రం తెలీదూ!

బాబా: పిచ్చివాడా? అర్ధాంగి అంటే అర్థమేమిటో తెలుసా?

రామ: వైఫండి! భార్య!

బాబా: తీసెయ్! తప్పుడర్థాలు నువ్వును! అర్ధాంగీ అంటే అర్థాలు తెలీని మనిషి అని అర్థం! మనమేదో చెబ్తాం. వాళ్లేదో అర్థం చేసుకుంటారు!

రామ: అంటే - నాలుగు సంచుల్తో రిక్షా మీద యింటికొచ్చి నాలుగు రూపాయలు మాత్రమే ఛార్జీ -

బాబా: నాలుగే యిస్తే నడ్డి విరగ్గొడతాడు రిక్షావాడు! రిక్షా కిచ్చే ఛార్జీ ఆరు! ఇంట్లో చెప్పేరేటు నాలుగు! అర్ధాంగి కదా- నా టెక్నిక్కేమిటో అర్థం గాక అద్భుతమైన మొగుడని వాడకట్టంతా చెబ్తుంది.

(రామకృష్ణ బాబాయి ఉపన్యాసానికి ముగ్ధుడై పోయాడు. అంచేత చేతులు రెండూ జోడించేడు)

బాబా: ఈ ముద్రకి అర్థమేమిటి రామకృష్ణా!

రామ: అయ్యా! తమరు నాకు జ్ఞానోదయం కలిగించేరు. ఆనందాన్ని తట్టుకోలేక చేతులు జోడించేను. (మామూలుగా నిలబడి) అసలూ కూరలవీ కొనడానికి మగాళ్లు మాత్రమే మార్కెట్లోకి అడుగు పెట్టాలనే రూలు ఎవరండీ పెట్టేరు?

బాబా: ఈ ఊరి వ్యాపారస్థులు!

రామ: ఎందుకు పెట్టేరు?

బాబా: ఆడవాళ్లు చేసే బేరం తట్టుకోలేక! ఏభై చెబితే ఇరవైకిస్తావా అని అడగడం వాళ్ల ప్రత్యేకత నాయనా! ఆడవాళ్ల నైజమది!

రామ: అఫ్‌కోర్స్! అది సబబే అనుకోండి! బట్ - మగాళ్లకయినా చీపుగా అమ్ముతారనే గ్యారంటీ ఏవైనా వుందా బాబాయిగారూ?

బాబా: రామకృష్ణా! చేపల బజారుకెళ్లి సెంటు సీసాలు దొరుకుతాయా అని అడిగినట్టు - గొప్ప పిచ్చిప్రశ్న అడిగేవు నాయనా! అంతో ఇంతో లాభం లేకుండా వాళ్లు ఏ వస్తువూ చచ్చినా అమ్మరు! వాళ్లు ఎంతకు అమ్మినా మనం మాత్రం చవగ్గా కొన్నామని ఇంట్లో చచ్చినట్టు

రచన:ఎం.వి.యస్.హరనాథరావు

## సినేమా హంగులు

బొమ్మలు: ఎమ్.ఎస్.రామకృష్ణ

బరువైన డైలాగులు చెప్తూ తనమీద విసిరేసిన నోట్ల కట్టలను ఏనాడు పట్టించుకోని రిజర్వు బ్యాంకు బీరువా.

ఎవరు కాళ్ళు పెట్టినా ఫీలుకాని గవర్నమెంటు ఫైలు

టీపాయ్



చెప్పాలి! ఆ మాట వినిపించకపోతే ఆడవాళ్ళు తృప్తిపడరు సరిగదా అన్నం కూడా పెట్టరు!

రామ: అంటే - సుబ్బలక్ష్మి గారి మొగుడూ, తాయారమ్మా తమ్ముడూ, సుభద్రమ్మ గారి భర్త - అంతా, వీళ్లంతా ఇదే గేమ్ ఆడుతున్నారా బాబాయి గారూ?

బాబా: మగపుట్టుక పుట్టినందుకు భూలోకంలో ఏ మొగుడికైనా ఏ తమ్ముడికైనా ఈ ఫీట్లు తప్పనిసరి నాయనా!

రామ: ఏమైనా - ఆర్రూపాయలక్కొని నాలుగున్నరకే తెచ్చేమంటే లాసుగదండీ?

బాబా: అంతా విని కూడా లాసంటావేమిటయ్యా రామకృష్ణా! మార్కెట్లో మాయదారి రేటు ఎంతవుంటే అంతకే కొనాలి గదా! కొంటాం! కొన్నది మనమే వాడుకుంటాం గానీ దానధర్మాలు చేయం గదా! ఇంక లాసేమిటని నా పిండాకూడు?

రామ: (ఉత్సాహంగా) అర్థమైంది బాబాయిగారూ! ఇక అట్నుంచి నరుక్కొస్తా చూడండి - మా ఆవిడ డంగై పోవాలి!

బాబా: ఆశయం మంచిదేగాని ఆవేశం కూడదు! బార్బరు షాపుకెళ్లి బందరు లడ్డూలు తెచ్చేనని తప్పుడు స్టేట్మెంట్లివ్వకుండా జాగ్రత్తపడు!

రామ: అయ్యా! (చేతులు జోడించేడు) తమరింకేమి చెప్పక్కర్లేదు. వెళ్లి రండి!

బాబా: దేవుడూ! ఈ అమాయకుడ్ని ఆదుకో తండ్రీ!

లైట్స్ ఆఫ్ అండ్ ఆన్

(అదే ఇల్లు. ఇప్పుడు కూడా రామకృష్ణ, అప్పల్సామిలిద్దరూ చెరో రెండు సంచుల్తో ఇంట్లోకి అడుగు పెట్టేరు)

రామ: అప్పల్సామీ!

అప్ప: ఆయ!

రామ: నీ సంచులు అక్కడ పెట్టు!

అప్ప: చిత్తం! ఇంతకుముందు ఇక్కడ పెట్టేనండి! స్థలం మారిస్తే సెంటిమెంటు దెబ్బతింటుందేమోనండి!

రామ: అవునా! అలాగే కానీ! (పెట్టేడు) ఇంద! నీ ఒరిజనల్ రేటు - టెన్ రూపీస్!

అప్ప: (తీసుకొంటూ) చిత్తం! నా బేరం నాకు గిట్టిందండి!

రామ: ఇప్పుడు మనం అసలు డ్రామా ప్రారంభించాలన్న మాట!

అప్ప: కొంచెమాగండి బాబో!

(అని చొరవగా రామకృష్ణ చేతిని లాక్కున్నాడు. ఆ చేతికున్న వాచీలో టైం చూసి అన్నాడు)

అప్ప: టైం బావుందండీ! ఇక రెచ్చిపోండి బాబూ!

రామ: (అప్పల్సామి బుగ్గ చిదిమి) అబ్బ! అందుకే నువ్వంటే నా కిష్టమోయ్ అప్పల్సామీ! (భార్యని పిలిచేడు) మీనాక్షీ! ఏమోయ్ మీనాక్షీ! (ఆమె వచ్చింది.) చూసుకో నువ్వు చెప్పిన వెచ్చాలన్నీ తీసుకొచ్చేసేను!

అప్ప: అయ్యా! నా డబ్బులు నాకిప్పిస్తే ఎల్లిపోతానండి!

రామ: సారీ వోయ్! నీ సంగతే మరిచి పోయేను. (భార్యతో) రిక్షా అబ్బి! (అప్పల్సామితో) ఊ... ఎంతివ్వమంటావ్?

అప్ప: తమకి తెలీందేముందండయా! తమకి తోచిందివ్వండి!

రామ: ఊరికే మొహమాటం పడకు! ఎంతకావాలో అడుగు!

అప్ప: తమ మొహం చూస్తావుంటే ఎక్కువడగాలనిపించడం లేదండి!

రామ: అల్లాంటివేమీ పెట్టుకోకు! పేదవాడివి గదా - పదో ఇరవయ్యో అడుగు!

మీనా: (ఆ రేటు వినగానే ఉలికిపడి కలగ చేసుకుంది) తొందర పడతా రెందుకూ? మీ మొహం గురించి ఏదో అంటున్నాడు. అతన్ని అడగనివ్వండి!

అప్ప: అమ్మా! అయ్యగార్ని చూస్తావుంటే ఆ ఏడు కొండల ఎంకటసామిని చూసినట్టుందమ్మా!

మీనా: నిజమేనయ్యా! అపుడప్పుడు నాక్కూడా విష్ణుమూర్తిలాగా కనిపిస్తారు!

అప్ప: అంచేత ఒక రూపాయి యిప్పించండి బాబూ! దణ్ణం పెట్టుకు ఎల్లిపోతాను.

రామ: పిచ్చివాడా! నాలుగు సంచుల్నీ నన్నూ అంతదూరాన్నుంచి మోసు కొచ్చినందుకు ఆఫ్టరాల్ రూపాయా?

మీనా: అబ్బ! మీరు ఆవేశపడకండీ! అతనడిగిందిచ్చి పంపించండి!

రామ: అది అన్యాయం మీనాక్షీ! చూస్తుంటే అమాయకుడిలా వున్నాడు పాపం! రూపాయి చాలంటాడేమిటి బొత్తిగా! పదో - పదిహేనో-

అప్ప: అమ్మో! అంతొద్దండి బాబో! అన్యాయమైపోతాను! తమరే నాకు ఎంకటసామండి! తమర్ని ఏవడిగినా పెసాదం లాగా అడగాలేగాని పెళ్లి భోజనం లాగా లాగించేయకూడదండి!

రామ: అదికాదు తమ్ముడూ!

మీనా: అబ్బ! మీరు మరీను! అతను రూపాయి చాలంటే వినరే! ఇచ్చింది ప్రసాదంగా కళ్లకద్దుకుంటాట్ట!

అప్ప: చిత్తం!

(భర్త చేతిలోంచి రూపాయి మాత్రమే లాక్కుని అప్పల్సామి కిచ్చింది. అతను ఆ నోటుని కళ్లకద్దుకుని కదిలేడు)

మీనా: ఇదుగో బాబూ! (ఆగేరు) అయ్యగార్ని బాగా గుర్తు పెట్టుకో నాయనా!

అప్ప: చిత్తం!

మీనా: ఈ ఊళ్లో మగాళ్లే వెచ్చాలవీ తీసుకురావాలి గదా! అంచేత

---

రచన: ఎం.వి.యస్.హరనాథరావు

## సినిమా హంగులు

బొమ్మలు: ఎమ్.ఎస్.రామకృష్ణ

కనబడకుండా అడ్డం

లాక్కుని ఏడవడానికి

ఉపయోగించే

ముసుగులు

తలుపులు



ఈయన్ని కొంచెం కనిపెట్టుకునిఉండు!

అప్పు: ఆ మాట తమరు నాకు ప్రత్యేకంగా చెప్పాలా అమ్మా! అ తండ్రి - ఆ ఎంకన్న తండ్రికి సేవ చేస్తున్నాననుకుంటాను. ఆరిచ్చే పెసాదం సంతోషంగా పుచ్చుకుంటాను. ఎల్లిపోతాను. దీవించండి బాబో!

(అని నమస్కరించి వెళ్లి పోయాడు. మీనాక్షి వెచ్చాలవీ తనిఖీ చేస్తుంటే రామకృష్ణ గుమ్మం వరకు వెళ్లి వచ్చి అన్నాడు)

రామ: వెంకన్నేమిటో - ఆయొక్క ప్రసాదమేమిటో నాకేం బోధ పడటం లేదు మీనాక్షీ! అదే - రూపాయి చాలంటాడేమిటీ పిచ్చివాడు?



మీనా: ఏమో? మీ మొహంలో నామాలవీ కనిపించేయేమో! సాక్షాత్తు వెంకన్నే అనుకుంటున్నాడు. ఎందుకైనా మంచిది రేపట్నుంచి నామాలు కూడా పెట్టుకోండి!

రామా: మీనాక్షీ!

మీనా: తప్పేముందండీ? ఇతనంటే భక్తుడు గనక - మీ మొహమ్మీద నామాలు కూడా లేకపోయినా వున్నట్టు కనిపించేయి. రూపాయితో సరి పెట్టుకున్నాడు. అందరూ ఇల్లాంటి భక్తులేవుంటారా ఏమిటి?

(అంటూనే ఆమె టేబిల్ దగ్గరకెళ్లి లిస్టు వెతికి తీసుకుంది. దాన్ని చూసి అడిగింది)

మీనా: అవునూ! కంది పప్పు ఎంతకిచ్చేరు?

రామ: కిలో ఎనిమిది రూపాయిలు!

మీనా: (ఆశ్చర్యంగా) ఏమిటేమిటీ? ఎనిమిదా?

రామ: క్షమించు మీనాక్షి! కొంచెం ఎక్కువ ధరకొన్నానేమో!

మీనా: ఈ లిస్టులో పద్దెనిమిది వుందండీ! తాయారమ్మ తమ్ముడు పద్దెనిమిదికే కొన్నాట్ట! మీకు ఎనిమిది రూపాయలకే ఎల్లా యిచ్చారండీ!

రామ: ఏమో మీనాక్షీ! ఆషాపతనిక్కూడా నా మొహమ్మీద నామాలు కనిపించేయేమో?

మీనా: (లిస్టు చూచి) ఇది చెప్పండి! మినప్పప్పు ఎంతక్కొన్నారు?

రామ: (బాధ నటిస్తూ) అది మాత్రం అడక్కు మీనాక్షి! తలుచుకుంటే గుండె తరుక్కుపోతోంది!

మీనా: (ఆత్రంగా) అవన్నీ నేను చూసుకుంటాన్లెండి! ఎంతక్కొన్నారో చెప్పండి!

రామ: హూ! కిలో ఆర్రూపాయలు! (బరువుగా)

మీనా: అమ్మో! ఆర్రూపాయలా?

రామ: అక్కడికీ నా తప్పులేకుండా బేరమాడేను మీనాక్షీ! ఊహూ... ఎంత బేరమాడినా ఆర్రూపాయలకంటే నయాపైసా తగ్గించనన్నారు.

మీనా: (ఆనందంగా) అబ్బా! అది కాదండీ! ఇందులో కిలో పదమూడు రూపాయిలుంది! నిన్నగాక మొన్న సుబ్బలక్ష్మి వాళ్లాయన ఆ ధరకే పట్టుకొచ్చేట్ట! ఎక్కడ పదమూడు రూపాయలూ - ఎక్కడ ఆర్రూపాయలు! ఆ రిక్షా అబ్బి చెప్పినట్టు మీ మొహంలో నామాలు మినప్పప్పు భక్తుడికి కూడా కనిపించే వుంటాయండీ!

రామ: వద్దు మీనాక్షీ! వద్దు! ఆ వెంకన్నతో నన్ను పోల్చకు! పెసరపప్పు ధర కూడా అడుగు! కనీసం ఇందులోనైనా ఖచ్చితంగా దెబ్బతిని వుంటాను!

మీనా: పెసరపప్పు కదూ? వుండండి? (లిస్టులోచూస్తు) ఆ ఇక్కడుంది... ఇప్పుడు చెప్పండి! ఎంతక్కొన్నారు?

రామ: ఆ లిస్టులో ఎంత రాసివుందీ?

మీనా: ఎంతరాసివుంటే మీకెందుకు? ఎంతక్కొన్నారో చెప్పండి ముందూ

రామ: పెసరపప్పు మనిషి పెడసరంగా మాటాడేడు మీనాక్షి! కిలో ఏడుంపావలా అని గట్టిగా అరిచేడు!

మీనా: (ఆశ్చర్యంగా) ఏమిటేమిటి? కిలో ఏడుం పావలానా? ఈ లిస్టులో పదహార్రూపాయలు అండీ!

రామ: ఎందుకైనా మంచిది! ఆ లిస్టు జాగ్రత్తగా దాచుకో మీనాక్షి! ముందు ముందు ఏ ధరల్లో ఏమి తెస్తానో ఏవిటో?

మీనా: (ఆ లిస్టుని చించేస్తూ) దిక్కుమాలిన లిస్టు! ఇంకా ఎందుకిదీ? ఇరుగమ్మకీ పొరుగమ్మకీ ఇక నుంచి నేనే యిస్తాను లిస్టు! వుండండి! (అని వీధి వేపు కదిలింది)

రామ: అటెక్కడికీ మీనాక్షీ?

మీనా: (ఆగి) ఈ చిత్రమేమిటో ఎదురింటి పార్వతమ్మగారికి చెప్పి ఇప్పుడే వస్తా! (అని వెళ్లిపోయింది).

రామ: (క్షణం ఆగి) సంసారం సుఖంగా హాయిగా గడవాలంటే - తమరు కూడా ఈ చిట్కాలు వాడి చూడండి. మహత్తరంగా, అద్భుతంగా పని చేస్తాయి! సాక్ష్యం కావాలంటే కొంచెం ఓపిక పట్టండి! మీరే చూస్తారు!

-(మిగతా... వచ్చే సంచికలో)

# ఆంగ్ల హాస్యరచనలో అగ్రగణ్యుడు - పి.జి.ఉడ్‌హౌస్

## ఫిబ్రవరి 14 ఉడ్‌హౌస్ వర్ధంతి సందర్భంగా

**ఆంగ్ల సాహిత్యంతో పరిచయం ఉన్నవారిలో ఉడ్‌హౌస్ రచన కనీసం ఒక్కటైనా చదవని వారుండరనే చెప్పవచ్చు. చదివి చప్పరించేసేవారూ ఉండవచ్చు. కానీ ఓ పుస్తకం చదివినా అభిమానిగా మారేవారే ఎక్కువ. అతనిది ఓ తరహా హాస్యం. అతను సృష్టించిన ప్రపంచమే ఒక తమాషా ప్రపంచం. పాత్రలన్నీ ఒక వింతతర్కంతో ప్రవర్తిస్తాయి. నేచురాలిటీ గురించి వెతికి 'అబ్బే' అని పెదవి విరిస్తే ఏం చేయలేం. ఆ ప్రపంచంలోకి వెళ్లడానికి ఇష్టపడ్డవాళ్లకి మాత్రం బోల్డంత రిలీఫ్ దక్కుతుంది.**

ఎందుకంటే ఇంగ్లండులోని జమీందారీ వ్యవస్థలో పోతుటీగల్లా బతికే జనాల్ని ఆటపట్టించడమే తప్ప ద్వేషం కనబరచడతను. కథల్లో విలన్లు ఉండరు. దొంగలు, మోసగాళ్లు కూడా చాలా లవబుల్‌గా ఉంటారు. ప్రేమికులు ప్రేమించేసుకుంటూంటారు. అతి స్పీడ్‌గా ఎంగేజ్‌మెంట్ ఇలా చేసుకుంటారు, అలా బ్రేక్ చేసేస్తుంటారు! అంతేకాని భగ్నహృదయంతో ఆత్మహత్యలు చేసేసుకోరు. మారువేషాలు, మారుపేర్లు పెట్టుకుని ఇళ్లల్లో చొరబడిపోతూ వుంటారు. ఏదీ సీరియస్ కాదు. హీరోలు కూడా హీరోయిజం చూపరు. పోలీసుల హెల్మెట్‌లు కొట్టేసి జైలు పాలవుతూంటారు, చిన్న చిన్న విషయాల మీద పందాలు కట్టి ఓడిపోతూ వుంటారు. ప్రేమకోసం దొంగతనం చేయడానికి కూడా వెనుకాడరు.

కథాగమనం చాలా కాంప్లికేటెడ్‌గా, కథ ఎన్నో మలుపులు తిరుగుతూ నడుస్తుంది. ఒక్కోచోట ఆగిపోయి, అతి వివరంగా సన్నివేశం వర్ణించడం జరుగుతుంది. అంతలో సడన్‌గా పరిగెడుతుంది. భాష కాస్త జటిలంగానే ఉంటుందని చెప్పాలి. ఇంగ్లీషు భాషపై పట్టువుంటేనే, ఆనాటి చారిత్రక, సామాజిక, సాహిత్య విషయాలపై అవగాహన ఉంటేనే అర్థం అయ్యేలా ఉంటుంది. అయినా అతని కథలు, నవలలు నిత్యనూతనంగా ఉన్నాయంటే కారణం - ఉడ్‌హౌస్ ఎంచుకున్న థీమ్సే! ప్రేమ అతని ఫేవరేట్ సబ్జక్ట్. మనుష్యుల అవకరాలపై కాకుండా మనోవికారాలపై హాస్యం పండించాడు. బ్లాండింగ్స్ కాజిల్ కథల్లో లార్డ్ ఎమ్స్‌వర్త్ అనే కారక్టర్ ఒకటి. మహా మతిమరుపు మనిషి. ఈయనకి పందులు పెంచడమంటే భలే ఇష్టం. ఓ పందిని పెంచి "ఎంప్రెస్" (చక్రవర్తిని) అని పేరు పెడతాడు. దాన్ని ఎవరైనా పంది అన్నారంటే వాళ్ల పని అయిపోయినట్టే! స్మిత్ అనే అతనికి చేప అంటే పడదు. ఏ పని చేయడానికైనా రెడీ. (చేపతో సంబంధం లేకుండా ఉంటే) అని ప్రకటించుకుంటాడు. అసలు స్మిత్ పేరులోనే తమాషా ఉంది. స్మిత్ అనేది ఇంగ్లండులో చాలా కామన్‌నేమ్. తన పేరు ప్రత్యేకంగా ఉండాలని చెప్పి పేరు ముందు 'పి' చేర్చుకుంటాడు అతను. "పిస్మిత్‌యా?" అంటే కాదు. "పి సైలెంట్. సూడో, సైకాలజీ .... లాటి పదాల్లో సైలెంటుగా



వుండదూ, అలాగే" అంటాడు. ఈ విధంగా భాషలో కూడా ఉడ్‌హౌస్ ఎన్నో ప్రయోగాలు చేశాడు. గంభీరమైన పదాలను సాధారణమైన విషయానికి అన్వయించి హాస్యం పుట్టించాడు. ఉదాహరణకి ఎసాసినేట్ అనే పదం పెద్ద పెదవులలో ఉన్నవారి హత్య గురించి చెప్పినప్పుడే ఉపయోగిస్తారని ఇంగ్లీషు చదివిన వారందరికి తెలుసు. కానీ దాన్ని అత్తను చంపడానికి ఉపయోగించి నవ్వు తెప్పిస్తాడు ఉడ్‌హౌస్. "డూ యూ వాంట్ టు ఎసాసినేట్ యువర్ ఆంట్?" అని హీరో ప్రకటన ఇచ్చేడని రాస్తే నవ్వు వస్తుంది.

సాహితీలోకానికి ఎన్నో పాత్రలను సృష్టించి బహూకరించాడు ఉడ్‌హౌస్. ఎప్పుడూ ఎవర్నో ఒకర్ని ప్రేమించి ఫైనల్‌గా పెళ్లి చెడగొట్టుకునే ఫ్రెడ్డీ (అడుగు దూరం నడిస్తే ఏదో ఒకదాన్ని తన్నేయకుండా నడవలేడు), బార్‌లో కథలు చెప్పే మ్యులినర్, హుషారైనా మధ్యవయస్కుడు గేలహెడ్, సమర్థుడైన సెక్రటరీ బాక్‌స్టర్ - ఇలా ఎందరో చిరంజీవులు! అందరికంటె ఎక్కువగా నిలిచినది జీవ్స్ పాత్ర. జీవ్స్ మొట్టమొదటిసారిగా దర్శనమిచ్చింది - 1917లో వెలువడిన "ది మాన్ విత్ టూ లెఫ్ట్ ఫీట్" అనే కథా సంకలనంలో. 1919లో "మై మాన్ జీవ్స్" అనే జీవ్స్ సంకలనం తర్వాత ఎన్నో సంకలనాలు, నవలలు వెలువడ్డాయి.

జీవ్స్ బెర్టీ వూస్టర్ అనే పిల్ల జమీందారుకి వాలే (Valet)గా పని చేస్తూంటాడు. వాలే అంటే బట్లర్‌కి కంటె ఎక్కువ. సెక్రటరీకి తక్కువ. యజమాని పనులు అన్నీ చూసిపెడుతూంటాడు. ఊస్టర్ తెలివితక్కువవాడు. అనేక గడ్డు పరిస్థితుల్లో అనవసరంగా ఇరుక్కుంటూంటాడు. జీవ్స్ చమత్కారంగా, అతని అహం దెబ్బతినకుండా బయటపడేస్తూంటాడు. ప్రపంచంలో జీవ్స్‌కి తెలియని విషయం అంటూ ఏదీ లేదన్నట్టు ఆ పాత్రను మలిచాడు ఉడ్‌హౌస్. **ఇంటర్‌నెట్‌లో ఒక ప్రముఖ సెర్చ్ ఇంజన్ (అడిగిన సమాచారాన్ని సెకండ్లలో అందించేది) పేరేమిటో తెలుసా? ఆస్క్‌జీవ్స్‌డాట్‌కామ్.**

ఈ జీవ్స్ పాత్రను తెలుగు పాఠకులకు పరిచయం చేయాలని నేను అభిలషించాను. మన తెలుగు రచయితలెందరో ఉడ్‌హౌస్ అభిమానులే! డి.వి.నరసరాజు గారికి ఎంతో పేరు తెచ్చిన "నాటకం"కి ప్రేరణ ఉడ్‌హౌస్ రచనే! పాలగుమ్మి పద్మరాజుగారి "బ్రతికిన కాలేజీ" ఉడ్‌హౌస్ స్టయిల్ నవలే! "పెళ్లిసందడి" (1959) వంటి తెలుగు సినిమాలలో, విజయావారి చిత్రాలలో ఉడ్‌హౌసియన్ కారెక్టర్లు ఎన్నో కనబడతాయి. అయితే ఊస్టర్-జీవ్స్ పాత్రలను తెలుగైజ్ చేసి (ఊస్టర్‌కు అనంతశయనం అని, జీవ్స్‌కి అచలపతి అని నామకరణం చేసాను) ఈనాటి పరిస్థితులకు వాళ్లు ఎలా స్పందిస్తారో చూపాలనే కోరికతో నేను రాసిన "అచలపతి కథలు" అనే దాదాపు 20 కథలు "రచన" పత్రికలో వరుసగా ప్రచురించ బడ్డాయి. వాటికి లోగో వేయమని బాపుగారిని (మరో ఉడ్‌హౌస్ వీరాభిమాని) కోరగా చక్కటి తెలుగు వాతావరణం బొమ్మ వేసి పెట్టారాయన. ప్రస్తుతం "హాసం"లో నేను చేస్తున్న ఉడ్‌హౌస్ రచనలు చదివి బాపుగారు "మీ ఉడ్‌హౌస్ అనువాదం అద్భుతంగా వుంది. రమణ గారిది తర్వాత అంత

చక్కటి అనువాదం నేను చదవలేదు'' అని ఆశీర్వదించడం నా అదృష్టంగా భావిస్తాను.

తన హాస్య రచనలతో పాఠకుల హృదయాలలో సుస్థిరస్థానం ఏర్పరచుకున్న ఉడ్‌హవుస్ ఖ్యాతి ఇంగ్లండుకే పరిమితం కాలేదు. అతని రచనలు అనేక భాషల్లోకి అనువదించబడ్డాయి. కథావాతావరణం ఇంగ్లండుకీ, అందునా ఒక పీరియడ్‌కి సంబంధించినదైనా, అవి రాసి 7, 8 దశాబ్దాలు గడిచినా వాటిని ఇంకా విరివిగా చదువుతూనే ఉన్నారు. అతని పుస్తకాలు పదేపదే పునర్ముద్రింప బడుతున్నాయి. ఉడ్‌హస్ ప్రతిభ నవలలు, కథల్లోనే కాక మ్యూజికల్స్‌లో కూడా చూడవచ్చు. కోల్ పోర్టర్, ఇర్వింగ్ బెర్లిన్, జార్జ్ గెర్ష్విన్ వంటి వారితో కలిసి అనేక మ్యూజికల్ కామెడీస్‌కు రచన చేసాడు. తన నవలలను గైబోల్టన్, అయాన్ హేలతో కలిసి నాటకాలుగా మలిచాడు.


భార్య ఎథెల్‌తో

పూర్తిపేరు: పెల్హామ్ గ్రీన్‌విల్ ఉడ్‌హవుస్, జననం: అక్టోబరు 15, 1881, సర్రీ (ఇంగ్లండు)లోని గిల్డ్‌ఫోర్డ్‌లో, విద్యాభ్యాసం: డల్‌విచ్ కాలేజి, హాబీలు: క్రికెట్ (స్కూలు రోజుల్నించీ,) బాక్సింగ్, వివాహం: 33వ ఏట, ఈథెల్‌తో, పిల్లలు లేరు, ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ నుండి డాక్టర్ డిగ్రీ: 1939, అమెరికా పౌరసభ్యత్వం: 1955, ఇంగ్లండు రాణి నుండి సర్ బిరుదం: 1975, మరణం: 1975 ఫిబ్రవరి 14, మొత్తం రచనలు: 293 కథలు, 71 నవలలు, ఎన్నో మ్యూజికల్స్, నాటకాలు, ఆత్మకథలు: పెర్‌ఫామింగ్ ఫ్లీ (1953), ఓవర్ సెవెంటీ (1957)

తొలిరోజుల్లో అతడు హాంగ్‌కాంగ్ షాంఘై బ్యాంక్‌లో రెండు సంవత్సరాలు ఉద్యోగం చేసి, అది మానేసాడు. జర్నలిజాన్ని చేపట్టాడు. కథలు కూడా రాసేవాడు. 1902లో "గ్లోబ్" పత్రికలో "బై ది వే" అనే కాలమ్ మొదలు పెట్టాడు. "ది కెప్టెన్" అనే పిల్లల మ్యాగజైన్‌కి స్కూలు స్టోరీస్ పంపుతూండేవాడు. (ఆ సీరిస్‌లోనే స్మిత్ మొదటిసారి దర్శనమిచ్చాడు) 1909 తర్వాత అతను ఇంగ్లండులో ఉన్నది తక్కువ. ఎక్కువగా అమెరికాలోనూ, పారిస్‌లోనూ ఉన్నాడు.

రెండవ ప్రపంచ యుద్ధం జరుగుతూండగా 1940లో అతను పారిస్‌లో చిక్కుకు పోవడం వల్ల చాలా హాని జరిగింది. జర్మనీవాళ్లు ఫ్రాన్సును ముట్టడించి ఉడ్‌హవుస్‌ను అరెస్టు చేశారు. దేశం విడిచి పోకూడదని ఆంక్షలు విధించారు. అలా నాలుగేళ్లు గడిచేక అతని అభిమానులైన జర్మనీ ఆఫీసర్ల కోరిక మేరకు తన జైలు జీవితం గురించి కొన్ని హాస్య ప్రసంగాలు చేసాడు ఉడ్‌హవుస్. కష్టకాలంలో కూడా హాస్యధోరణిని విడిచి పెట్టని గొప్ప రచయిత తాత్వికత కనబడుతుంది ఆ ప్రసంగాల్లో వాటిని బెర్లిన్ రేడియో బ్రాడ్‌కాస్ట్ చేయడంతో ముప్పు వచ్చిపడింది. ఉడ్‌హవుస్ శత్రువులకు అమ్ముడుపోయాడని, జర్మన్ ముష్కరత్వాన్ని అసలు రంగుల్లో చూపకుండా ప్రపంచ ప్రజలకు వారిపై సానుభూతి కలిగేట్లా సహాయ పడ్డాడని ఇంగ్లండులో ప్రచారం జరిగింది. 1945లో యుద్ధంలో జర్మనీ ఓడిపోయిన తర్వాతనే ఉడ్‌హవుస్ విడుదల చేయబడ్డాడు. కానీ జీవితాంతం దేశద్రోహి ముద్ర అతన్ని వెంటాడింది. యుద్ధం ముగిసిన 10 సంవత్సరాల దాకా అతనికి అమెరికా పౌరసత్వం లభించలేదు. అతని ప్రతిభకు దక్కవలసిన నైట్‌హుడ్ ('సర్' బిరుదం) ఇంకో ఇరవై సంవత్సరాల తర్వాత గానీ, అంటే చనిపోయేందుకు కొద్దివారాల ముందు దాకా లభించలేదు.

పారిస్ నుండి విడుదల అయిన తర్వాత ఉడ్‌హవుస్ అమెరికా వచ్చి అక్కడే ఉండిపోయాడు. హాలివుడ్‌కి కూడా పని చేశాడు. చనిపోయే దాకా రాస్తూనేవున్నాడు. అతను సృష్టించిన పాత్రల ద్వారా చిరంజీవిగా మిగిలిపోయాడు.

-ఎమ్బీయస్ ప్రసాద్

## ఉడ్‌హవుస్ ఇచ్చిన బెర్లిన్ ప్రసంగంలో కొన్ని భాగాలు

నాలుగేళ్లగా ఖైదీ (ఇంటర్నీ)గా ఉన్నాను. "అలా ఎలా వున్నారు సార్?'' అని కొంతమంది అడుగుతున్నారు. దానికి చాలా మార్గాలు ఉన్నాయి. నా పద్ధతి ఏమిటంటే ఫ్రాన్సులో ఓ బంగళా కొనడం, జర్మనీవాళ్లు వచ్చేదాకా వేచి వుండడం. ఇది అతి సింపుల్ మెథడ్. మీరు బంగళా కొనుక్కుంటే చాలు, జర్మనీవాళ్లు తక్కినది చేసుకుపోతారు.... మొట్టమొదటిసారి జర్మనీవాళ్లను చూసినప్పుడు గాలిలోకి పదడుగులు ఎగిరాను. అలా ఓ వారం గడిచేసరికి ఐదడుగులే ఎగిరేవాణ్ని. క్రమంగా ఎగరడం మానేసాను. అలవాటు పడతాంగా... ఓ రోజు... ఓ జర్మన్ సైనికుడు వచ్చాడు. నా కారు ఇచ్చేయమన్నాడు, రేడియో ఇచ్చేమన్నాడు. సైకిల్ కూడా ఇచ్చేయమన్నాడు. మిగతా రెండూ పోయినా ఫరవాలేదు. కానీ సైకిల్ ఇవ్వకూడదనుకున్నాను. నా కొచ్చిన ఏకైక జర్మన్ వాక్యం "Esist schones Wetter" ఉపయోగించి చూసాను. ఏ ప్రభావమూ కనబల్లేదు. వాడేమీ మాట్లాడకుండా సైకిలు కూడా పట్టుకు పోయాడు. స్కూలు రోజుల్లో గ్రీకు, లాటిన్ బదులు జర్మన్ నేర్చుకున్నా బాగుండుననిపించింది. ఆ క్షణంలో ... రోజులు ఇలా గడిచిపోయినా బాగుండుననుకుంటూ ఉండగానే ఓ రోజు పిలిచి ఖైదులో పెడతామన్నారు. ఇంటికెళ్లి కావలసిన సామాన్లు తెచ్చుకోమన్నారు. వెంట ఓ సైనికుణ్ని పంపారు. ఇంటికొచ్చి స్నానం చేసి, పైపు కాల్చుకుని కాస్సేపు జీవితం గురించి ఆలోచించుకుని బయల్దేరమనుకున్నాను నేను. కానీ నాతో వచ్చినవాడు తొందర మనిషి. ఐదు నిమిషాలంటే వాడి దృష్టిలో చాలా ఎక్కువట. కాస్సేపు వాదించుకున్నాక పది నిమిషాలకు రాజీ కుదిరింది. రేపు నా జీవిత చరిత్ర రాద్దామనుకునేవాళ్లు గమనించవలసిన అంశం ఒకటి ఉందిక్కడ. ఈ ఖైదు సమయంలో నేను షేక్స్పియర్ మొత్తం రచనలు చదివేయాలని తీర్మానించుకున్నాను. నలభై ఏళ్లగా ఆ పని చేద్దామని అనుకుంటూనే ఉన్నాను. ఏ మాక్‌బెత్‌వో కాస్త మొదలు పెట్టేటప్పటికి డిటెక్టివ్ నవలేదో కనబడేది, దాన్ని పక్కన పడేసేవాణ్ని. కానీ ఈ జైలు జీవితం పుణ్యమాని షేక్స్‌పియర్ మొత్తం చదివేటంత తీరిక కలగజేసారు ఈ జర్మన్ వాళ్లు. నేను ఆ పుస్తకాలు, ఇంకా ఇతర సామాగ్రి సూట్ కేసులో సర్దుకుంటూ ఉంటే మా ఆవిడ ఉన్నవి చాలనట్టు వెన్న పాకెట్ పెట్టుకోమని గోల చేసింది. వెచ్చని వాతావరణంలో సూట్‌కేసులో వెన్నపాకెట్ పెడితే ఏమవుతుందోనన్న ఆలోచన లేదావిడకి. నేను షేక్స్పియర్ పుస్తకాలు చదువుదామనుకున్నానంటే వెన్నపూసిన షేక్స్పియర్ పుస్తకాలు కాదని ఆవిడకి నచ్చ చెప్పవలసి వచ్చింది.



( చారిత్రక నేపథ్యం కలిగి అతి అరుదుగా లభించే విషయాలలో ఒకటైన ఈ ఉపన్యాస భాగాన్ని ఉడ్ హవుస్ అభిమానులకు అందించటాన్ని 'హాసం' ఓ అదృష్టంగా భావిస్తోంది).




1200 చిత్రాలు, 5 దశాబ్దాల కెరియర్, 5 భాషల్లో (నాలుగు దక్షిణాది భాషలు ప్లస్ హిందీ) నటనాపాటవ ప్రదర్శన, రంగస్థలం, సినిమా, టీవి - మూడు రంగాలలోనే అందెవేసిన చేయి - వెరసి మనోరమ! ఇప్పటివరకు ఏ హాస్యనటీమణికీ దక్కని పద్మశ్రీ బిరుదు మనోరమను వరించింది. గత పక్షం జనవరి 26న ప్రకటించిన పద్మశ్రీ అవార్డులలో మనోరమ పేరు చూడడం హాస్యాభిమానులను సంతోష పెట్టింది. తమిళ సినిమాలలోనే ప్రధానంగా నటించినా మనోరమ 'శుభోదయం', 'అల్లరి ప్రియుడు', 'పరదేశి' వంటి చిత్రాల ద్వారా తెలుగు ప్రేక్షకులకు కూడా పరిచితురాలే. 'కువారా బాప్' (తెలుగులో 'పెళ్లికాని తండ్రి') 'దో ఫూల్' (తెలుగులో 'అనుభవించు రాజా అనుభవించు') సినిమాలలో మెహమూద్‌కు జంటగా నటించడం ద్వారా, అనేక తమిళ డబ్బింగు సినిమాల ద్వారా ఆంధ్రప్రేక్షకులను అలరించిన మనోరమ అంటే తనకూడా ఇష్టమేనని భానుమతి అన్నారు. "బామ్మమాట - బంగారుబాట" సినిమాలో ఆమె వేసిన పాత్ర తమిళ ఒరిజినల్ వెర్షన్ "పాటీ సొల్లదు తట్టాదే"లో మనోరమ నటించినదే! నటనలో verve, gusto, డైలాగులో చెప్పడంలో ఊపు, ఉత్సాహం మనోరమకు సహజ లక్షణాలు. నిజ జీవితంలో అది సాదాగా కనబడే ఆ మహానటీమణితో ఇంటర్వ్యూలోని కొన్ని భాగాలు-



# పద్మశ్రీ అవార్డు అందుకోబోతున్న తొలి హాస్యనటీమణి మనోరమ



**సినిమారంగ ప్రవేశంపై** - సినిమాలలో చేరాలని చేరానో లేదో నాకు గుర్తులేదు. నాకు పాడడం చాలా ఇష్టం. 12, 13 సం॥ల వయస్సు వచ్చేసరికి స్టేజి మీద పాడేదాన్ని, నటించేదాన్ని. ఆ తర్వాతే సినిమాల్లో వేద్దామనుకున్నానేమో గానీ 1958 దాకా ఛాన్సు రాలేదు. మొదటి సినిమా "మాలయిట్ట మంగై". ప్రఖ్యాత కవి, గేయరచయిత కణ్ణదాసన్ నేను నటించిన డ్రామా "మణిమకుటం" చూసారు. అది రాసినది ఆయన మిత్రుడు కరుణానిధే! వెంటనే ఆయన తీస్తున్న సినిమాకు బుక్ చేశారు. ఆ సినిమాకు హీరో ఎస్.ఎస్.రాజేంద్రన్. అప్పటిదాకా నేను స్టేజి మీద హీరోయిన్ వేషాలే వేసాను. కానీ కణ్ణదాసన్ హాస్యపాత్ర ఇచ్చారు.

**హాస్యపాత్రలు లభించడంపై** - నాకు హాస్యపాత్రలు వేసే సామర్థ్యం ఉందో లేదో నాకు తెలియదు. సినిమాలలో ఛాన్సు దొరకడం కష్టం అని నాకు తెలుసు. ఈ పాత్ర నేను కష్టపడకుండా, స్టూడియోల చుట్టూ తిరగకుండా దానంతట అదే వచ్చింది. పైగా ఆఫర్ ఇచ్చింది కణ్ణదాసన్ వంటి మహావ్యక్తి. ఇక హీరోయిన్ పాత్ర ఎందుకు రాలేదు అనిగాని, దానికి నేను తగనా అని మథన పడడం కానీ జరగలేదు. ఛాన్సు వచ్చింది. అందిపుచ్చుకున్నాను.

**హాస్యనటనపై** - మనుష్యులను నవ్వించడం చాలా కష్టం. మొదట్లో ఎలా నవ్వించాలో తెలియక చాలా శ్రమపడేదాన్ని. క్రమంగా నా ప్రయత్నాలకు మంచి స్పందన రావడంతో నాకూ ధైర్యం పెరిగింది. కొత్త కొత్త ప్రయోగాలు చేసి చూసేదాన్ని. అవి విజయవంతం కావడంతో ఉత్సాహం పుట్టుకొచ్చి మరింత కష్టపడేదాన్ని. కారెక్టర్ ఆర్టిస్టులకు, కామెడీ ఆర్టిస్టులకు ఓ తేడా ఉంది. కారెక్టరు ఆర్టిస్టులు స్క్రిప్టులో ఉన్నది జాగ్రత్తగా డైలాగు డెలివరీ మీద శ్రద్ధ పెట్టి చెబితే చాలు. కానీ కామెడీ ఆర్టిస్టులు డైలాగుతో బాటు హావభావాలు కూడా ఎక్కువగా చూపాలి. ముఖ్యంగా ఇంప్రువైజేషన్ ఎక్కువగా చేయాలి. పాత్రను రూపొందించడంలో డైరెక్టరుకే ఎక్కువ క్రెడిట్ పోయినా హాస్యపాత్రధారి కూడా చాలా ఇన్‌వాల్వ్ కావలసి వుంటుంది.

**సహనటులపై** - నేను ఎంతోమంది హాస్యకళాకారులతో కలిసి నటించాను. చంద్రబాబు, చో, తంగవేలు, తేంగాయ్ శ్రీనివాసన్, ఎం.ఆర్.రాధా - ఇలా ఎందరో! కానీ హిట్ ఫెయిర్ అంటే నాగేష్ - మనోరమాయే! నాగేష్ నాకు గురువు. టైమింగ్ గురించి నాకెంతో నేర్పారు. మేమిద్దరం చాలా రిహార్సల్సు వేసేవాళ్లం. ప్రతీ రిహార్సల్‌తోనూ ఇంప్రువైజ్ చేసి మరిన్ని gags పెట్టేవాళ్లం. ఒక్కొప్పుడు రిహార్సల్ వేస్తూంటే మాకే బాగా నవ్వు వచ్చేసేది. మమ్మల్నే నవ్వించగలిగించిందంటే ఆ జోక్ ప్రేక్షకులకు తప్పకుండా నచ్చుతుందనే నమ్మకం కలిగేది. నేనూ, నాగేష్, వి.కె.రామస్వామి కలిసి నటించిన సినిమా "ముగరాశి"ని నేనిప్పటికీ మర్చిపోలేను. షూటింగు టైములో ఎంత పడిపడి నవ్వేవారమో చెప్పలేం.



సూపర్‌హిట్ హాస్యజంట మనోరమ - నాగేష్

**నలుగురు ముఖ్యమంత్రులతో కలిసి నటించడంపై -** అవును! అణ్ణాదురై, కరుణానిధి, ఎమ్‌జిఆర్, జయలలితలతో కలిసి నటించే భాగ్యం నాకు కలిగింది. సినిమాలలోనే కాక నాటక రంగంపై కూడా నటించడం వల్లనే అది సాధ్యపడింది. అణ్ణాదురై రాసి, నటించిన "నాన్‌కండ హిందూ రాజ్యమ్"లో నేను ఆయనతో బాటు నటించాను. అలాగే కరుణానిధి రాసి, నటించిన "ఉదయసూర్యన్"లో ఆయన సరసన నేను నటించాను. ఈ రోజు నా ఉచ్చారణను అందరూ మెచ్చుకుంటారు. అది ఆయన పెట్టిన భిక్షే. రిహార్సల్స్‌లో కూడా ఉచ్చారణ దోషం వస్తే సహించేవారు కారు. అందరూ తప్పుల్లేకుండా తమిళం మాట్లాడాలని తపించేవారు. ఎమ్‌జిఆర్‌తో తెరపై నటించాను. చాలా మర్యాద ఇచ్చి మాట్లాడేవారు. జయలలిత గురించి చెప్పనే అక్కర్లేదు. తనంటే నాకెంతో ఇష్టం.

**జయలలిత గురించి -** నేను ఫుల్ డ్రామా డైలాగులు రాత్రికి రాత్రి నేర్చేసుకునే దాన్ని. అంతా నా జ్ఞాపకశక్తిని చూసి ఆహో, ఓహో అనే వారు. కానీ జయలలితను చూశాక జ్ఞాపకశక్తి అంటే ఏమిటో నాకు తెలిసి వచ్చింది. అసిస్టెంటు డైరక్టరు వచ్చి ఒక్కసారి డైలాగు చదివి వినిపిస్తే చాలు, అక్షరం పొల్లుపోకుండా అప్పచెప్పేయగలిగేది. టేక్స్ మధ్య డైలాగులు బట్టీపట్టేదే కాదు. హాయిగా ఓ పుస్తకం చదువుకుంటూ కూచునేది. కానీ టేకు ఇచ్చేటప్పుడు పెర్‌ఫెక్ట్. డాన్స్ స్టెప్స్ అంతే. నాతో కబుర్లు చెబుతూ ఉండేది. డాన్స్ మాస్టర్ తక్కిన ఆడపిల్లల చేత ప్రాక్టీసు చేయిస్తుంటే అలవోకగా చూస్తూ ఉండేది. అంతే! షాట్‌కి పిలిస్తే ప్రతీ స్టెప్ కరక్టుగా వేసేసేది. నన్ను కూడా తనతో బాటు కూచుని కబుర్లు చెప్పమనేది. నేననేదాన్ని - "తల్లీ, నీకు చూస్తేనే వచ్చేస్తుంది. నాకు మాత్రం ఒకటి రెండు సార్లయినా రిహార్సిల్స్ వేసి తీరాలి. నన్ను పోనీ" అని.

**మారుతున్న రోజుల గురించి -** పాతరోజులకు, ఇప్పటి రోజులకు ముఖ్యమైన తేడా - ఎక్విప్‌మెంట్‌లో వచ్చింది. ఇదివరకు డైలాగ్స్ కంఠతా పట్టడం, షూటింగులో తడబడకుండా చెప్పడం చాలా అవసరం. ఇప్పుడు "డబ్బింగ్‌లో చూసుకోవచ్చులే" అంటున్నారు. సినిమా తొలి రోజుల్లో పాటలకే ప్రాముఖ్యం. ఆ తర్వాత, మా తరంలో డైలాగులకు ప్రాధాన్యం. ఇప్పుడు కొత్త డైరెక్టర్లు వచ్చి అలా చెబితే ఓవర్ యాక్టింగ్ అంటున్నారు. మెలోడ్రామా వద్దంటున్నారు. ఎలా చేసినా నాకు ఇష్టమే. యాక్టింగ్ అప్పుడూ ఎంజాయ్ చేసాను, ఇప్పుడూ చేస్తున్నాను. ఆర్టిస్టులలో కూడా తేడా వచ్చింది. అప్పట్లో డైరెక్టర్లన్నా, హీరోలన్నా హడలిచచ్చే వాళ్లం. ఇప్పుడంతా కాజువల్. ఇదీ ఒకందుకు మంచిదే!



'విద్యార్థిగళే ఇదిలే ఇదిలే' (1971)మలయాళ చిత్రంలో అడూర్ బాసితో

**తను వేసిన పాత్రల గురించి -** 1200 పాత్రల్లో ఏది ఇష్టమైనది అంటే చెప్పడం కష్టమే. "తిల్లానా మోహనాంబాళ్"లో జిల్ జిల్ రమామణి పాత్రను విమర్శకులు ప్రేక్షకులు కూడా మెచ్చారు. నాకూ అది ఇష్టమే. అది కాకుండా "చిన్నగౌండర్" సినిమాలో విజయకాంత్ తల్లిగా వేసిన పాత్ర ఒకటి నాకు బాగా నచ్చింది. ఏ పాత్ర అయినా సరే, నాకు నటిస్తూ ఉంటేనే నాకు బాగుంటుంది. కొన్ని దశాబ్దాలుగా యాక్టింగ్‌కి అలవాటు పడిపోయాను. ఇప్పటికీ నాలుగు రోజులు షూటింగు లేకపోతే పిచ్చెక్కిపోతుంది. సినిమా వాళ్లందరమూ ఒక కుటుంబం లాటి వాళ్లం. నన్ను "అచ్చి" అని పిలుస్తారందరూ. అంటే అమ్మ అని. అదే నాకు ఆనందం. వేరే ఏ బిరుదూ అక్కర్లేదు. "పుదియ పాదై" సినిమాకి జాతీయ స్థాయిలో బెస్ట్ సపోర్టింగ్ యాక్ట్రస్ అవార్డు వచ్చింది. తమిళనాడు ప్రభుత్వం ఇచ్చే కళైమామణి అవార్డు వచ్చింది. ఎన్ని అవార్డులు వచ్చినా ప్రజాభిమానానికి సాటిరావు.

-కమ్యూనికేటర్ ఫీచర్స్



నవరాత్రి (తమిళం)లో పిచ్చిదానిగా, ఇతర హాస్యనటీమణులతో కలిసి సావిత్రితో




# ప్యార్ కియా తో డర్నా క్యా...

చిత్రం - మొఘల్ ఏ ఆజమ్ (1960)
రచన - షకీల్ బదయూని
బ్యానర్: స్టెర్లింగ్ ఇన్వెస్ట్‌మెంట్ కార్పొరేషన్
సంగీతం - నౌషద్
గానం - లతా మంగేష్కర్
అభినయం- మధుబాల, పృథ్వీరాజ్ కపూర్, దిలీప్ కుమార్



కళ్లల్లో నిప్పులు కురిపించిన పృథ్వీరాజ్



ప్రేమికులదినం రోజున పుట్టిన అందాలరాశి



## పాట

ప్యార్ కియాతో డర్నా క్యా జబ్ ప్యార్ కియాతో డర్నా క్యా
ప్యార్ కియా కోఈ చోరీ నహీ కీ..చుప్ చుప్ ఆహేఁ భర్‌నా క్యా

ఆజ్ కహేంగే దిల్ కా ఫసానా
జాన్ భీ లేలే చాహే జమానా
మౌత్ వహీ జో దునియా దేఖే
ఘుట్‌ఘుట్ కర్ యూ మర్‌నా క్యా ॥ప్యార్॥

ఉన్‌కీ తమన్నా దిల్ మే రహేగీ
శమా ఇస్ మహఫిల్ మే రహేగీ
ఇశ్క్ మే జీనా ఇశ్క్ మే మర్‌నా
ఔర్ హమే అబ్ కర్‌నా క్యా ॥ప్యార్॥

ఛుప్ న సకేగా ఇశ్క్ హమారా
చారోం తరఫ్ హై ఉన్‌కా నజారా
పర్‌దా నహీ కోఈ ఖుదాసే
బందోంసే పరదాక్యా ॥ప్యార్॥

తెలుగునాట కూడా ఎంతో ప్రచారం పొందిన ఈ పాట ప్రేమికుల దినం నాడు ప్రేమికులందరూ అనుకునో, ఆలపించో తమకు తాము ధైర్యం చెప్పుకుంటారని సులభంగా ఊహించవచ్చు. సంఘాన్ని ఎదిరించి ప్రేమించి తీరతాం అనే అర్థంలో ఎన్ని గీతాలున్నా, ఈ పాటను ఇన్నాళ్లయినా జనాలు గుర్తు పెట్టుకుంటున్నారంటే దానికి కారణం - మొదటిది ఆ సినిమా మొఘలే ఆజమ్ కావడం, రెండోది అభినయించినది మధుబాల కావడం, మూడోది ఆ పాటకు రియాక్షన్ చూపినది పృథ్వీరాజ్ కపూర్ కావడం.

మొఘలే అజమ్ నిర్మాణానికి చాలా పెద్ద కథే ఉంది. 1945లో షిరాజ్ అల్ హక్ అనే ఆయన అనార్కలి కథను తెరకెక్కిద్దామనుకుని కె.ఆసిఫ్‌ను డైరెక్టరుగా పెట్టుకున్నాడు. చంద్రమోహన్‌ను అక్బర్‌గా, సప్రూను సలీమ్‌గా అనుకున్నారు. దేశ విభజన జరగడంతో ఆ నిర్మాత పాకిస్తాన్ వెళ్లిపోయాడు. ఆసిఫ్‌కి మాత్రం ఆ ప్రాజెక్టుపై మక్కువ పోలేదు. 1950 ప్రాంతాల్లో షాపుర్‌జీ అనే రియల్ ఎస్టేటు వ్యాపారస్తున్ని పెట్టుబడి పెట్టడానికి ఒప్పించి మొఘల్-ఏ-అజమ్ మొదలు పెట్టాడు. చంద్రమోహన్ బదులు పృథ్వీరాజ్‌కపూర్‌ను తీసుకున్నాడు. సప్రూ బదులు దిలీప్‌కుమార్‌ను

తీసుకోవడం జరిగింది. దిలీప్‌కు సలీం వేషం వేయడం ఇష్టం లేకపోయినా అసిఫ్ ఒప్పించాడు. అనార్కలిగా నర్గీస్‌కు బదులు మధుబాలను ఎంచుకున్నాడు.

అదే సమయంలో అనార్కలి కథను మరో ఇద్దరు నిర్మాతలు తెరకెక్కించబోయారు. మొఘలే ఆజమ్ సంభాషణ రచయిత కెమాల్ అమ్రోహీ అజిత్-మీనాకుమారిలతో సినిమా మొదలు పెట్టి పదిరోజుల షూటింగు తర్వాత వదిలేశాడు. ఫిల్మిస్తాన్ వాళ్ళు ప్రదీప్‌కుమార్-బీనారాయ్‌లతో "అనార్కలి" అతి త్వరగా తీసి హిట్ చేశారు. మొఘలే ఆజమ్ మాత్రం పూర్తవడానికి పదేళ్ళు పట్టింది. బడ్జెట్ ఎన్నో రెట్లు దాటింది. చివరికి రిలీజ్ అయిన మొదట నాలుగైదు రోజులూ జనాలు రాలేదు. అందరూ నిరాశ చెందినా అసిఫ్ మాత్రం ధైర్యంగానే ఉన్నాడు. వారం తిరక్కుండా 150 థియేటర్లలోనూ పికప్ అయింది. కొన్ని థియేటర్లలో సంవత్సరం మించి ఆడింది కూడా. పెట్టుబడి పెట్టిన కోటి రూపాయలకు మించి ఎన్నో రెట్లు ఆర్జించి పెట్టింది.



ఎటుచూసినా అతని రూపమే...

'ప్యార్ కియా తో డర్నా క్యా' పాట పిక్చరైజ్ చేసిన అద్దాల మహల్ గురించి కొన్ని ముచ్చట్లు - మోహన్ స్టూడియోలో ఆ భారీ సెట్టు (35 అడుగులు ఎత్తు, 80 అడుగుల వెడల్పు, 150 అడుగుల పొడుగు) వేసినప్పుడు అంతా బెదిరిపోయారు. దాన్ని నిర్మించడానికి రెండు సంవత్సరాలు పట్టింది. 15 లక్షలు ఖర్చయింది. బెల్జియం గ్లాసుతో కట్టిన ఆ సెట్టును చూడడానికి దేశ, విదేశాల నుండి యాత్రికులు వచ్చేవారు. అలా యూరోప్ నుండి వచ్చిన సినిమా నిపుణులు కొందరు చిన్నచిన్న అద్దాలు నిండిన ఆ సెట్లో కెమెరా ప్రతిబింబం పడకుండా సినిమా తీయడం కష్టమని అసిఫ్‌కు చెప్పారు. అసిఫ్‌కు ఒళ్ళు మండి "నేను తీయలేకపోతే సెట్‌ను ముక్కలు, ముక్కలు చేసి పడేస్తాను" అన్నాడు. ఆ మాట విన్న నిర్మాత అదిరిపోయి ఆ అద్దాలమహల్ విప్పించేసి, సొహ్రాబ్‌మోడి చేత తక్కిన సినిమాను పూర్తి చేయించాలని ప్లాను చేశాడు. అసిఫ్ ఛాలెంజ్ చేసాడు. "నేను కొన్ని సీన్లు తీసి చూపిస్తాను. లండన్‌లో ప్రాసెస్ చేయించి చూపించుకోండి" అని. అలా చూపిస్తే రిజల్ట్స్ బాగా రావడంతో నిర్మాత చల్లబడ్డాడు.



సంగీతం గురించి చెప్పాలంటే అసిఫ్ నౌషద్‌కి 75,000 రూ॥ల భారీ పారితోషికం ఇచ్చి సంగీతం సమకూర్చడానికి కుదుర్చుకున్నాడు. 20 పాటలు రికార్డు చేసి, 10 పాటలు మాత్రం ఉపయోగించుకున్నాడు. సలీం - అనార్కలిల ప్రణయ ఘట్టం సాగుతూండగా బాక్‌గ్రౌండ్‌లో తాన్‌సేన్ పాత్రకు పాట ఒకటి పాడడానికి బడే గులాం ఆలీఖాన్ పేరు సూచించి, ఆయనకు దగ్గరకు అసిఫ్‌ను తీసికెళ్ళాడు నౌషద్. కానీ బడేకు అసిఫ్ ప్రవర్తన నచ్చలేదు. పాడనని చెప్పకుండా పాటకు పాతికవేల రూపాయలిమ్మన్నాడు! మారుమాట్లాడకుండా అసిఫ్ వెంటనే ఒప్పుకోవడంతో ఉస్తాద్ బిత్తరపోయాడు. పాట పాడేటప్పుడు అసిఫ్ మార్పులు సూచించడంతో ఉస్తాద్‌కి మళ్లీ ఒళ్లు మండింది. "సీన్ తీసి చూపించు. నచ్చితే పాడతా!" అన్నాడు. సీన్ చూసాక మధుబాల అందం చూసి ఆయనకు మతిపోయింది. నాలుగు వెర్షన్లు పాడి ఇచ్చి "ఏది కావాలంటే అది వాడుకో" అన్నాడు.

"ప్యార్ కియా తో డర్నా క్యా" పాట రూపుదిద్దుకున్న సంగతి చెప్తూ నౌషద్ "రోజంతా ఆ పాట గురించి కష్టపడినా లిరిక్ ఏదీ సరిగ్గా కుదరలేదు. అర్థరాత్రి సమయంలో అనుకుంటూ ఉత్తరప్రదేశ్ తూర్పు ప్రాంతాల్లో పాడే ఒక జానపద గీతం నాకు గుర్తుకు వచ్చింది. "ప్రేమ్ కియా క్యా చోరీ కరీ హై" అని సాగుతుంది ఆ పాట. అది చెప్పగానే షకీల్ బదయాని వెంటనే పాట అల్లేసారు. పొద్దున 6 గంటలకు పాట



ప్రేమిస్తే భయపడాలా?

రెడీ అయిపోయింది".

ఇక పాత్రధారుల గురించి - పృథ్వీరాజ్ అంతకుముందు ఎన్ని పాత్రలు వేసినా అక్బర్ పాత్రలో జీవించారు. అజ్మీర్‌లో ఎండాకాలంలో షూట్ చేస్తున్నప్పుడు చెప్పుల్లేకుండా ఎడారిలో నడిచే దృశ్యం చిత్రీకరించవలసి వచ్చింది. పృథ్వీరాజ్ సందేహిస్తూ ఉంటే అసిఫ్ తను కూడా చెప్పులు తీసి ఎండలో నడుస్తానని ఆఫర్ చేసాడు. చలించిపోయిన పృథ్వీరాజ్ "ఇద్దరూ ఎందుకు అవస్తపడడం? ఆ తిప్పలేవో నేనొక్కణ్నీ పడతానులే" అన్నారు. 'ప్యార్ కియా' పాటలో కోపంతో ఆయన కళ్లల్లో నిప్పులు కురిపించిన వైనం గురించి సినిమా చరిత్రలోనే అబ్బురంగా చెప్పుకుంటారు.

ఇక మధుబాల గురించి ఎంతైనా చెప్పుకోవచ్చు. ఫిబ్రవరి 14న ప్రేమికుల దినం నాడు 1933లో జన్మించిన మధుబాల ఈ ప్రేమికురాలి పాత్రకోసమే, ఈ పాట కోసమే పుట్టిందా అనేంతగా నటించింది. అప్పటికే ఆమె ఆరోగ్యం క్షీణించింది. డాక్టర్లు వద్దంటున్నా సంకెళ్లు ధరించిన దృశ్యాలలో నటించింది. తెరమీదనే కాకుండా, నిజజీవితంలో కూడా ఆమెది భగ్నప్రేమయే! ఆమె దిలీప్‌కుమార్‌ను ప్రేమించడం ఆమె తండ్రికి రుచించలేదు. "నయాదౌర్" సినిమాలో దిలీప్‌కుమార్, మధుబాలలను బుక్ చేసిన బి.ఆర్.చోప్డా ఔట్‌డోర్ షూటింగుకి తీసుకెళతానంటే



నిర్మించడానికి రెండేళ్లుపట్టిన అద్దాల మహల్

వీల్లేదన్నాడు మధుబాల తండ్రి. దాంతో చోప్డా కేసు పెట్టాడు. కోర్టులో దిలీప్‌కుమార్ మధుబాలకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పవలసి వచ్చింది. ఆ విషయం మధుబాల జీర్ణించుకోలేక పోయింది. అమర ప్రేమికులుగా నటిస్తున్నా మొఘలే ఆజమ్ చిత్రీకరించే సమయంలో వారిద్దరికీ మాటలు లేవు. అయినా మధుబాల తెరపై ప్రేమ సామ్రాజ్ఞిగా మిగిలిపోయింది.

పాట సందర్భం అందరూ ఊహించగలిగేదే! సలీం అనార్కలిని ప్రేమించడం ఇష్టం లేని అక్బర్ బాదుషా ఆమెను రాజా స్థానంలో నాట్యం చేయమంటాడు. ఆమె నాట్యం చేసి మెప్పించాక బాదుషా మొహం మీదే ఓ ప్రశ్న అడుగుతుంది - పాట రూపంలో

**ప్రేమిస్తే భయపడాలా?**
**ప్రేమించేనే కానీ దొంగతనం చేయలేదే!**
**మౌనంగా నిట్టూర్పులు విడవాలా?**

అహ్ అంటే నిట్టూర్పు అని అర్థం. ఆ పేరుతో రాజ్‌కపూర్ ఓ సినిమా తీసాడు. తెలుగులో 'ప్రేమలేఖలు'గా డబ్ అయింది. నిట్టూర్పు విడవడాన్ని అహ్ భర్‌నా అంటారు. మొదటి చరణంలో తను చెప్పదలచుకున్నది. చెప్తే జరిగే పర్యవసానం ఏమిటో తనకు తెలుసన్న విషయం చెబుతుంది.

**విప్పి చెబుతాను నా హృదయగాథ**
**ప్రాణాలు పోయినా సరే ఈ వేళ**
**లోకం చూసేది ఈ చావు మాత్రమే**
**ఎడబాసి ఇలా చావాల్సిందేనా?**

అఫ్‌సానా అంటే కథ. జమానా అంటే ఒక కాలపరిమితి. ఆ రోజుల్లో అనే అర్థంలో ఆ జమానాలో అని మనమూ వాడతాం కదా.... మౌత్ - మృత్యువు. పుట్‌కర్ అంటే విడిపోయి అని అర్థం. యూఀ అంటే ఈ విధంగా అని.

**అతనిపై కోరిక మనసులోనే నిలిచిపోతుంది**
**ఈ సభలో ఈ దీపం ఇలాగే వెలుగుతూ ఉంటుంది**
**ప్రేమలో జీవించడం, ప్రేమలో మరణించడం**
**అంతకంటె మేం ఇప్పుడేం చేయాలి కనక?**

తమన్నా అంటే కోరిక. శమా అంటే దీపం. ఉర్దూ కవితలో ఈ మాట చాలాసార్లు వినబడుతుంది. దీపం - శలభం ఉపమానం చాలా తరచుగా వాడతారు. శలభాన్ని పర్వానా అంటారు. అలాగే మహఫిల్ కూడా వినేవుంటారు. పదిమంది కూచుని పాటలు పాడుకునే సభను మహఫిల్ అంటారు. ఇశ్క్ అంటే ప్రేమ. చివరికి చరణానికి వచ్చేసరికి చక్రవర్తిని నువ్వేమైనా దేవుడి కంటె గొప్పవాడినా అని ప్రశ్నిస్తుంది.

దాచినా దాగనిది మా ప్రేమ
నలుదెసలా అతని రూపమే
దేవుడి దగ్గర ఏ ముసుగూ లేనప్పుడు
నరుల వద్ద మాత్రం పరదా ఎందుకు?

నజారా అంటే చూపు. ఖుదా అంటే దేవుడు. బందా అంటే నరుడు. ఈ చరణం చిత్రీకరించినప్పుడు అద్దాల మహలులోని చిన్న, చిన్న అద్దాలలో మధుబాల బొమ్మ, దిలీప్‌కుమార్ బొమ్మ కనబడడం అద్భుతంగా ఉంటుంది.

చివరిగా గాయని గురించి ఒక్కమాట! లతా ఈ పాటకు ప్రాణం పోసారు. ఎలుగెత్తి పాడే పాటే అయినా పాటలో సౌకుమార్యం, సౌందర్యం ఏ మాత్రం చెడకుండా, ఎన్నేళ్లయినా గుండెల్లో మారుమ్రోగేలా ఎంతో మనోహరంగా పాడారు.

**-కమ్యూనికేటర్ ఫీచర్స్.**







**విడుదల: మయూరి**

**వెల: రూ. 35/-**

వేణు, మాళవిక హీరోహీరోయిన్‌లుగా ఉషా కిరణ్ పతాకంపై 'ఈనాడు' రామోజీరావు నిర్మించిన 'ప్రియనేస్తమా' సినిమా ఆడియో క్యాసెట్ మయూరి ఆడియో ద్వారా విడుదల యింది. ఆర్.గణపతి దర్శకుడిగా, భరణి సంగీత దర్శకుడిగా ఈ చిత్రం ద్వారా పరిచయం అవుతున్నారు.

టిప్పు పాడిన 'అరెరె అరెరె అందగత్తెరో' పాటని ఓ రెండు సార్లు వింటే చాలు... చాలా సేపటి వరకూ పెదాల మీద నర్తిస్తూనే ఉంటుంది. అంతటి క్యాచీట్యూను జతపడింది ఈ పాటకి. అందుకు తగ్గట్టు 'కట్ సిలబల్స్' లో మాటల్ని అర్థం చెడకుండా ఉపయోగించటంలో చంద్రబోస్ సంపూర్ణ విజయం సాధించాడు. మరో నాలుగుసార్లు వింటే 'దేవీశ్రీ ప్రసాద్ స్టయిల్‌లో పాట కావాలి' అని అడిగి పాటని చేయించుకున్నారేమోన నిపిస్తుంది.

'ప్రియనేస్తమా స్వాగతం' పాటకి సంగీతం, సాహిత్యం సమతూకంలో జత కుదిరాయి. మొత్తం సాహిత్యాన్ని ఆసాంతం గమనిస్తే - ప్రేమగీతాలు రాయటంలో సీతారామశాస్త్రిలో ఉన్న ఎక్స్‌ప్రెషన్స్‌ని అనంత సాగరంలో అలుపెరగని కెరటాలతో పోల్చాలనిపిస్తుంది. ఈ పాట సాహిత్యం అంతా హాయిగా అర్థమయ్యేలా పాడడంలో బాలుది చాలా ప్రాధాన్యత గల పాత్రగా ఒప్పుకొనితీరాలి. ఎందుకంటే ఇదే పాట ఏ ఉత్తరాది గాయకుని గొంతులోనే పడి ఉంటే సాహిత్యం ఎన్ని పాట్లు పడేదో మనం సులువుగానే ఊహించవచ్చు.

సుద్దాల అశోక్ తేజ రాయిగా సోనూ నిగమ్, కవితా కృష్ణమూర్తి పాడిన 'వెన్నెలలో తిరగాలి' పాట పల్లవి వింటుంటే 'నరసింహనాయుడు' సినిమాలోని 'అబ్బ అబ్బ అందం దెబ్బ' పాటలో 'వయసుల వడదెబ్బ జాజుల జడదెబ్బ' అనే అనుపల్లవికి మణిశర్మ కూర్చిన ట్యూన్ గుర్తొస్తుంది. సోనూనిగమ్ కవితాకృష్ణమూర్తి భాషా పరంగా ట్యూన్‌కి అనుగుణంగా పలికిన పలుకులు చూస్తుంటే అతి త్వరలో తెలుగుభాష స్వరూపం మారిపోయే అవకాశాలున్నాయనిపిస్తుంది.

యస్.పి.బాలసుబ్రహ్మణ్యం, సుజాత పాడిన 'నింగినేల ఒకటయ్యేలా పందిరేద్దామా' పాట చాలామంచిపాట. వినగానే ఆ కట్టుకునేలా ఉండడానికి కారణం పల్లవిలో అంతర్లీనంగా "ఏరువాకా సాగాలో" ట్యూన్‌ని స్ఫురింప చేయటం! పాట మధ్యలో 'మగపెళ్ళి వారికి సరదాలు తీరగ మర్యాదలేమిటో చూడాలిగా' అనే వాక్యాల దగ్గర వినిపించే కంఠం మల్లికార్జున్‌ది అయి ఉండాలి. ఇన్‌లే కవర్ మీద ఆ పేరులేక పోయినా మనసు మాత్రం ఆ కంఠం బాలుది కాదనే చెబుతూ

**విడుదల: మయూరి**

**వెల: రూ. 35/-**




పంపిణీరంగంలో ముప్ఫై సంవత్సరాలకు పైగా ఉన్న రాయల్ డిస్ట్రిబ్యూటర్స్ వారు రాయల్ మూవీ మేకర్స్ పతాకంపై యమ్.ఐ. ఖురేషీ సమర్పణలో నిర్మించిన 'కలలు కందాం రా' సినిమా ఆడియో క్యాసెట్‌ను మయూరి వారు విడుదల చేశారు. కొల్లి బాపిరెడ్డి చిత్రానికి దర్శకుడు కాగా రమేష్ ఎర్ర సంగీత దర్శకుడు. ఇద్దరికీ ఇది తొలి అవకాశమే! ఈ ఆడియోలో ఒక్కపాట తప్ప మిగిలిన పాటలన్నీ పోతుల రవికిరణ్ రాశారు.

బాబుల్ సుప్రియో, మహాలక్ష్మి పాడిన 'సిరిసిరి మువ్వలనాదమా' నా మదిలో మెదిలే భావమా పాట ఓపెనింగ్ - లిరికల్‌గా ఓకే అనిపిస్తుంది. కానీ మిగిలిన పాటంతా చాలా స్లోగా ఉన్నట్లు అనిపిస్తుంది. సురేష్ భో( స్లే, మైథిలీ పాడిన 'ఆటూ పోటూ లేలేని' అనే పాట జస్ట్ ఎ రొటీన్ సాంగ్. కాకపోతే మధ్యలో ఎన్.టి.ఆర్.ని, చంద్రబాబునాయుడుని అనుకరిస్తూ వచ్చే మిమిక్రీకి హరికిషన్‌ని వాడుకున్నట్టున్నారు. ఆయన పేరుని కూడా పేర్కొని వుంటే బావుండేది. కుమార్‌సాను, సునిధి చౌహాన్ పాడిన 'ఎక్కడెక్కడో మది ఊగె ఊయలా' పాటలో సంగీతం, సాహిత్యం, గానం అన్నీ బావున్నాయి గానీ మొదటి పాటలాగే స్లో...! గుణ్వంత్, సునిధి చౌహాన్ పాడిన 'మదిలో నీ రూపం మెరిసిందే నా కోసం' పాట ట్యూన్ మిగిలిన పాటలతో పోలిస్తే ఓ డిఫరెంట్ కంపోజిషన్‌గా అనిపిస్తుంది.

బాలు, రమణ కోరస్ పాడిన 'ఈ వేళలో గోలలో కమ్మగా పాడనా' పాట ఏ సైడు పాటలతో పోలిస్తే కాస్త హుషారుగా ఉంటుంది. రాసింది చంద్రబోస్ కనుక జనాలకి కావలసిన ఛమక్కులు

ఉంటుంది. ఇక - సరదా పాట రాయాలంటే తెలుగేతర పదాలతో జిమ్మిక్కులు చెయ్యకుండా, మనం రెగ్యులర్‌గా వింటున్న మాటలతోనే ట్యూన్‌కి అనువుగా పాట ఎలా రాయాలో తెలిపే పాట యిది. ఇందుకు సీతారామశాస్త్రిని ప్రత్యేకంగా అభినందించి తీరాలి. మొగలాయి, శహనాయి తెలుగేతర పదాలు అని వాదనకి దిగితే మనం ఏం చెయ్యలేం.

'చందమామ పై నుంచి మల్లెమొగ్గకిందుంది' పాట వినగానే రాధిక గొంతుబట్టి ఇదేదో వల్లో వేసుకునే పాటని అనిపిస్తుంది. పైపైన వింటుంటే అలాగే అనిపిస్తుంది. కానీ కాస్త తరచి చూస్తే లోకసత్యాలను తమాషాగా ముడిపెట్టి రాసిన భువనచంద్రలోని డెప్త్‌ని కొంతవరకు తెలియచేస్తుంది పాట.

'నీలి మబ్బుల్లారా ఆ కథ వినరే' పాట ట్యూన్ పూర్తిగా యన్.ఎ.రాజ్‌కుమార్ స్టయిల్‌ని గుర్తుచేస్తూ ఉంటుంది. సాహిత్యం వింటుంటే 'చంద్రబోస్ రెగ్యులర్ స్టయిల్ ఇది కాదే' అని అనిపిస్తుంది. చిత్రపాడిన 'నీలి మబ్బుల్లారా కథ వినరే' అనే పల్లవి, చరణానికి ఎక్స్‌టెన్షన్‌లా, సెకెండ్ వెర్షన్‌లా బాలు పాడిన 'కొమ్మా మీది మైనా కథ వినవే' అనే పల్లవి, చరణం ఉంటాయి. ఈ పార్టు వరకు 'ఏ' సైడ్‌లో ఆఖర్న పొందు పరిచారు. అది ఇన్‌లే కవర్ పై పేర్కొనలేదు. బీ సైడున మాత్రం అలా పేర్కొన్నారు. నిజానికి బీ సైడు ఉన్న ఈ రెండు వెర్షన్‌లలో 'నీలి మబ్బుల్లారా కథ వినరే' అనే వెర్షన్ మొదట ఉంటుంది కనుక ఆ వాక్యాలనే బీ సైడు ఇన్‌లే కవర్‌పై ముద్రించి ఉండాల్సింది.

పడ్డాయి. ఈ పాట తర్వాత ఎ సైడున 'గల సిరిసిరిమువ్వల నాదమా' పాట ప్రియాభట్టాచార్య పాడగా వస్తుంది. ఏ సైడు కన్నా ఇది కాస్త బెటర్‌గా అనిపిస్తుంది. అందుకు కారణం గాయని కావచ్చు. సునిధి చౌహాన్, అభిజిత్ పాడిన 'టైటు జీనులో ఫాంటు షేపుతో' అనే పాట కుర్రకారు కోసం నిర్దేశించబడిన పాట.

యూత్‌కి సంబంధించిన వాళ్ళు కూడా పెద్దగా ఫీలవని విధంగా రచయిత, సంగీత దర్శకుడు పడిన తపన ప్రత్యేకంగా కనిపిస్తుంది. భవిష్యత్తులో తెలుగు పాటలు పాడించినా మన వారు హర్షిస్తారనే నమ్మకం కలిగేలా సునిధి చౌహాన్ పాడింది.

రచయిత (ల) పేరు (లు) గాయనీ గాయకులతో సమానంగా కాకుండా వేరే లైనులో ఇన్‌కార్డుపై వేసి ఉంటే బావుండేది.

లేకపోతే రచయిత(లు) కూడా పాటను పాడారని అభిప్రాయం కలిగే ప్రమాదం ఉంది.







'అఖిల' టీవి సీరియల్ ద్వారా పాపులర్ అయిన దొంతిరెడ్డి అచ్యుతరెడ్డి దర్శక నిర్మాతగా అనూష ప్రొడక్షన్స్ పతాకంపై నిర్మించిన 'నువ్వుంటే చాలు' సినిమా ఆడియో క్యాసెట్ మయూరి ఆడియో ద్వారా విడుదలయింది. ఆకాష్ ఈ చిత్రానికి సంగీత దర్శకుడు.

'అందానికి అందం ఈ బంగారు బొమ్మ' పాటలో సుద్దాల అశోక్ తేజ రచనా పరంగా చక్కని ఎక్స్‌ప్రెషన్‌లు ఇచ్చాడు.

ఇంద్ర ధనువును గాజులుగా చెయ్యటం, నక్షత్రాలను గోళ్ళకు అతికించటం, వెన్నెల దారం తీసే రాట్నంతో పెళ్ళి చూపులకు పనికొచ్చే పరికిణి వోణీ నేసే దర్జీ అవడం, ముళ్ళు రాళ్ళు ఎదురొస్తే ముందుగా తెలవడానికి కాలి అందెలలో గుండెను పొదగడం, కన్నుల నుండి నీరు రాకుండా ఉండటానికి కాటుక అవడం లాంటివి అతనిపై గౌరవాన్ని పెంచుతాయి. భీంప్లాస్ రాగచ్ఛాయలతో హాయిగా ఉన్న ఈ పాటను మరింత హాయిగా పాడిన బాలుతో పాట పాడిన గాయని పేరు కూడా ఇన్ లే కవర్‌పై వేసి వుంటే మరింత బావుండేది.

శంకర మహదేవన్, హరిణి పాడిన 'తాతల నాటి నేతుల వాసన మూతుల కిప్పుడు ఉండదురా' పాటని ప్రయోజనాత్మక గీతంగా చెప్పుకోవాలి. ఎంత ప్రయోజనమో చెప్పాలంటే పాటలోని ప్రతి వాక్యాన్ని ఉదహరించాలి. నూతన రచయిత వసంత్ ఈ పాట ద్వారా చాలామందికి గుర్తుండి పోతాడు.

బండారు దానయ్య రాయగా రాజేష్, కవితా కృష్ణమూర్తి పాడిన 'మధురమైన ఓ మధుబాల' పాట వినడానికి ఏ ఇబ్బందినీ కలిగించకుండా మధ్యలో 'నెల్లూరి నెరజాణ' పాట వరసను

**విడుదల: మయూరి**
**వెల : రూ. 36/-**

గుర్తొకుతెస్తూ ఉంటుంది.

ఐజి మహేష్ రాయగా మనో, స్వర్ణలత పాడిన 'ప్యాషన్ రంగమ్మా పుల్లని దానిమ్మ' పాట గురించి చెప్పుకోవటానికేం లేదు. జస్ట్ రొటీన్ సాంగ్ అంతే....!

సుద్దాల అశోక్ తేజ రాయగా 'బాలు పాడిన' మాటాడితే చాలు రాచిల్కలే వాలు' అనే వాక్యాలతో మొదలయ్యే 'నువ్వుంటే చాలు' టైటిల్ సాంగ్‌లో సాహిత్యం, గానం, సంగీతం, వరస స్థానాలను ఆక్రమిస్తాయి.

ఐజి మహేష్ రాయగా సుఖ్వీందర్ సింగ్ పాడిన 'రెక్సోనా పిల్లరా బాబు రెస్ట్ కోసం వచ్చేరా' పాట యూత్ కోసం తయారు చేసిన పాట. ఈ ఒక్క మాట, గాయకుని పేరు సరిపోతుంది. పాటెలా ఉంటుందో చెప్పడానికి! బండారు దానయ్య రాయగా స్వర్ణలత పాడిన 'భూలోక రంభ నేనా' పాటను కూడా ఆ యూత్ ఎక్కౌంటు లోనే వేసుకోవచ్చు.

శంకర్ మహదేవన్, సుఖ్వీందర్‌సింగ్ పేర్ల ప్రక్కన ముంబయి అనీ, హరిణి పేరు పక్కన కేరళ అనీ, ఇన్‌లే కవర్‌పై పేర్కొనడం బావుంది. భవిష్యత్తులో చాలామంది ఈ సంప్రదాయాన్ని అనుసరించే అవకాశం ఉంది. అది మంచిది కూడా!



# ప్రేమ పద సోపాన పటము

( ప్రేమికులకు మాత్రమే )

రూపకల్పన: రాజా

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 64 అన్యోన్య దాంపత్యం | 63 | 62 విడాకులు | 61 | 60 | 59 | 58 కలహాలు | 57 |
| 49 FRYDAY | 50 TOLET | 51 కాపురం | 52 | 53 | 54 గెస్టులు | 55 | 56 |
| 48 హనీమూన్ | 47 | 46 విరహం | 45 పెళ్ళి | 44 పడిగాపులు | 43 పడిగాపులు | 42 పడిగాపులు | 41 పడిగాపులు |
| 33 నిట్టూర్పులు | 34 నిట్టూర్పులు | 35 నిట్టూర్పులు | 36 పడిగాపులు | 37 పడిగాపులు | 38 పడిగాపులు | 39 పడిగాపులు | 40 పడిగాపులు |
| 32 పడిగాపులు | 31 పడిగాపులు | 30 నిశ్చయం | 29 లైబ్రరీలు | 28 పార్టీలు | 27 అపార్థం | 26 సినిమాలు | 25 బార్లు శాడ్ సాంగ్స్ |
| 17 ప్రయత్నాలు | 18 ప్రయత్నాలు | 19 అర్థం | 20 కలసి | 21 మెలసి 'తిరు | 22 గుళ్ళు- గోపురాలు' | 23 పార్కులు | 24 బీచ్‌లు చెరువు గట్లు |
| 16 మ | 15 ళ్ళీ | 14 మ | 13 ళ్ళీ | 12 ప్ర | 11 య | 10 త్నా | 9 లు |
| 1 | 2 అమ్మాయి | 3 అబ్బాయి | 4 | 5 స్పందన | 6 గా | 7 ట్టి | 8 గా |

# వాలెంటైన్స్ డే సందర్భంగా...

2 : అమ్మాయి అయితే రెండు నుంచి

3 : అబ్బాయి అయితే మూడు నుంచి మొదలు పెట్టాలి.

5 : 'స్పందన'లో పడ్డారా... ఇకనేం - ఒకరినొకరు అర్థంచేసుకోండి మరి.

6 - 26 : స్పందించకుండా గాట్టిగా ప్రయత్నాలు చేస్తున్నారా...!? ఒకరినొకరు అర్థంచేసుకొనేవరకు అంటే 19లో పడేవరకు కలిసి తిరగకండి. "అర్థం" హద్దు దాటిపోతే కలిసి తిరుగుళ్ళు 'అపార్థాల'కి దారితీస్తాయి. కనుక బాగా అర్థం అయ్యే వరకు వెనుకా ముందూ... ముందూ వెనకా తిరగండి.

27 : అపార్థాల జోలికి పోవద్దని చెప్తున్నానా ముందర్నించీ... బాగా "అర్థం" అయ్యే వరకు ప్రయత్నాలు చేస్తూనే ఉండండి - అటు ఇటు తిరుగుతూ.

30 : నిశ్చయం అయిపోయిందా - పెళ్ళికి డైరెక్ట్‌గా వెళ్ళిపొండి, పడిగాపులు వేస్తు.

31 - 48 : పెద్దలు నిశ్చయించకుండా, పెళ్ళికాకుండా హనీమూన్‌కి వెళ్ళేరనుకోండి... కాపురం పెట్టకుండా తప్పించుకోలేరు.

45 - 10 : కాపురం పెట్టేదాకా అటు ఇటు తిరగండి.

51 : కాపురం పెట్టారుగా అన్యోన్య దాంపత్యానికీ ప్రయత్నించండి

52 - 53 : జాగ్రత్తగా కాపురం చేసుకుంటూ అన్యోన్య దాంపత్యానికి ఆనవాలుగా మిగలడానికి ప్రయత్నించండి.

54 : గెస్టులు దాపురించారా విరహం తప్పదు. విరహం తరువాత కాపురం ఒక్కొక్కప్పుడు భలే హుషారుగా ఉంటుంది.

55 - 57 : గెస్టుల బారినుంచి తప్పించుకున్నారు కనుక కలహాల జోలికి వెళ్ళకుండా హాయిగా ఎన్‌జాయ్ చెయ్యండి.

58 : కలహాలు అపార్థాలకి దారి తీస్తాయి. అపార్థాలు మళ్ళీ మొదటికి తెస్తాయి మిమ్మల్ని.

59 - 61 : కలహాలు లేకపోయినా మాటా మాటా అనుకోవడం ఎడమొహం పెడమొహం అవటం టోటల్‌గా బ్లాంక్ అయిపోవటం లాంటివి విడాకులకు దారితీసే ప్రమాదం ఉంది జాగ్రత్త.

62 : విడాకుల దాకా వచ్చారా? జీవితం మళ్ళీ మొదలు పెట్టండి.

63 : మొత్తానికి గెస్టుల్ని, కలహాల్ని, విడాకుల్ని తప్పించుకున్నారు హాపీ... అన్యోన్య దాంపత్యానికి ఇంకాస్త ట్రై చెయ్యండి... విజయం మీదే.

64 : హమ్మయ్య! మొత్తానికి మీది అన్యోన్య దాంపత్యం అని అనిపించుకున్నారు. యూ ఆర్ మేడ్‌ఫర్ యీచ్ అదర్... కంగ్రాట్స్ !!

పి.యస్ : అటు ఇటూ తిరిగే సులువుకోసం గవ్వలు పడిన సంఖ్యతో వెనక్కి కూడా జరగొచ్చు. ప్రేమలో ఆటు పోట్లు తప్పవుకదండీ. మరి.




## ఇది యస్పీబాల సుబ్రహ్మణ్యం సమర్పిస్తున్న శీర్షిక

**మీకు తెలుగు ఎంత బాగా తెలుసో, మీ పదసంపద ఎటువంటిదో బేరీజు వేసుకోవడానికి ఉద్గ్రంథాల దాకా పోనక్కరలేదు. ఈ సంచికలో కనబడే సినిమాపాటలలోని మాటలతో కూర్చిన ఈ శీర్షికలో సరైన అర్థం అనుకున్న మాటపై టిక్కుపెట్టి బాలూ గారిచ్చిన సమాధానాలతో సరిచూసుకోండి.**

1. లహరి (చంద్రహారం..ఇది నా చెలి)
ఎ) పడవ  బి) అల
సి) విష్ణువు  డి) చిరునవ్వు

2. చంచల (చంద్రహారం... ఎవరివో)
ఎ) మెరుపు  బి) శీతలము
సి) నక్షత్రము  డి) చందమామ

3. సిగపట్లు (చంద్రహారం..ఏం చేస్తే)
ఎ) కొప్పులు  బి) కొప్పులోని పువ్వులు
సి) పట్టుదలలు  డి) దెబ్బలాటలు

4. పరిమళం (ప్రియనేస్తమా..ప్రియనేస్తమా)
ఎ) ఉదయం  బి) పూవు
సి) సువాసన  డి) వెలుతురు

5. ఉలి (ప్రియనేస్తమా...వెన్నెలలో)
ఎ) చెక్కే పరికరం  బి) కులుకు
సి) ఉలికిపాటు  డి) శిల్పం

6. లలన (ప్రియనేస్తమా..వెన్నెలలో)
ఎ) నెమలి  బి) జోలపాట
సి) చిలుక  డి) స్త్రీ

7. తరుణం (ప్రియనేస్తమా..నింగినేల)
ఎ) అప్పు  బి) చెట్టు
సి) అవకాశం  డి) అనుకూల సమయం

8. తథాస్తు (ప్రియనేస్తమా..నింగినేల)
ఎ) అట్లే అగుగాక  బి) ఆశీర్వాదము
సి) అంగీకారము  డి) ప్రశంస

9. త్రుళ్లిపడు (ప్రియనేస్తమా..నింగినేల)
ఎ) ఉలిక్కిపడు  బి) తిరిగివచ్చు
సి) ఎగిరిపడు  డి) తికమకపడు

10. తూర్పారబట్టు (చంద్రవంశం..మామ మామ)
ఎ) గాలికి ఆరబోయు  బి) మోదు
సి) తడుపు  డి) కోయు

### జవాబులు

1) b 2) a 3) d
4) c 5) a 6) d
7) d 8) a 9) c
10) a




## ఉవాచ



"ప్రస్తుతం ఫ్యామిలీ చిత్రాలకు మార్కెటు లేదు. ఇదంతా యూత్ ఓరియెంటెడ్ సబ్జక్టుల యుగం"

- ఎస్.వి.కృష్ణారెడ్డి



"రాగాలకు రోగాలు పోతాయన్న పాత మాటేమో గానీ, ఇప్పుడు సంగీతానికే పోగాలం వచ్చిందేమోనని కొన్ని సినీగీతాలు వింటూంటే అనిపిస్తోంది."

- బాలకృష్ణ



"కామెడీ చేయడం చాలా కష్టం. ఈల అందరూ వేస్తారు, ఫ్లూట్ కొందరే వాయించగలరు. అలాగే కామెడీ కూడా!"

- కమల హాసన్

## ఆంధ్ర కార్టూనిస్టుకి అంతర్జాతీయ అవార్డు

హైదరాబాదుకి చెందిన ఐ.వి.ఆర్.ఎమ్. రాజుకి రుమేనియా దేశం అంతర్జాతీయ స్థాయిలో నిర్వహించిన కార్టూన్ పోటీలో బహుమతి లభించింది. "బుక్స్ అండ్ స్టడీ" అనే థీమ్‌పై 40 దేశాల కార్టూనిస్టులు పాల్గొన్న ఈ పోటీలో రాజు 'ప్రైజ్ ఆఫ్ ఎక్సలెన్స్' పొందారు. ఇరవై దశాబ్దాలుగా కార్టూన్లు వేస్తున్న రాజు కార్టూన్లు బల్గేరియా, స్విజర్లండ్‌లలో జరిగిన ఎగ్జిబిషన్లలో కూడా చోటు చేసుకున్నాయి.



## రాక్ లో రవీంద్ర సంగీతం?

కాపీరైట్ చట్టం ప్రకారం విధించిన గడువు తీరిపోవడంతో ఈ ఏడాది నుండి రవీంద్రుని రచనలపై, సంగీతం పై ఇన్నాళ్లూ హక్కులు అనుభవించిన విశ్వభారతి యూనివర్సిటీ ఆ సౌకర్యాన్ని కోల్పోతోంది. ఇకపై ఎవరైనా సరే రవీంద్రుని రచనలను స్వేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. బెంగాల్‌లో ఉన్న కొన్ని రాక్ బ్యాండ్స్ రవీంద్రుని గీతాలను ఓ చూపు చూద్దామని అనుకుంటున్నట్టు సమాచారం. రవీంద్రుడు బతికి ఉంటే ఈ ప్రయోగాలను హర్షించేవారా అన్నది డౌటే! తన గీతాలకు స్వయంగా సంగీతం సమకూర్చిన రవీంద్రుడు రాధికా గోస్వామి, సహనా దేవి వంటివారు ఇంప్రువైజ్ చేస్తే సంతోషించారు. మరీ ఎక్కువైతే మాత్రం నొచ్చుకున్న సందర్భాలు కూడా ఉన్నాయట. హిందీ, బెంగాలీ చిత్రాలకు సంగీతం సమకూర్చిన గాయకుడు పంకజ్ మల్లిక్ ను రవీంద్రుడు తన 'దినేర్ శేషే' గీతానికి ట్యూన్ కట్టమంటూనే 'నా పాట మీద స్టీమ్ రోలర్ నడిపే ప్రయత్నం చేయకు సుమా!' అని హెచ్చరించారట.

## పాటగత్తెగా ప్రపంచసుందరి



2000 సంవత్సరానికి ప్రపంచసుందరిగా ఎన్నికైన ప్రియాంకా చోప్డా జి.వెంకటేశ్వరన్ నిర్మిస్తున్న 'తమిళన్' అనే తమిళ చిత్రంలో నటించడంతో బాటు ఓ పాట కూడా పాడబోతున్నారు. ఓ సారి షూటింగులో ప్రియాంకా తనలో తాను సన్నగా పాడుకోవడం విన్న దర్శకుడు, హీరో విజయ్ ఆమె పాట పాడాలని బలవంతం చేశారట. సరేనంది ప్రియాంకా.



## ఆస్కార్ గెలుచుకోబోతున్న మ్యూజికల్ కామెడీ

గతపక్షంలో జరిగిన 2002 గోల్డెన్ గ్లోబ్ ఎవార్డులలో "మౌలిన్ రూజ్" మూడు ఎవార్డులు గెలుచుకుంది. బాజ్ లుహర్‌మన్ దర్శకత్వం వహించిన ఈ చిత్రానికి బెస్ట్ మ్యూజికల్, (ఆర్ కామెడీ) అవార్డు వస్తే, బెస్ట్ ఏక్ట్రెస్ ఇన్ ఎ మ్యూజికల్ అవార్డు నికోల్ కిడ్‌మన్‌కి, బెస్ట్ ఫిల్మ్ స్కోరుకి క్రేగ్ ఆమ్‌స్ట్రాంగ్‌కి ఎవార్డులు వచ్చాయి. పారిస్ నైటక్లబ్ సింగర్‌కి, పైకి రావడానికి ప్రయత్నిస్తున్న ఓ రచయితకు మధ్య జరిగే విఫల ప్రణయాన్ని చిత్రీకరించిన ఈ సినిమా ఆస్కార్ ఎవార్డులు కూడా గెలుచుకోబోతోందని అంచనాలు వేస్తున్నారు.

## ఫోటోగ్రాఫర్ గా బ్రయాన్ ఆడమ్స్



గాయకుడు బ్రయాన్ ఆడమ్స్ ఫోటోలు తీయడంలో కూడా దిట్ట. ఆ మధ్య కెనడాలో చక్కటి ఫోటోలు తీసి 'మేడ్ ఇన్ కెనడా' పేర ఒక పుస్తకాన్ని ప్రచురించి, దాని మీద వచ్చిన డబ్బును కెనడియన్ బ్రెస్ట్ కాన్సర్ ఫౌండేషన్‌కు ఇచ్చేసాడు. ఇప్పుడు ప్రతిభకు మంచి గుర్తింపు వచ్చింది. ఇంగ్లండు రాణి ఎలిజబెత్ గోల్డెన్ జూబిలీ ఉత్సవాల సందర్భంగా రాణిని ఫోటో తీసేందుకు బ్రయాన్‌కు అనుమతి లభించింది.

## చిత్ర నిర్మాతల చరిత్ర

పాతసినిమాల పాటలు, సన్నివేశాలు లీగల్ గా ఉపయోగించుకుందామనుకునేవారు ఆ సినిమా నిర్మాతల వివరాలు తెలియక అవస్తపడడం జరుగుతోంది ఇన్నాళ్లూ. చెన్నై. అన్నాశాలైలోని తెలుగుఫిలిం ప్రొడ్యూసర్స్ కౌన్సిల్ వారు చేపట్టిన తెలుగు చలన చిత్ర నిర్మాతల చరిత్ర ప్రాజెక్టు ద్వారా ఈ లోటు తీరబోతోంది. 1975 నుండి 1990 వరకు తీసిన నిర్మాతల వివరాలు తెలిసినవారు ఈ కౌన్సిల్‌కు తెలియపరచి వారికి సహకరించవచ్చు.

# లలిత సంగీతం

ఫిబ్రవరి 10 ఘంటసాల వర్ధంతి సందర్భముగా

## జయ జయ జయశ్రీ వేంకటేశా



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

**ఎం. చిత్తరంజన్**

సమర్పిస్తున్న శీర్షిక ఇది.

ఫోన్ నెం. 040-7402993

ప॥ జయ జయ జయశ్రీ వేంకటేశా
జయ జయ జయ ఓం శ్రితజనపోషా ॥జయ॥

1. సనకాది ఋషులు సన్నుతి చేయ
లక్ష్మీదేవి నీ పాదములొత్త
భృగుకోపమున వైకుంఠమిడి
భూలోకమునే చేరితివయ్యా ॥జయ॥

2. వల్మీకమున దాగియుండగ
రుద్రుడె గోవై పాలివ్వ
గొల్లడొకడు నీ శిరమున బాదగ
ఘోర శాపమునె యిచ్చితివయ్య ॥జయ॥

3. కానలలోన ఒంటివాడవై
తిరుగుచు వకుళను చేరితివయ్య
వకుళ మాతకు ముద్దు బిడ్డవై
మురిపెముతోనె పెరిగితివయ్య ॥జయ॥

వచనము: అంత ఒక దినంబున పూదోటలోన
ఆకాశరాజు తనయ శ్రీ పద్మావతీదేవిని
గాంచి వలచి వలపించితివో మహానుభావా!

4. లోకనాథునీ కల్యాణమునకు
కుబేరపతినే ఆశించి - ఆ
కుబేర ధనముతో మీ కల్యాణము
మహోత్సవంబుగ జరిగిందయ్యా
ఆనందమానందమాయెనే -
పరమానందమానందమాయెనే

వచనము: ధర్మపత్నితో దారిలో వున్న అగస్త్యముని
ఆశ్రమంబున ఆరు మాసములు అతిథిగా
వున్నావో దేవా!

5. కొండలపైనే తొండమానుడు
ఆలయమొకటి కట్టించెనయా
స్వర్ణ శిఖరపు శేష శైలమున
స్థిరనివాసివై నిలిచితివయ్య ॥జయ॥

6. రమాదేవి నిను వెదకుచు చేరగ
శిలారూపమున వెలసితివయ్య
భక్తకోటికిదె నిత్య దర్శనం
పాప విమోచన పుణ్య స్థలమయా ॥జయ॥

సాకీ

నీ మహాత్మ్య పఠనమే మహాస్తోత్రమయా
నీ దివ్యనామమే కైవల్యమయా
దీనులమము కరుణించవయా, ఓ వెంకటేశా!
నమో వేంకటేశా నమః శ్రీనివాసా
నమోచిద్విలాసా నమో పరమపురుషా
నమోతిరుమలేశా నమో కలియుగేశా
నమోవేదవేద్యా నమో విశ్వరూపా
నమో లక్ష్మీనాథా నమో జగన్నాథా
నమస్తే నమస్తే నమః



| | | |
|---|---|---|
| రచన | : | ఎ. వేణుగోపాల్ |
| సంగీతం | : | ఘంటసాల |
| గానం | : | ఘంటసాల, బృందం. |
| రాగమాలిక | : | ఈ పాటను సామ, శ్రీ, మధ్యమావతిరాగాలను ఆధారంగా చేసుకొని స్వరకర్త బాణీని కూర్చారు. |

**సామరాగం:**

ఆరోహణ : స రి మ ప ద ప

అవరోహణ : స ద ప మ గ రి స

షడ్జము, చతుశృతి రిషభము, శుద్ధ మధ్యమము, పంచమము, చతుశృతి దైవతము - ఆరోహణమునందు,

తారషడ్జము, చతుశృతిదైవతము, పంచమము, శుద్ధమధ్యమము, అంతరగాంధారము, చతుశృతి రిషభము - అవరోహణ మునందును కలవు.

**శ్రీరాగం:**

ఆరోహణ : స రి మ ప ని స

అవరోహణ : స ని ప మ రి గ రి స

షడ్జము, చతుశృతి రిషభము, శుద్ధమధ్యమము, పంచమము, కైశికి నిషాదము - ఆరోహణలోను,

తారషడ్జము, కైశికి నిషాదము, పంచమము, శుద్ధ మధ్యమము, చతుశృతి రిషభము, సాధారణ గాంధారము, చతుశృతి రిషభము - అవరోహణయందును కలవు.

**మధ్యమావతి రాగం:**

ఆరోహణ : స రి మ ప ని స

అవరోహణ : స ని ప మ రి స

షడ్జము, చతుశృతి రిషభము, శుద్ధ మధ్యమము, పంచమము, కైశికి నిషాదము - ఇవే స్వరాలు ఆరోహణ, అవరోహణలయందు కలవు.

శ్రీ పద్మావతీ శ్రీనివాసుల కల్యాణము యితివృత్తంగా గల యీ గేయాన్ని వేణుగోపాల్‌గారు సరళమైన భాషలో అందరికీ అర్థమయేవిధంగా రూపొందించగా, స్వరకర్తయైన ఘంటసాల మనోహరమైన బాణీని కూర్చి అత్యంత భక్తియుతంగా గానం చేశారు. రాగమాలికగా కూర్చిన యీ గేయంలో "ఆనంద మానంద మాయెనే - పరమానంద మానందమాయెనే" (వివాహాలలో నాదస్వర వాద్యకారులు తప్పని సరిగా వాయించేది) అనే వివాహ వేడుకకు సంబంధించిన యీ సంప్రదాయపు పంక్తులకు, వాటి బాణీనే యిక్కడ స్వీకరించి గానం చేశారు. ఆ బాణీ శ్రీరాగం స్వరాలు ఆధారంగా కలది.

ఒకటి కంటే ఎక్కువ రాగాలను ఉపయోగించి బాణీని కూర్చితే దానిని

## ఎ.వేణుగోపాల్



శ్రీ ఆచ్చి వేణుగోపాలాచారి (ఎ.వేణుగోపాల్) తెలుగులోనే కాక, సంస్కృతం, హిందీ, ఉర్దూ భాషలలో కూడా నిష్ణాతులు. ఐదు దశాబ్దాలుగా ఎన్నోగేయాలు, కవితలు, నాటికలు మొదలైనవి వ్రాశారు. 1954-55 ప్రాంతంలోనే మద్రాసులో చిత్రరంగ ప్రవేశం చేశారు. గేయ రచయితగా కథా రచయితగా, ఎన్నో చిత్రాలకు పని చేశారు. ఎన్.టి.రామారావు, కృష్ణకుమారి నటించిన "తిరుపతమ్మ కథ", కృష్ణ ఊర్వశి శారద నటించిన "సౌభాగ్యవతి" (ఈ చిత్రానికి కథా రచయితగా వేణుగోపాల్ గారికి 1976లో ఫిలిం ఫేర్ అవార్డు లభించింది). కృష్ణ, జమున నటించిన "అమాయకుడు" మొదలైన చిత్రాలకు ఆయన కథా రచయితగాను, గేయ రచయితగాను పని చేశారు.

"అమాయకుడు" చిత్రంలో వేణుగోపాల్ రచించిన "పట్నంలో శాలిబండ" (గానం: ఎల్. ఆర్.ఈశ్వరి, సంగీతం: బి.శంకర్) 1960వ దశకంలో యువతరాన్ని ఉర్రూత లూగించింది. "రాఘవేంద్ర మహిమ", "పునాది రాళ్ళు", "దేవుడున్నాడు" అన్న చిత్రాలకు కూడా ఆయన కథా రచయితగాను, గేయ రచయితగాను సేవలందించారు.

సుప్రసిద్ధ నిర్మాతలు, దర్శకులు అయిన పి.పుల్లయ్య, కడారి నాగభూషణం, విఠలాచార్య, వి.మధుసూదనరావులకు కో-ఆర్డినేటర్‌గా పని చేశారు. ఇవేగాక ఎన్నో స్టేజి నాటికలు - "బ్రహ్మచారుల సంఘం", "సత్యమేవజయతే", "మామంచిమాష్టారు" మున్నగునవి వ్రాసి వాటికి దర్శకత్వం వహించారు. 1994లో హైదరాబాదులోని "శిల్పారామం"లో ప్రదర్శించ డానికి ఒక నృత్య నాటికను వేణుగోపాల్‌గారు వ్రాయగా నేను సంగీతం సమకూర్చాను. అదే సంవత్సరంలో ఆయన డైరెక్టు చేసిన "యాదగిరి శ్రీలక్ష్మీ నరసింహస్వామి మహత్యం" చలన చిత్రానికి నేను సంగీత దర్శకత్వం వహించాను. అందులో ఆయన చాలా మంచిపాటలు వ్రాశారు. శ్రీ గోదాదేవి విరచిత "తిరుప్పావై" తమిళ పాశురాలకు తెలుగులో గేయాలుగా అనువదించి పుస్తకంగా ప్రచురించారు.





"రాగమాలిక" అంటారు.

తన యిష్టదైవమైన తిరుమలేశునిపై ఘంటసాల గారు ఎన్నోమధురమైన భక్తిగీతాలు ఆలపించారు. "నమో వేంకటేశా - నమో తిరుమలేశా", "ఏడుకొండల సామీ - ఎక్కడున్నావయ్యా" (ఆర్.భద్రిరాజు) "తిరువేంకటాధీశా జగదీశా", "శేషాద్రి శిఖరాన" (వి.జి.కె.చారి) మొదలైనవి తిరుమల కొండపై స్వామి వారి సన్నిధిలో ప్రతిదినమూ వినిపించే పాటలు. స్వామివారి ఆలయ నిత్య సేవాక్రమంతో పాటుగా యీ గీతాలు కూడా అను నిత్యమూ ఆ క్షేత్రంలో వినిపిస్తుంటాయి. అంటే, ఘంటసాల గారు ఆ గీతాల ద్వారా స్వామి వారికి ఒనర్చిన స్వరార్చన అంత విశిష్టమైనదన్న మాట. 1969లో హైదరాబాదు సారథీ స్టూడియోలో ఒక డాక్యుమెంటరీ చిత్రానికి నేను, నా మిత్రుడు ఎల్.నిర్మల్‌కుమార్ కలిసి గురజాడ వారి "దేశమును ప్రేమించుమన్నా" గీతానికి సంగీతం కూర్చగా ఘంటసాల గారు ఈ గీతాన్ని పాడడానికి స్టూడియోకి వచ్చారు. ఆ సందర్భంలో ఆయనకు కలిగిన ఒక అనుభవాన్ని నాతో చెప్పారు. అప్పటికి ఒక నెలముందు ఆయన గాత్రం దెబ్బతిని పూర్తిగా మూసుకుపోతే వేంకటేశ్వర స్వామికి మొక్కుకున్నారట - తన గాత్రం స్వామి దయవలన బాగై పోతే, వెంటనే స్వామిపై ఒక పాట పాడి రికార్డుగా యిస్తానని, త్వరలోనే ఆయన గాత్రం తిరిగి మామూలు స్థితికి రాగానే "నీ కొండకు నీవే రప్పించుకో" అన్నపాటను పాడి హెచ్.ఎం.వి రికార్డుగా యిచ్చానని చెప్పారు. ఆ విధంగా అవకాశం చిక్కినప్పుడల్లా శ్రీనివాసునిపై పాటలు పాడే వారు. "శ్రీ వేంకటేశ్వర మహాత్మ్యం" చిత్రంలో "శేషశైల వాస శ్రీవేంకటేశా" అన్న పాటను చిత్రీకరించిన సన్నివేశంలో ఆయన ఆలయంలో స్వామి ఎదుట కూర్చొని పాడారు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఆస్థాన విద్వాంసుడుగా లలిత సంగీత విద్వాంసుడైన ఘంటసాల గారిని నియమించి గౌరవించడం, లలిత సంగీత విద్యకే సత్కారంగా భావించాలి. ఆయన చివరి రోజులలో "భగవద్గీత"ను గానం చేయడం ఆయన భక్తికి పరాకాష్ఠ అని చెప్పవచ్చు. వివిధ యితివృత్తాలు, సన్నివేశాలకు సంబంధించి ఏ పాట పాడినా, తెలుగుదనం ఉట్టిపడేటట్లు గానం చేయడం ఆయన ప్రత్యేకత.

ఆయన స్వర్గస్థులై దాదాపు పాతిక సంవత్సరాలు గడచినా తెలుగువారు ఆయనను స్మరించుకుంటూ ప్రతి ఏడూ జయంతిని, వర్ధంతిని అత్యంత భక్తి శ్రద్ధలతో జరుపుకుంటున్నారు. త్యాగరాజ ఆరాధన ఉత్సవాలు జరిగినట్లుగా, ఘంటసాల గారికి కూడా జయంతి, వర్ధంతి సభలు జరగటం అంటే ఆంధ్రులను ఎంతగా ఆయన ప్రభావితం చేశారో మనం ఊహించవచ్చు. ఆ అమరగాయకుని వర్ధంతి సందర్భంగా ఆయనకు యిదే నివాళి!

ప॥ సధసరి। మగరీ। సధాస। సాసా।
ఘంటసాల జయజయ। జయశ్రీ। వేం. క। టేశా।
బృందం ససరిరి। మమపా। మపదప। మగరీ।
జయజయ। జయఓం। శ్రితజన। పో. షా ॥జయ॥

1. చ॥ పపపా। దపమగరి। రిససస। సాసా।
సనకా। ది. ఋషులు। స. న్నుతి। చేయ।
రీమమ। పపపా। పదరిస। దాసా।
లక్ష్మీదే। . వినీ। పా. దము। లొత్త।
పమపద। దససరి। దససా। సససా।
భృగుకో.। పమున.। వై. కుం। ఠమిడి।
సదరిస। దపపా। పమదప। మగరీ।
భూ. లో.। కమునే। చే. రితి। వ. య్య। ॥జయ॥

2. చ॥ పాపాదప। మగరీ। రిససస। , ససా।
వల్మీ...। కమున। దా. గియుం। . డగ।
పాపాదప। మగరస। రీరీ। రీ, ।
రుద్రుడె.। గో. వై.। పాలి। వ్వ.।
పమపద। సససరి। దససస। సాసస।
గొ. ల్లడొ। కడునీ.। శిరమున। బాదగ।
దరిసద। పపప। పమపాదప। మగరీ।
ఘో. రశా। . పమునె। యి. చ్చితి.। వ. య్య। ॥జయ॥

3. చ॥ పాపప। మగరీ। రిససస। , ససా।
కానన। లో. న। ఒం. టివా। . డవై।
రిమపప। మగరిస। రీరిరి। రీరీ।
తిరుగుచు। వకుళను। చేరితి। వయ్యా।
పమపద। ససపరి। దాసస। , ససా।
వకుళమా। . తకు.। ముద్దుబి। . డ్డవై।
సదరిస। దపపా। పమదప। మగరీ।
మురిపెము। తో. నె। పెరిగితి। వయ్యా ॥జయ॥

వచనము: పాప మప పపాపప మపపాప పాప మపపసద దాద దదద
అంత ఒక దినంబున పూ.దోట లోన ఆ. కా.శ. రాజుతనయ
దాపా దసరిసాద దపపాపద మా, గరిస రిమాగరీ
శ్రీపద్మా...వ తీ. దేవిని గాం... చి.....
పమప దససాససద దసరిమాగరీమాసాసా... నిదరిససాద
వలచి వలపించితివో. మహా.... .ను భావా.. . . . . . . . .
దాదాపా మపదనిసా.... నిదప మాగరీసరీసా
... ఆ ......................................................

(సామ రాగంలో నిషాదం లేదు. కాని ఘంటసాల గారు పై పంక్తులు పాడి ఆ తరువాత పాడిన ఆలాపనలో కాకలి నిషాదం ఉపయోగించి పాడారు. కనుకనే పైన నొటేషన్ ఆ మాదిరిగా (వ్రాయబడినది)

4వ. పాపప। , పమగ। రిససా। సససస।
లోకనా। . ధనీ.। క. ల్యా। ణమునకు।
రిపాప। మగరీ। రిసరీ। రీపా।
కుబేర। పతినే। ఆ. శిం। చిఆ।

మపాద। ససససస। సదరిస। దపపప
కుబేర। ధనముతొ। మి. క.। ల్యా. ణము।
పదాస। దపపప। పమదప। మగరీ।
మహోత్స। వం. బుగ। జరిగిం.। ద. య్యా।
శ్రీరాగం నీ, సా, రీ। రిగ సరి। గా, రి। సారిస।
ఆ. నం. ద। మా. నంద। మా. యె। నేపర।
నీ, సా, రీ। రిగసరి। గా, రి। సా, ।
మా. నం. ద। మా. నంద। మా. యె। నే.।
వచనము: నీససాససా నిసససాసాస నిసాససస సాససాసస
మధ్యమావతిధర్మపత్నితోదా.రిలో వున్న అగస్త్యముని ఆశ్రమంబున
నిరిసనిపపపపప మపనీ 'సాసా' ని 'సరిమా'...
రీస సరిరిపమమరీసరీస
ఆ. రు మా. స ములు అతిథిగా వున్నావో..... దేవా.....
........................
సనిరిరిససనీ.... నిరీ... సా
.....................................
5. చ॥ పాపప। మరిరిస। సాసస।, సాసా।
కొండల। పై.న.। తొండమా। .నుడు।
రిమపానిప। మరిరిస। సనిస రి। రిరిరీ।
ఆ. లయ.। మొకటి.। క. ట్టిం.। చెనయ।
మరిమప। నినినిప। నిససస।, ససస।
స్వ. ర్ణ శి। ఖరపు। శే. షశై।. లమున।
పరిరిరి। ససనిప। నినిపమ। రిమపని।
స్థిరనివా।. సివై.। నిలిచితి। వ,య్యా...।
ససనిప। మరిసా। నిపాస। సాసా। ససరిరి।
మమపా। మ పనిని।
జయజయ। జయశ్రీ। వేం. క। టేశా। జయజయ।
జయ ఓం। శ్రితజన
సాసా। రిసనిప। మరిసా। నివాస। సాసా।
పోషా। జయజయ। జయశ్రీ। వేం. క। టేశా।

6. చ॥ పపాప।. నిపమరి। మమరిస। సాసాస।
రమాదే। .వి. నిను। వెదకుచు। చేరగ।
రిపాప।, నిపమరి। సనిసరి। రీరీ।
శిలారూ.। ప. మున। వెలసితి। వయ్య।
రీమప। నినినిప। నీసస।, ససా।
భక్తకో।. టికిదె। నిత్యద।. ర్శనం।
మరిసస। రిసనిని। సనిపమ। రిరిరిమపని।
పా. పవి। మో. చన। పు. ణ్యస్థ। లమయా.... ॥జయ॥
సాకీ పామపాప పపపపని మమాపాపపపా
నీమహాత్మ్యపరనమే. మహాస్తోత్రమయా
మపసనీనీని నీనినీ పనినీనిని సనిరి ససనినీ... నిసాసపా....
నీ.... దివ్య నామమే కై. వ ల్యమయా.........
నిససస సస నిససాస సస..ప మపనిసరిమా... రీరిమమరిసా... సా
దీ. నుల మము కరుణించవయా.... ఓ.... వేం... కటే... శా
సా... నిరిసనినిసా ... నిసా నిపమరీ... పమా నిపమరీసా
ఆ ..............................................
మామా రీరిమామా రిరీరీమమామా పా.... పా.... పపామా పపాపా
నమో వేంకటేశా నమః శ్రీనివాసా ఓం నమో చిద్విలాసా
మమా మమపపపపా నీ... నినీపపని నీనీ పమాపపని నీనీ
నమో పరమపురుషా ఓం నమో తిరుమలేశా నమో కలియుగేశా
సా... ససా నీససాసా నిసపనీ 'ససాసా' రీ.... రిరీ.. సారిరీరీ
ఓం... నమో వేద వేద్యా నమో... విశ్వరూపా ఓం..... నమో లక్ష్మి నా థా
సనీ ససమరి రీరిస
నమో జగ ... న్నాథా.
ససా రీమా... రీ రిరీమ పా మరీ సా... స స సా... ని సా రి మ రిస సా
నమస్తే.... నమస్తే.... నమః ... ఆ .....
సరీస సనిరిససనినీ నిసానిమపమరీ మపాసనీ... పమరీ...రీపమా....
ఆ.........................................................
మనిపమరీసా
.......................



# తెలుగు చిత్రాలలో కొన్ని రాగమాలికా గీతాలు

| | చిత్రం | గానం | సంగీతం |
|---|---|---|---|
| 1. ముక్కోటి దేవతలు | బావమరదళ్ళు | ఘంటసాల | పెండ్యాల |
| 2. హాయిగాహాయిగా ఆమనిసాగే | సువర్ణసుందరి | ఘంటసాల, జిక్కి | ఆదినారాయణరావు |
| 3. ఎవడేఅతడెవడే | విప్రనారాయణ | భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 4. ప్రళయపయోధిజలే | భక్తజయదేవ | ఘంటసాల | ఎస్.రాజేశ్వరరావు |
| 5. ఆకాశవీధిలో | మల్లీశ్వరి | ఘంటసాల, భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 6. ఇదియేజీవితానందము | స్వర్ణమంజరి | ఘంటసాల | ఆదినారాయణరావు |

# సంగీత ప్రపంచంలో తబలా తడాఖా చూపిన

# 'అల్లారఖా'

## ఫిబ్రవరి 3 అల్లారఖా వర్ధంతి సందర్భంగా



అల్లారఖా

తబలా సోలోకు అంతర్జాతీయ ఖ్యాతి నార్జించి పెట్టిన విద్వాంసుడు "ఉస్తాద్ అల్లా రఖా". అల్లారఖా అనగానే మనకు తాజ్‌మహల్ టీ వాణిజ్య ప్రకటనలో తబలా ప్లేయర్ జాకీర్ హుస్సేన్‌తోబాటు కనిపించే ముసలాయన గుర్తుకు వస్తారు. కానీ సంగీత ప్రపంచంలో చిన్న చూపుతో చూసే తబలా వాయిద్యానికి శాస్త్రీయ సంగీతం సొబగులద్దిన త్రిమూర్తులలో ఒకరాయన. పండిట్ కిషన్‌రాజ్, పండిట్ శాంతా ప్రసాద్‌లు మిగతా ఇద్దరు. ఇరవయ్యో శతాబ్దపు తొలి నాళ్లలో ప్రక్క వాద్యకారులు వేదికపై ప్రధాన కళాకారుడికి దగ్గరలో కూర్చోకూడదనే ఆంక్షలుండేవి. అలాంటి పరిస్థితుల నుండి తబలాను సెంటరాఫ్ స్టేజీకి తీసుకువచ్చిన ఘనత అల్లారఖాది.

1919 ఏప్రిల్ 29న జమ్ములోని ఫగ్వాలో అల్లారఖా జన్మించారు. డోగ్రీ తెగకు చెందిన వారు కావడం వల్ల వారి సంబంధీకులంతా సైన్యంలో చేరేవారు. అయితే అల్లారఖా తండ్రి స్థానికంగా ఒక నాటక కంపెనీని నిర్వహించేవాడు. దాంతో పసితనంలోనే నాటకాల్లో వేషాలు వేసి నటిస్తుండే వాడు. కొంతకాలం తరువాత ఆయన మనసు సంగీతం వైపు మళ్లింది. జానపద పౌరాణిక గాథల విషయంలో ఆయనకు మంచి పరిజ్ఞానం ఉండేది. తను నటించిన నాటకాల్లోని సంభాషణలను మిత్రులతో చెప్పి నవ్విస్తుండేవారు.

అల్లారఖా పాటియాలాకు చెందిన ఉస్తాద్ ఆశిక్ ఆలీఖాన్, పండిట్ భాస్కర్ భువా భాగ్లే శిష్యుడైన బాయిలాల్ రబానీ నుండి సంగీత శిక్షణ పొందారు. ప్రధానమైన తబలా వాదనలో ఆయన గురువు ఉస్తాద్ ఖాదిర్‌బక్షీ నేర్చుకున్నది 'పంజాబీ పఖ్‌వాజ్' సంప్రదాయం.

అల్లారఖా తన 18వ ఏట తొలి కచేరి చేసి సంగీత ప్రపంచంలోకి ప్రవేశించారు. ఆ తరువాత మళ్లీ వెనక్కి తిరిగి చూసుకునే అవసరమే కలుగ లేదాయనకు. 1940లో ఆకాశవాణిలో నిలయ విద్వాంసుడిగా చేరడంతో ఆయన వ్యక్తిగత సంగీత జీవితం స్థిరపడినట్లయింది.

1947లో తొలిసారిగా రవిశంకర్ - సితార, గజానన్‌రావు జోషి-వాయులీనంతో చేసే కచేరీకి తబలాతో వాద్య సహకారం అందించారు అల్లారఖా. ఈ కచేరిలో అల్లారఖా, మరో తబలా వాదకుడు కిషన్ మహరాజ్‌లు పోటీ పడి తమ ప్రతిభను తారాస్థాయికి తీసుకుపోవడంతో ఉద్వేగాన్ని ఆపుకోలేని అల్లా రఖా అభిమాని ఒక్కసారిగా పిస్తోల్‌ను గాలిలోకి పేల్చాడు. అలా ఉండేది ఆయనకున్న ఫాలోయింగ్. ఇది మొదలు రవిశంకర్ - అల్లారఖాలు మంచి మిత్రులైనారు. తనకన్నా 11 నెలలు పెద్దవాడైన అల్లారఖాను "భయ్యా" అని ఆప్యాయంగా పిలిచేవారు రవిశంకర్.

1958లో రవిశంకర్ నేతృత్వంలో జపాన్ వెళ్లిన భారతీయ కళాకారుల బృందంలో భరత నాట్య కళాకారిణి కమలా లక్ష్మణ్, కథక్ నర్తకి దమయంతీ జోషిలతో బాటు అల్లారఖా కూడా ఉన్నారు. ఈ పర్యటనలో రవిశంకర్, అల్లారఖాల విన్యాసాలు విదేశీయుల మెప్పుపొందాయి. ఆ తరువాత భారతీయ బృందంలో సభ్యునిగా దేశవిదేశాల్లో కచేరీలు చేసి భారతీయ సాంస్కృతిక రాయబారిగా పేరొందారు. తన సమకాలికులైన రవిశంకర్‌తోనే గానే పండిట్ జస్‌రాజ్, అలీ అక్బర్‌ఖాన్, పండిట్ భీంసేన్ జోషి, బిస్మిల్లాఖాన్‌లతో కలిసి చేసిన స్వర సమ్మేళనాలు ఆయన్ను సంగీత శిఖరంపైకి చేర్చాయి.

అల్లారఖా తబలా వాదకుడే కాదు గాయకుడు కూడా అన్న విషయం చాలామందికి తెలియకపోవచ్చు. సంగీత మాధుర్యానికి తోడు తాళ, గణిత, చమత్కార ధ్వని రహస్యాలన్నీ ఆయనకు కరతలామలకం. ఇలా శాస్త్రీయ సంగీతంలో దిట్టగా వెలుగొందారాయన.

మళ్ళీ రవిశంకర్‌తో కలిపి ప్రస్తావించుకుంటే అల్లారఖాతో పరిచయానికి ముందు తన కచేరీలకు చతుర్‌లాల్, కాళీరథ్‌లతో తబలా సహకారం తీసుకునే వారు. ఆ తరువాత 60ల మధ్య నుండి తబలా వాద్యకారునిగా అల్లారఖాతో కలిసి ప్రపంచ వ్యాప్తంగా కచేరీలు చేసి సంచలనం సృష్టించారు రవిశంకర్. ఈ కచేరీల ద్వారా వీరిరువురు భారతీయ శాస్త్రీయ సంగీత కచేరీ ప్రక్రియకు కనీస మాత్రపు మౌలిక నిర్మాణాన్ని, ప్రమాణికతను రూపొందించగలిగారు. మరో అడుగు ముందుకు వేసి తబలా వాయిద్యానికి సోలో అవకాశం కల్పించింది అల్లారఖానే. "ఆయనలో అంతర్లీనంగా ఉన్న అనిర్వచనీయమైన ఆనందమంతా వాద్య విన్యాసంలో వ్యక్తమవుతుండేద"ని పండిట్ రవిశంకర్ అంటారు.

ఇంకా ఆయనే అల్లారఖా గురించి ఇలా అంటారు. "ఎవరినైనా ఇట్టే ఆకట్టుకునే విధంగా చేసే భావ వ్యక్తీకరణలు, అద్భుత లయ విన్యాసం,

ఆశ్చర్యం కలిగించే వేళ్ల చలనం, ఆనందంలో ఓలలాడించే విన్యాసం - వెరసి అల్లారఖా ప్రోగ్రాం ఒక ప్రత్యేకమైన అనుభవం".

అల్లారఖా కుటుంబ సభ్యులంతా నరనరాన సంగీత స్వరాలను జీర్ణించుకున్నారు. పెద్దకొడుకు జాకీర్ హుస్సేన్ తండ్రిని మించిన తనయుడు. విశ్వవేదికపై వచ్చి తబలా స్వరమాధుర్యాన్ని విస్తరింప చేసినవాడు. 30వ ఏటనే "పద్మశ్రీ" అందుకున్న ప్రతిభా శాలి. ఇంత చిన్న వయసులో పద్మశ్రీ అందుకున్న వారు చాలా అరుదు. జాకీర్ అందుకున్న అంతర్జాతీయ అవార్డులు చాలానే ఉన్నాయి.

అల్లారఖా రెండవ మూడవ కుమారులు తౌఫిక్, ఫజల్ కూడా సంగీతంలో నిష్ణాతులే. కుమార్తె ఖుర్షీదా, రజియాలు గజల్ గాయనీమణులు. ఖుర్షీదా లండన్‌లో స్థిరపడగా, రజియా తండ్రి అల్లారఖా వద్ద ఉండేది. జాకీర్ హుస్సేన్‌కు సెక్రటరీగా పని చేసేది. అయితే రజియా అనారోగ్యంతో బాధపడుతూ ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించడంతో షాక్‌కు గురైన అల్లారఖా ఆ మరునాడే తనువు చాలించి తన స్వరయాత్రను ముగించారు. ఆ రోజు 3 ఫిబ్రవరి 2000.

ఆయన నిరాడంబరుడు! నిగర్వి. తనను మరణానికి కొన్ని రోజులు ముందు పండిట్ జస్‌రాజ్‌కు జరిగిన ఒక సన్మాన సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్నప్పుడు ప్రసంగించమని కోరగా అల్లారఖా ఏమీ మాట్లాడకుండా కొద్ది సేపు హృద్యంగా తబలాతో కచేరీ చేసి సభికులను ఆనందింప జేసి "నేనేమీ మాట్లాడలేను. సంగీతమే నాకు తెలిసిన భాష" అని వినమ్రంగా చెప్పుకున్న కళాకారుడాయన.

అల్లారఖా తన అరవైఏళ్ల శాస్త్రీయ సంగీత జీవితంలో అందుకున్న పురస్కారాలు, సన్మానాలు అసంఖ్యాకం. 1977లో 'పద్మశ్రీ', 1982లో సంగీత నాటక అకాడమీ అవార్డు, 1999లో పి.చౌడయ్య జాతీయ అవార్డు వాటిలో కొన్ని మాత్రమే. అల్లారఖా కొడుకూ, కూతుళ్లే గాక భార్య బావీబేగం సైతం సంగీత విద్వాంసురాలే. పూర్తిగా ఆ కుటుంబమంతా సంగీత కళా సరస్వతి సేవలో తరించింది. చివరి రోజుల్లో కచేరీల్లో పాల్గొనడం కన్నా కుమారులు, శిష్యులకు పాఠాలు చెప్పడంలోనే ఎక్కువ సమయాన్ని గడిపారు.



పండిట్ రవిశంకర్‌తో అల్లారఖా

భారతీయ హిందుస్థానీ శాస్త్రీయ సంగీత ప్రపంచంలో అబ్దుల్ కరీంఖాన్, కిషన్‌మహరాజ్, ఉస్మాద్ హాఫీజ్‌ఖాన్ వంటి మహా విద్వాంసుల కోవకు చెందిన అల్లారఖాది ఒక శకం. ఆయన ప్రభావం నుండి తప్పించుకున్నవారు బహు అరుదు. చివరగా పండిట్ రవిశంకర్ మాటల్లోనే చెప్పాలంటే - "అల్లారఖాలోని నిత్యనూతనమైన సృజనాత్మకత, పులకింపజేసే శబ్దమాధుర్యం వాడిపోని మధుర స్మృతుల్లా మిగిలి పోయాయి".

-హెచ్.రమేష్‌బాబు


**SUBSCRIPTION COUPON**

Name :............................................................ Age: ......................Profession.......................

Adress:...................................................................................................................................

...........................Ph. No. ............... (O) ...................... (R) email:.................................................

I am enclosing DD/Cheque/M.O. Receipt No......................... Dated ......................... for Rs. 200/- favouring HUMMUS INFOWAY (P) Ltd., **payable at HYDERABAD** for 24 issues of 'HAASAM HAASYA SANGEETHA PATHRIKA' starting from Issue No...... (.............................. month, 2002)

Date: Signature

Mail to: HUMMUS INFOWAY (P) LTD., 502, SRI BALAJI NILAYAM, 13-1-212, BSP COLONY, MOTINAGAR, HYDERABAD - 500 018. Ph: 383 1388 / 657 0215, email: haasammag@hotmail.com

Note: No outstation cheques please

**అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే**




# త్యాగరాజు ఆత్మవిచారం

ఈ పుస్తకం గురించి కామేశ్వరరావు గారి మాటల్లోనే చెప్పాలంటే - "త్యాగరాజు రచించిన మాటలను గాయకులు తమ గానశాస్త్రం ప్రదర్శించడానికే ఉపయోగించుకున్నారు. ఆ కీర్తనల మొదటిముక్కలు ఒకటి రెండున్నూ, చివరలో వచ్చే త్యాగరాజనుత అనేదీన్నీ తప్ప తక్కిన కథ ఏమిటో ఎవరికీ అక్కర్లేని పరిస్థితి వచ్చింది. 'త్యాగరాజు హృదయ కవి. హృదయం అనే మాట ఇతడు వాడినంత విరివిగా వాడినంత తెలుగురచయిత లేడు. చాలా కీర్తనలు హృదయపూర్వక సంభాషణలే కదా వాటిని వ్యావహారికంగా చెప్పేసి గానపరంగా కాకపోయినా మరో విధంగానైనా అపూర్వమైన త్యాగరాజాత్మ తెలుగు జనాలకు పరిచయం చేద్దామని ఈ పుస్తకం రాశాను. అందుబాటులో ఉన్న 594 విడి కీర్తనల్నే 9 శీర్షికల కింద అంటే (1) త్యాగరాజు తన మనస్సునే సంబోధించి చెప్పుకున్నవి (2) రాముణ్ణే ఉద్దేశించి అతణ్ణే సంబోధిస్తున్నవి (3) జనంతో అన్నవి (4) ఇతరుల్ని ప్రశంసిస్తూ రాసినవి (5) అనుభవసారం గలవి (6) కలికాలాన్ని నిందించేవి (7) సగుణత్వాన్ని నిరూపించేవి (8) దేవభాషలో ఉన్నవి (9) పూజా విధానాన్ని వివరించేవి - ఇలా విడగొట్టి రాసాను." ఆ విధంగా ఒక్కో చాప్టర్ క్రింద కొన్ని కొన్ని కీర్తనల భావం చోటుచేసుకుంది. త్యాగరాజు పంచరత్న కీర్తనల (మూల పాఠం అనుబంధంలో చూడండి) అర్థాలను కామేశ్వరరావు ఎలా విడమరిచి చెప్పారో చూపాలని సులభతరం చేసి ఈ శీర్షిక క్రింద ఇవ్వడం జరుగుతోంది.

**హాస్యబ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు గారికి సంగీతంపై అభినివేశం ఉందని చాలా తక్కువ మందికి తెలుసు. 1949లో ప్రచురించబడిన "త్యాగరాజు ఆత్మవిచారం" ఒక విలక్షణ రచన - త్యాగరాజు కీర్తనలలో ఉన్న**



శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు

**భావాన్ని సులభమైన భాషలో త్యాగరాజు పరంగా విశదీకరించిన పుస్తకం అది. 50 ఏళ్ల నాటి ఈ పుస్తకాన్ని చాలా తక్కువ కాపీలు ముద్రించడం వల్ల, పునర్ముద్రించక పోవడం వల్ల (వారి కుమారులు హాస్యరచయిత శ్రీ భమిడిపాటి రాధాకృష్ణగారు పునర్ముద్రించే ఉద్దేశంలో ఉన్నారు) ఇది ఒక అలభ్యమైన పుస్తకం అయిపోయింది. హాస్యం - సంగీతం మేళవించిన "హాసం" ఒక ప్రముఖ హాస్య రచయిత సంగీతంపై రాసిన ఈ అరుదైన రచనను త్యాగరాజ ఆరాధనోత్సవ సందర్భంగా పరిచయం చేయడానికి గర్విస్తున్నది.**

## జగదానందకారక

ఎల్లప్పుడూ ఎల్లలోకాలకీ ఆనంద మిచ్చేవాడా! జయ జయ! జానకీ రమణా! 'శ్రేష్ఠమైన సూర్యవంశంలో పుట్టినవాడా!' రాజ రాజులకి ఈశ్వరుడా! సుగుణాలకి ఆటపట్టూ! సజ్జనులు సేవింప తగ్గవాడా! చక్కనివి ఇచ్చేవాడా! దేవతలనే చుక్కలలో చంద్రుడా! పరిపూర్ణుడా! పాపరహితుడా! దేవతలకి కల్పవృక్షమా! పెరుగు సముద్రంలో ఉండేవాణ్ణి హరించినవాడా, అందమైన ముఖం గలవాడా! అమృతమయమైన వాక్కు గల వాడా! వాణిని ఎరిగినవాడా! ఆనందంతో కూడిన వాడా! లక్ష్మి వరించినవాడా! నిత్యయౌవనం గలవాడా! ఆప్తులైన వాళ్ళకి శుభాలు చేకూర్చేవాడా! వేదపద్మానికి సూర్యుడా! రాక్షస మేఘాలకి పెనుగాలీ! పక్షివాహనా! సత్కవిహృదయవాసీ! అనేకమంది కోతులకి అధిపతి అయిన సుగ్రీవుడు పొగిడే పాదయుగ్మం గల వాడా! ఇంద్రనీలమణుల కాంతివంటి కాంతిగల శరీరుడా! చంద్రసూర్య నేత్రుడా! బ్రహ్మపితా! సకలానికి నాథుడా! తెల్లని శేషుడిపై శయనించినవాడా! శివుడిచేత కీర్తింప బడేవాడా! ముని శాపాన్ని పాదంతో జయించినవాడా! యాగం రక్షించినవాడా! శ్రేష్ఠమైన మంత్రాలు పొంది నవాడా! పరమ శాంతచిత్తా! సీతాధిపతీ! బ్రహ్మకి వరాలిచ్చినవాడా! సృష్టి స్థితి లయాలకి కారకుడా! అమితమైన కోర్కెలు ఫలింప చేసేవాడా! సాటిలేని శరీరంవాడా! ఇంద్రునిచే పొగడబడిన వాడా, సముద్రుడి గర్వాన్ని అణచిన వాడా! హృద్యమైన రాగాలతో కూడిన కథాసారాంశం గలవాడా! సజ్జన మనస్సముద్రానికి చంద్రుడా! పుష్పవిమానం గలవాడా! హనుమంతుడి చేతుల్లో లాలింపబడే పాదాలు గలవాడా! దుర్గుణాలు గల రాక్షసుల మదం హరింప జేసేవాడా! సనాతనుడా! బ్రహ్మచే పొగడబడేవాడా! ఓంకారం అనే పంజరంలో ఉండే చిలకా! మూడు మూర్తులు దాల్చినవాడా! ఇంద్రజిత్తు తండ్రిని చంపిన వాడా! చంద్రవంక ధరించే శివుడికి ఆప్తుడా! కరుణకి నిలయుడా! శరణాగతుల్ని పాలించేవాడా! దేవతలకి నాథుడా! వికృతి లేనివాడా! వేదసారాన్ని మించిన వాడా! కవి శ్రేష్ఠుడై పుట్టలో పుట్టిన ముని (వాల్మీకి)చేత వ్రాయబడ్డ చరిత్రతో సన్నుతింప బడ్డ వాడా! త్యాగరాజ నుతుడా! ఆది పురుషుడా! రాజేంద్ర కుమారా! ఆశ్రితుల ఆధీనంలో ఉండేవాడా! ఖర విరాధ రావణాదుల్ని చీల్చి చెండాడినవాడా! పాపదూరుడా! పరాశరప్రియుడా! మార్పులేని వాడా! లెక్కకుఅందని గుణములవాడా! బంగారు వస్త్రం ధరించేవాడా! ఎర్రటి పాదాలు గలవాడా! అపారమైన మహిమగలవాడా! అద్భుతుడా! సత్కవుల హృదయంలో వేంచేసి ఉండేవాడా! దేవముని స్నేహితుడా! లక్ష్మీకాంతుడా! పాపం అనే ఏనుక్కి నరసింహుడా! త్యాగరాజాది వర భక్తులు నిన్ను నుతిస్తున్నారు.

## దుడుకు గల

ఓ శ్రీ వల్లభా, అవాఙ్మానసగోచరా! నా అంత దుడుకుగల వాణ్ణి ఏ రాచబిడ్డ రక్షిస్తాడు! క్షణక్షణమూ విషయాలు నన్ను లాగెయ్యడం వల్ల నా దుడుకు హద్దుమీరిపోతోందే! అంతటా నువ్వు నిండిఉన్నావనే బుద్ధి నాకురాదే! చిన్ననాడే నీనామం నాజిహ్వని పట్టకపోయిందే! కడుపు నింపుకోడానికి ఇతరుల మనస్సులు కరిగించి వాళ్ల సొమ్ములు పుచ్చుకున్నానే! ఈలోకం లోదే జీవనం అనుకున్నానే! స్వర లయ జ్ఞానము లేక, రాతిగుండెవహించి, నటవిట క్షుద్రులు చేజిక్కడానికి సంతోషిస్తూ కూచున్నానే! నీ పదాలలో నమ్మకం ఉంచుకోవడం మానేసి, ధనగారాలలో నమ్మకం పెటుకున్నానే. దివ్యమైన నీముఖకమలాన్ని స్మరించక మదాంధుల్ని కోరి పరితాపాల్లో చిక్కుకుని విషయాలు రోయలేక చపల చిత్తుణ్ణయి ప్రతి నిత్యమూ అపరాధాలు చేస్తున్నానే! దుర్లభ మానవశరీరం దక్కినందుకు పరమానందం పొందలేక మద మాత్సర్యాలకి దాసుణ్ణయి మోసపోయానేగాని, పెద్దజన్మ ఎత్తినా నీచపుపన్లే చేశానుగాని, అధముల్తో చేరి హీనమతాలు సాధించడానికి తబ్బిబ్బుపడ్డానే గాని, తిన్నగా ఉండలేక పోయానే! స్త్రీలకోసం కొన్నాళ్ళు, ధనం కోసం కొన్నాళ్ళు తిరిగాను మహాప్రభో, రామా, ఇటువంటినన్ను నువ్వెలా రక్షిస్తావో!

## సాధించెనే

తను ఉపదేశించిన మంచి మాటలన్నీ గాలికి ఎగరగొట్టేసి, మనదగ్గరికి రాకూడదు - అని తను పట్టినపట్టు సాధించుకు తీరాడుస్మీ రాముడు! అతని మాటలన్నీ సమయాను కూలంగా ఉండేరకం. దేవకీ వసుదేవుల్ని వేపించుకు తిన్లేదూ! ఏమన్నా అందాం అంటే, గంగ అతని పాదంలో పుట్టింది, సంగీత సంప్రదాయం అతన్నించే వచ్చింది. మనల్నే కాదు, గోపికల్నీ అంతే. వాళ్ల కోరికలు మన్నించడం లేదు, పైగా వాళ్లని వేళాకోళం పట్టించేవాడు. వాళ్లు చాలా అలసట చెందినా ఆశతో మొక్కుతూనే ఉండేవాళ్లు. యశోదనీ అంతే. అబ్బాయీ అని పిల్చి ఆవిడ తన్ని ముద్దు పెట్టుకుంటూ ఉంటే తను నవ్వేసి పారేసేవాడు. ఇంతకంటె భక్తవత్సలుడు సుగుణ సముద్రుడూ యావజ్జీవపావనుడూ ఉండడు, ఇతడు మన కలిబాధలు తీసేస్తాడు, అని మనం అనుకుంటూంటే ఎల్లా వచ్చిందో చూశావా? నేనెంతేనా స్తోత్రం చేస్తూ పాడాను. పాడితేనేం? వేడితేనేం? మళ్లీ నా పూజ తీరుగా స్వీకరించాడు. సద్భక్తుల నడతలు ఫలానా ఫలానా మోస్తరుగా ఉంటాయన్నాడు, కోప్పడద్దు అన్నాడు, భక్తి శూన్యుల్తో సావాసం మానమన్నాడు, బాధ కలిగితే కొంచెం ఓర్చుగోమన్నాడు. ఇన్నీ అని, మనసా! మనదగ్గరికి మాత్రం రాలేదు, ఎల్లా నెగ్గించుకున్నాడో చూడు తనపట్టు.

## కనకనరుచిరా

దినదినమూ ఎడతెగకుండా పాలుకారే నీ ముఖమూ, అందులో నిండి ఉండే సిరీ, బాల సూర్యుడిలాంటి నీ వస్త్రం, మణిమయమైన నీ కంఠమాల, నీ కాంతి కిరీటమూ మొదలైనవి గమనించిన కొద్దీ, ధ్రువుడు నిన్ను ధ్యానించినట్లు ధ్యానించినకొద్దీ, ఆంజనేయుడి ద్వారా నీ మహిమవిని సీత నిన్ను కోరి సొక్కినట్టు సొక్కినకొద్దీ, నీ రుచి తెలుస్తుంది. నీపాద పద్మాలు పట్టుకునే హనుమంతుడూ, నీ నామజపం చేసే శివుడూ కాక నారద పరాశరులూ శుక శౌనకులూ పురందరులూ నీ యందు గల ఆకర్షణకి సాక్షులు కారూ? కళకళలాడే తన మొహంలో మిలమిల లాడే కళ్లతో కులుకుతూ ఓర చూపులు చూసే నిన్ను చూసినకొద్దీ, నాకు ఇంకా చూడాలనే ఉంది. రామా, నన్ను మరవకు, నిను శరణుజొచ్చాను. భక్తుడైన సుపర్ణుణ్ణి వాహనంగా అంగీకరించావు. సీతకి నీయందు ఎంత ప్రేమో అంతప్రేమ నీయందు త్యాగరాజుకి కూడా కలిగించుదూ!

## ఎందరో మహానుభావులు

అనుభవాలు విధ విధాలు. గొప్ప అనుభవాలు గలవాళ్లు అనేకులు. మేఘశ్యాముడి అందచందాలు హృదయారవిందంలో చూసుగుని బ్రహ్మానందం అనుభవించే వాళ్లెందరో, సామగానం చేసే ధన్యులెందరో, మన్మథ సౌందర్యం గల ధన్యశ్రేష్ఠులెందరో, మనస్సనే కోతి యొక్క సంచారం నిలువు చేసి దివ్యమూర్తిని పొడగాంచే వాళ్లెందరో, రామపాదాలకి స్వాంతం అనే పద్మం సమర్పించుగునే వాళ్లెందరో, యథార్థమూ పారమార్థికమూ అయిన మార్గంలో పరాత్పరుణ్ని స్వరం లయా రాగం తెలిసి పాడేవాళ్లెందరో, హరి గుణాలనే మణిహారాలు కంఠసీమని మెరుస్తూండే భక్తకోటుల్ని తెలివితెచ్చుగుని స్నేహభావంతో దయార్ద్రహృదయంతో ఆదరిస్తూ ప్రపంచాన్ని చల్లని చూపు చూసి రక్షించే వాళ్లెందరో, అందాలు చిందే నడకలు గల్గిన సరసుడైన రాముణ్ణి ఎల్ల వేళలా కళ్ళ ఎదుట చూస్తూ ఒళ్ళు పులక రించగా ఆనంద సముద్రంలో మునిగిపోయి సంతోషిస్తూ యశస్సు పొందినవాళ్లెందరో, పరమ భక్తులూ మునిశ్రేష్ఠులూ సూర్యచంద్రులూ సనక సనందనులూ దిక్పాలురూ సురకిన్నర కింపురుషులూ ప్రహ్లాద నారద తుంబురులూ హనుమంత పరమ శివులూ శుకబ్రహ్మలూ దివ్య పురుషులూ ఎల్లరూ పరమ పవిత్రులూ ఘనులూ అవడంచేత శాశ్వత బ్రహ్మానందం అనుభవిస్తుంటారు గనుక వాళ్లెందరో, రాముడి శరీర నామ వైభవ పరాక్రమ ధైర్య శాంత త్యాగ సత్యాల గురించి తమరికి సద్భక్తి జనించకపోయినా రాముడు దుర్మతాల్ని అణిచి వేసినందుకు సంతోషించి అతణ్ణి అందువల్ల ఆనందంతో భజిస్తూ కీర్తన చేసేవాళ్లెందరో, భాగవత రామాయణాలు యొక్క, వేదం యొక్క, శాస్త్రపురాణాల యొక్క, శైవ వైష్ణవాది ఆరుమతాల యొక్క రహస్యాలున్నూ, ముప్పైమూడు కోట్ల దేవతల యెక్క అంతరంగాల భావాలున్నూ, తెలిసి, భావరాగ తాళాల సౌఖ్యం గమనించి, చిరాయువూ నిరవధి సుఖమూ అనుభవిస్తూండి త్యాగరాజ బంధువులైన వాళ్లెందరో, ప్రేమ అత్యధికం కాగా నామం తల్చుకునే వాళ్లెందరో, రామభక్తుడైన త్యాగరాజు నుతించే రాముడికి యథార్థ దాసులైన వాళ్లెందరో, ఆ మహానుభావులందరికీ నేను వందనాలు అర్పిస్తున్నాను.



### జస్ట్ ఫర్ ఫన్

ఒకావిడ డాక్టర్ దగ్గరికెళ్ళింది.

"చెప్పండమ్మా... ఏమిటి మీ కంప్లయింట్లు?" డాక్టర్ అడిగాడు.

"దగ్గు, జలుబు, జ్వరం, వీపులో నొప్పి, కాళ్ళవాపులు..." ఆమె చెప్పుకుంటూ పోతోంది.

డాక్టర్ ఒక్కటొక్కటే నోట్ చేసుకుంటూ, "మీ వయసెంతమ్మా" అని అడిగాడు.

"ముప్పై ఒకటి"

"మతిమరుపు కూడా" అని డాక్టర్ నోట్ చేసుకున్నాడు.

-గోపి



# శ్రీ త్యాగరాజ ఘనరాగ పంచరత్న కీర్తనలు

**మాఘ బహుళ పంచమి (ఫిబ్రవరి 2, 2002) త్యాగరాజస్వామి ఆరాధనోత్సవం సందర్భంగా...**

## 1. జగదానందకారక - నాటరాగము - ఆదితాళము

### సాహిత్యము :

ప: జగదానందకారక జయ జానకీ ప్రాణనాయక ॥జగ॥

అ: గగనాధిప సత్కులజ రాజరాజేశ్వర
సుగుణాకర సురసేవ్య భవ్యదాయక సదా సకల ॥జగ॥

చ: అమరతారక నిచయ కుముదహిత పరిపూర్ణా నఘ
సుర సుర భూజ దధిపయోధి వాసహరణ
సుందర తర వదన సుధామయవచోబృంద గోవింద
సానంద మావరాజరాప్త శుభక రానేక ॥జగ॥

2. నిగమనీరజా మృతజ పోషకానిమిష వైరి
వారిదసమీరణ ఖగతురంగ సత్కవిహృదాలయ
అగణిత వానరాధిప నతాంఘ్రి యుగ ॥జగ॥

3. ఇంద్రనీలమణి సన్ని భాపఘన - చంద్ర సూర్య నయనాప్రమేయ వా
గీంద్రజనక సక లేశ శుభ్రనా - గేంద్రశయన శమనవైరి సన్నుత ॥జగ॥

4. కరధృతశరజాలాసుర మదాపహరణావనీ సురసురావన
కవీనబిలజమౌని కృతచరిత్ర సన్నుత శ్రీ త్యాగరాజనుత ॥జగ॥

5. సృష్టి స్థిత్యంతకారక అమితకామితఫలదాసమాన గాత్ర
శచీపతి సుతాబ్ది మదహర అనురాగ రాగరాజిత కథాసారహిత ॥జగ॥

6. పాద విజిత మౌనిశాప సవపరి-పాల వరమంత్ర గ్రహణలోల
పరమశాంత చిత్త జనకజాధిప-సరోజ భవ వరదాఖిల ॥జగ॥

7. పురాణపురుష స్వవరాత్మజాశ్రిత పరాధీన ఖరవిరాధరావణ
విరావణానఘ పరాశర మనోహరావికృత త్యాగరాజసన్నుత ॥జగ॥

8. సజ్జన మానసాబ్ధి సుధాకర కుసుమ విమాన సురసారిపుక రాబ్జ
లాలితచరణ అవగుణా సురగణ మదహరణ సనాతనా జనుత ॥జగ॥

9. ఓంకార పంజరకీర పురహర సరోజభవ కేశవాదిరూప
వాసవరిపు జనకాంతక కలాధర కలాధరాప్త ఘృణాకర
శరణాగతజనపాలన సుమనో రమణ నిర్వికార నిగమసారతర ॥జగ॥

10. అగణితగుణ కనకచేల సాలవిదళన అరుణాభ సమాచరణ
అపారమహిమాద్భుత సుకవిజనహృత్సదన సురముని గణ విహిత
కలశనీరనిధిజారమణ పాపగజనృసింహ వరత్యాగరాజాదినుత ॥జగ॥

## 2.దుడుకు గల - గౌళరాగము - ఆదితాళము

### సాహిత్యము:

దుడుకు గల నన్నేదొరకొడుకు బ్రోచురా ఎంతో ॥దు॥
కడు దుర్విషయాకృష్టుడై గడియ గడియకు నిండారు ॥దు॥

1చ. శ్రీ వనితాహృత్కుమ దాబ్జ, అవాఙ్మనసగోచర ॥దు॥

2. సకల భూతముల యందు నీవై యుండగా, మది లేక బోయిన ॥దు॥

3. చిఱుత ప్రాయముల నాడే భజనామృత రసవిహీన కుతర్కుడైన ॥దు॥

4. పరధనములకొఱకు నొరులమది కరగబలికి కడుపునింప తిరిగినట్టి ॥దు॥

5. తనమదిని భువిని సౌఖ్యపుజీవనమె యనుచు సదాదినములు గడిపే ॥దు॥

6. తెలియని నటవిటక్షుద్రులు వనితలు స్వవశ మవుట కుపదిశించి,
సంతసిల్లి స్వరలయంబు లెఱుంగకను శిలాత్ములై సుభక్తులకు సమానమను ॥దు॥
7. దృష్టికి సారంబగు లలనా సదనార్భక సేనామిత ధనాదులను,
దేవాది దేవ నెరనమ్మితిగాకను నీ పదాబ్జ భజనంబు మరచిన ॥దు॥
8. చక్కని ముఖకమలంబును సదా నామదిలో స్మరణలేకనే
దుర్మదాంధ జనుల కోరి పరితాపములచే దగిలి నొగిలి
దుర్విషయ దురాశలను రోయలేక సతతమ పరాధీనయి, చపలచిత్తుడనైన ॥దు॥
9. మానవతను దుర్ల భమనుచు నెంచి, పరమా నందమొందలేక,
మదమత్సర కామలోభ మోహులకు దాసుడయి మోసబోతి గాక,
మొదటి కులజుడగుచు భువిని శూద్రుల పనులు సల్పుచు నుంటిని గాక,
నరాధములనురోయ రసవిహీనమయినను సాధింప తారుమారు ॥దు॥
10. సతులకు కొన్నాళ్ళాస్తికై, సుతులకు కొన్నాళ్ళు
ధన తతులకై తిరిగితినయ్య త్యాగరాజాప్త ఇటువంటి ॥దు॥

## 3. సాధించెనే - ఆరభిరాగము - ఆదితాళము
### సాహిత్యము:

స: సాధించెనే ఓ మనసా ॥సా॥
అ: బోధించిన సన్మార్గవచనముల బొంకుఁ జేసి తా బట్టిన పట్టు
సమయానికి తగుమాటలాడెనే ॥స॥
1. దేవకీ వసుదేవుల నేగించినటు ॥స॥
2. రంగేశుడు సద్గంగా జనకుడు సంగీతసంప్రదాయకుడు ॥స॥
3. గోపీజనమనోరథ మొసంగ లేక నే గేలియు జేసేవాడు ॥స॥
4. వనితల సదా సొక్క జేయుచును మ్రొక్క జేసే పరమాత్ముడదియుగాక,
యశోద తనయుడంచు ముదంబునను ముద్దు బెట్ట నవ్వుచుండు హరి ॥స॥


'సాధించెనే' తెరపై పాడిన నాగయ్య



# శ్రీ త్యాగరాజ ఘనరాగ పంచరత్న కీర్తనలు



# శ్రీ త్యాగరాజ ఘనరాగ పంచరత్న కీర్తనలు

5. పరమభక్తవత్సలుడు, సుగుణపారావారుండాజన్మ మ
నఘు డీ కలిబాధల దీర్చువాడనుచునే హృదంబుజమున జూచుచుండగ
॥స॥

6. హరే రామచంద్ర రఘుకులేశ మృదుసుభాష
శేషశయన పరనారీసోదరాజ విరాజతురగ రాజ
రాజనుత నిరామయాపఘన సరసీరుహదళాక్ష
యనుచు వేడుకొన్న నన్ను తా బ్రోవకను ॥స॥

7. శ్రీవెంటేశ సుప్రకాశ సర్వోన్నత సజ్జనమానస
నికేతన కనకాంబరధర లసన్మకుటకుండల విరాజిత
హరేయనుచు నే పొగడగా త్యాగరాజగేయుడు
మానవేంద్రు డయిన రామచంద్రుడు ॥స॥

8. సద్భక్తుల నడతలిట్లనెనే
అమరికగా నాపూజ కొనెనే, అలుగవద్దనెనే,
విముఖులతో జేర బోకుమనెనే, వెతగల్గిన తాళుకొమ్మనెనే,
దమశమాది సుఖదాయకుడగు శ్రీ త్యాగరాజనుతుడు చెంతరాకనే ॥సాధిం॥

## 4. కనకనరుచిరా - వరాళి రాగము - ఆదితాళము

### సాహిత్యము:

ప: కనకనరుచిరా - కనకవసన నిన్ను ॥క॥

అ: దిన దినమును మనసున చనువున నిన్ను ॥క॥

చ: పాలుగారు మోమున శ్రీయు - పార మహిమదనరు నిన్ను॥క॥

2. కలకలమను ముఖకళగలిగిన సీత ॥క॥
కులుకుచు నోరకన్నులను జూచే నిన్ను ॥క॥

3. బాలార్కాభ సుచేల మణిమయ
మాలాలంకృతకంధర సరసిజాక్ష వర క ॥క॥
పోల సురుచిర కిరీటధర సతతంబు మనసారగ ॥క॥

4. సాపత్ని మాతయౌ సురుచిచే కర్ణశూలమైన మాట వీనుల
చురుక్కున తాళక శ్రీహరిని ధ్యానించి సుఖింపగ లేదా యటు ॥క॥

5. మృగమదలలామ శుభనిటల వరజటాయు మోక్షఫలద
పవమానసుతుడు నీదుమహిమ దెల్ప సీత తెలిసి వలచి సొక్క లేదారీతి నిన్ను ॥క॥

6. సుఖాస్పద విముఖాంబుధర పవన విదేహమానస
విహారాప్త సురభూజ మానితగుణాంక చిదానంద
ఖగ తురంగ ధృతరథాంగ, పరమదయాకర
కరుణారస వరుణాలయ భయాపహరా శ్రీరఘుపతే ॥క॥

7. కామించి ప్రేమమీఱ కరముల నీదుపాద కమలముల
బట్టుకొనువాడు సాక్షి రామనామ రసికుడు కైలాస
సదనుడు సాక్షి, మఱియు నారద పరాశర శుక శౌనక
పురందర నగజాధరజ ముఖ్యులు సాక్షిగాద
సుందరేశ సుఖకలశాంబుధివాసాశ్రితులకే ॥క॥

8. సతతము ప్రేమపూరితుడగు త్యాగరాజ
నుత ముఖజిత కుముదహిత వరద నిన్ను ॥క॥

## 5. ఎందరో మహానుభావులు - శ్రీరాగం - ఆదితాళము

### సాహిత్యము:

ప: ఎందరో మహానుభావులందరికి వందనము ॥ఎం॥

అ: చందురు వర్ణుని యందచందమును హృదయార
విందమున జూచి బ్రహ్మానంద మనుభవించువా ॥ఎం॥

చ: సామగానలోల మనసిజలావణ్య ధన్యమూర్ధన్యు ॥ఎం॥

2. మానస వనచరవర సంచారము నిలిపి
మూర్తి బాగుగ పొడగనే వా ॥ఎం॥

3. సరగున పాదములకు స్వాంతమను
సరోజమును సమర్పణము సేయువా ॥ఎం॥

4. పతితపావనుడనే పరాత్పరుని గురించి
పరమార్థమగు నిజమార్గముతోను బాడుచును
సల్లాపముతో స్వరలయాదిరాగములు తెలియువా ॥ఎం॥

5. హరిగుణమణులగు సరములు గళమున
శోభిల్లు భక్తకోటులిలలో, తెలివితో చెలిమితో
గరుణగల్గి జగమెల్లను సుధాదృష్టిచే బ్రోచువా ॥ఎం॥

6. హొయలుమీఱ నడలుగల్గు సరసుని సదా
కనుల జూచుచును, పులక శరీరులయి యానంద
పయోధినిమగ్నులయి ముదంబునను యశముగలవా ॥ఎం॥

7. పరమభాగవత మౌనివర శశివిభాకర సనకసనందన, దిగీశ
సురకింపురుష కనక కశిపు సుత నారద తుంబురు, పవన సూను
బాలచంద్రధర శుక సరోజభవ భూసురవరులు, పరమపావనులు
ఘనులు శాశ్వతులు కమలభవ సుఖము సదానుభవులుగాక ॥ఎం॥

8. నీ మేనునామ వై భవమ్ములను నీపరాక్రమ ధైర్యముల శాంతమా
నసము నీవులను వచన సత్యమును రఘువర నీయెడ సద్భక్తియు
జనించకను దుర్మతములను కల్ల జేసినట్టి నీమది
నెఱింగి సతతంబునను గుణభజనానందకీర్తనము సేయువా ॥ఎం॥

9. భాగవత రామాయణగీతాదిశృతిశాస్త్ర పురాణపుమర్మములన్
శివాది షణ్మతముల గూఢములన్ ముప్పది ముక్కోటి సురాంత
రంగముల భావమ్ముల నెఱిగి భావరాగలయాది సౌఖ్యముచే
జిరాయువుల్ గలగి నిరవధి సుఖాత్ములై త్యాగరాజాప్తులైనవా ॥ఎం॥

10. ప్రేమ ముప్పిరిగొనువేళ నామమును దలచేవారు
రామభక్తుడైన త్యాగ రాజవినుతుని నిజదాసులైనవా ॥ఎం॥



శ్రీ త్యాగరాజ ఘనరాగ పంచరత్న కీర్తనలు



'ఎందరో మహానుభావులు' దృశ్యం
త్యాగయ్యగా నాగయ్య, తదితరులు




# మ్యూజిక్ టేపుల‌కి అటేపు ఇటేపు బాపు




నాకు ఖాన్ సాహెబ్ శ్రీ బడేగులాం ఆలీ సంగీతాన్ని పరిచయం చేసినది మిత్రులు శ్రీ పి.బి.శ్రీనివాస్. నాకు సంగీతంతో శాస్త్రీయంగా ఏవిధమయిన పరిచయం, జ్ఞానం లేక పోయినా -వెంటనే బడేగారి ఠుమ్రీలు 78 ఆర్.పి.యమ్. మొత్తం సెట్టు కొనిపించేశారు. మూడు నిమిషాల్లో రాగప్రస్తారం యావత్తూ బడే ఎలా చెప్పారో పి.బి.యస్. పాడి వినిపించేవారు. అంతే కాదు, ఆయన గురించి నాకు కొన్ని విశేషాలు చెప్పి ఆసక్తి రేకెత్తించారు.

బడే మద్రాసులో విడిది చేసినపుడు విడిదికి మధ్యాహ్నం జి.యన్.బి., యమ్.యల్. వసంతకుమారి మొ॥ హేమా హేమీలు చేరేవారట. ఖాన్ సాహెబ్ నిద్ర లేచివచ్చి అందరికీ స్వహస్తాల తో టీ, పాన్ ఇచ్చి ఒళ్ళో సుర్ మండల్ అమర్చుకుని కూచునే వారట. వచ్చిన వారు అపూర్వ రాగాల ఆరోహణ, అవరోహణ చెప్తే, కొంతమంది తెచ్చిన పాటలను ఆ రాగాల్లో అప్పటికప్పుడు వరసకట్టి పాడేవారట. (ఆయన 'సబ్‌రంగ్' అనే పేరుతో పాటలు రాశేవారు).

ఆయన ఒకసారి ఓ బుల్లి సంస్థానంలో మరింత బుచ్చి రాజుగారి సమక్షంలో రాత్రి గాన కచేరీ చేశారట. పొద్దున్నే రాజుగారి దర్శనార్థం వెళ్ళారు. గంట తరువాత దర్శనం దొరికి లోనికెళ్ళారు. రాజాగారు 'ఏవిటి సంగతి?' అన్నారు. 'అదే.. బయలుదేరుతున్నా' అన్నారు బడే. రాజాగారు- 'శుభం.. వెళ్ళు' అన్నారు. 'రాత్రి పాడినందుకు ఏదైనా ఇనాం ఇస్తారేమోననీ...' అని బడే నసిగారట. రాజాగారు తెల్లబోయి - 'ఇది బావుంది - విన్నందుకు నువ్వు నాకు ఇవ్వాలి - వెళ్ళెళ్ళు' అన్నారట.

మరోమారు టాంగా ఎక్కుతూంటే బండి వాడు -'సామీ వెనకాలే ఉండి అటే ఎక్కండి - ముందుకి మాత్రం రావద్దు. గుర్రం మిమ్మల్ని చూస్తే బెదురుద్ది' అన్నాట్ట. (ఖాన్ సాహెబ్ భారీ శరీరంతో పెద్ద పెద్ద మీసాల్తో వుండేవారు). ఇవి వారే స్వయంగా చెప్తూ తెగ నవ్వేవారుట.


బడేగులాం ఆలీ

ఆ రికార్డులు అన్నీ విన్నాక బడే అభిమానులం కాకుండా ఉండడం మా తరమా? శివాజీ గణేశన్ సోదరుని పెళ్ళి కార్యక్రమంలో ఖాన్ సాహెబ్ కచేరీ పెట్టారు. నేనూ రమణ గారూ కుర్రాళ్ళం - ఎలా లోనికి వెళ్ళడం? గేటు దగ్గర నించుని, కారు దిగి ఓ పెద్ద కుటుంబం లోపలకెడుతూంటే వారి వెనకాలే - గేట్‌క్రాష్ చేసేశాము.

నేను లా కాలేజీలో చదువుతున్నప్పుడు పక్కన అన్నామలై చెట్టియార్ హాల్‌లో కచేరీ చేసి సభికుల్ని ఉర్రూతలూగించారు. ప్రథమంగా మన సాంప్రదాయం ప్రకారం 'హంసధ్వని రాగమ్' అని అనౌన్స్ చేసి పాడారు. మరోసారి కృష్ణగాన సభలో 'సునియో నందకుమార' అని భైరవిలో పాడి హాలంతటినీ పాములను ఆడించినట్లు - కళ్ళు మూయించి - ఊగించగా నేను చూశాను.

నేను 'ఎఫిషియెంట్ పబ్లిసిటీస్' అనే ఏడ్ కంపెనీలో పనిచేస్తున్నపుడు (63 ప్రాంతాలలో) జరిగినదోటి గుర్తొస్తోంది. ఈ కంపెనీ క్లయింటయిన బెస్ట్ కంపెనీ మేనేజర్ గారు సంగీత ప్రియుడు. ఆ రోజుల్లో టేప్ రికార్డర్ (స్పూల్ టేప్)లలో మేటిదయినది ఆయన వద్ద రెండు వుండేవి. ఇటు కర్నాటకం అటు హిందుస్థానీ కచేరీలు రికార్డ్‌చేసి వుంచుకునేవారు. గొప్ప కలెక్షన్ వుండేది. నేను బడే భక్తుణ్ణని తెలుసు. ఒక రోజు ఫోన్ చేసి - 'ఒక కొత్త టేపు తీసుకుని మా యింటికి రా' అన్నారు. వెంటనే ఒక స్పేర్ టేప్ కొని వారింటికి పరిగెట్టాను. ఆయన-'నేను ఖాళీ టేపులు కావలసివచ్చి కొన్ని చెరిపేస్తున్నా. నువ్వు గుర్తొచ్చావు ఎరేజ్ చేద్దామనుకున్న వాటిలో ఒక బడే గులాం ఆలీ టేపుంది. అందువల్ల ఆ కొత్త టేపు ఇచ్చి ఈ బడే టేపు తీసుకో' అన్నారు. నా ఆనందం చెప్పనక్కరలేదు. టేపు ఇస్తూ 'నేనింకా ఏదైనా డబ్బివ్వమంటారా' అనడిగాను. మన, "అక్కర్లే-నీ ముఖంలో వెలిగే ఆనందం చూశా, అది చాలు" అన్నారు.

బడే గులాం ఆలీ ఆఖరి రోజుల్లో హైదరాబాద్ బషీర్‌బాగ్ బేగం గారింట్లో ఉండి అక్కడే కైవల్యం పొందారు. అపుడు (68లో) హైదరాబాద్‌లో 'బంగారు పిచిక' తీస్తున్నాము. ఆయన పోయిన సంగతి అసలు తెలీదు. ఏదో



బడేగులాం తన కుటుంబ సభ్యులతో తీయించుకున్న అరుదైన ఒకఫొటో. పక్కనకూర్చున్నవారు భార్య, వెనుక నిలబడినవారు పెద్దకొడుకు కరామత్, కోడలు. కిందకూర్చున్నది చిన్నకొడుకు మున్వర్



మద్రాసులోని తన ఆఫీసులో బాపు

కొట్టుకెళితే సరుకు కట్టిన పాకెట్ మీద న్యూస్ చదివి గుండె ఝల్లుమంది.

బేగం గారింట్లో ప్రయివేట్‌గా పాడిన స్పూల్ టేప్స్ వున్నాయని విని పరిచయాలు చేసుకుని ఆవిణ్ణి కాపీ చేసి యిమ్మని ప్రార్థించాను. వెళ్ళినపుడల్లా ఎంతో తియ్యగా కబుర్లు చెప్పి బుల్లి క్రిస్టల్ గ్లాసుల్లో జాస్మిన్ టీ ఇచ్చి మాయ చేసేది గానీ ఖాన్ సాహెబ్ సంగీతం మాత్రం ఇవ్వలేదు. ఆవిడ ఇపుడు లేదని విన్నాను. ఆవిడని బషీర్ బాగ్ బేగం అంటారు. ఆ వీధికి బడే గులాం ఆలీఖాన్ పేరుపెట్టారు స్మృతి చిహ్నంగా.

'అందాల రాముడు' సినిమాలో జనతా



'అందాల రాముడు'

కాలనీలో బామ్మ గారింటికి లత కారులో వచ్చినపుడు మధ్యాహ్నం పూట రేడియోలోంచి నేపథ్యంలో ఖాన్ సాహెబ్ బడే గులాం ఆలీ గారి 'యాద్‌పియా' ఠుమ్రీ వినిపిస్తూ ఉంటుంది. గమనించకపోయివుంటే ఈ సారి గమనించండి.

బడే పాటను తక్కువగానే ఉపయోగించుకున్నా మెహదీహసన్ పాటలను బాగానే ఉపయోగించుకున్నాను.

షా ఎన్‌షా గజల్ శ్రీ మెహదీ హసన్ సంగీతాన్ని కూడా మిత్రులు పి.బి.శ్రీనివాస్ గారే పరిచయం చేశారు. రెండు ఇ.పి. రికార్డ్స్ తెచ్చిపెట్టారు. అవి విని పిచ్చెత్తి పోయింది - మధ్యాహ్నం పూట పాకిస్తాన్ రేడియో పెట్టుకుని గజల్ వచ్చినపుడల్లా టేప్ చేసుకునే వాణ్ణి. (అపుడు క్యాసెట్‌లు లేవు - స్పూల్ టేపులే) ఆయన కంఠానికి అడ్డొస్తోందని మధ్య వచ్చే లింక్ మ్యూజిక్ పాజ్ పెట్టి డిలీట్ చేసి పాట మాత్రం రికార్డు చేసుకునే వాణ్ణి. మెల్లిగా వారినీ వీరినీ అడిగి దొరికేవన్నీ పోగుచేసేశాను. కీ॥శే॥ దాశరథి గారు హైదరాబాదులో మోహన్ హెమ్మాడి అనే రసికుణ్ణి పరిచయం చేశారు. ఆయన మెహదీ గారి కెనడా అమెరికా మొ॥దేశాల్లోని ప్రయివేట్ మెహఫిల్స్ (అంటే ఇళ్ళల్లో రాత్రిపూట కబుర్లు చెబుతూ పాట సోయగాలని ఎక్స్‌ప్లేన్ చేస్తూ సాగించే బుల్లి ఇన్‌ఫార్మల్ కచేరీలు) టేపులు - అద్భుతమైనవి - ఇచ్చారు. ఇలా నూటయాభై గంటల దాకా సంపాదించాను. బొమ్మలు వేస్తున్నపుడు (సినిమాలు తీసి పోస్ట్ ప్రొడక్షన్ చేసేటపుడు తప్ప ఎప్పుడూ బొమ్మలు వేస్తూనే ఉంటాను) మిగతా సంగీతంతోబాటు మెహదీ హసన్ సంగీతం ఎక్కువగా వినడం అలవాటు. ఎపుడూ నిత్య నూతనంగా వుంటాయి.

ఓ మారు కీ॥శే॥ ఓలేటి వెంకటేశ్వర్లు గారు (వారికి ఛోటా గులాం ఆలీఖాన్ అని బిరుదు) మాయింటి కొచ్చి మెహదీ గజల్స్ పెట్టమన్నారు. గంటసేపు మాటా పలుకూ లేదు. కళ్ళు మూసుకుని వింటున్నారు. ఒక గజల్ వింటూ 'ఇది ఏ రాగమండీ?' అని అడిగాను. ఆయన కళ్ళు తెరిచి 'వానికి రాగం ఏమిటీ? వాడు పాడుతూంటే రాగం వెనక చక్కా వస్తుంది' అని మళ్ళీ కళ్ళు మూసుకుని వినడం మొదలెట్టారు.

రాగం గురించి ఓ తమాషా చెప్పాలంటే మెహదీ ఫేమస్ గజల్ ఒకటి 'అబ్ కె హం బిఛడే' చరిత్ర చెప్పాలి. దాని రాగం ఆయనకే తెలీదట! ఒకనాడు రేడియో స్టేషన్‌లో 'భూపాలీ' రాగం పాడి టాక్సీలో హోటల్‌కి వచ్చారు. భోయనం మరో గంట ఆలస్యం అని విని సుర్ మండల్ తీసి మీటారు. భూపాలీ శృతి చేసినది మరోలా పలికింది! కారు కుదుపు వల్లనేమో! ఆయన మాటల్లో "తీవ్ర్ సే కోమల్ హోగయా ధైవత్!" దానికి జఫర్ గజల్ "అబ్ కె హం బిఛ్‌డే" జోడించి ఆలాపిస్తే భావం అద్భుతంగా కుదిరిందిట! రాత్రంతా అదే పాడుతూ కూచున్నారట.

మద్రాసు వచ్చిన సి.రామచంద్ర గారిని కలుసుకున్నపుడు ఆయన చెప్పారు- ఆయనా మొదటి సారి ఆ గజల్ విని మతిపోయి



పల్లెమేలుకుంది - స్నేహం

లూప్‌లాగా అదే మరల మరల వేసి వింటూ వుండిపోయారట. ఇంటివాళ్ళు నిజంగా మతి పోయిందనుకుని ఆస్పత్రిలో చేరిపించారట.

'స్నేహం' సినిమాలో 'మామ' 'పల్లె మేలుకుందీ రేపల్లె మేలుకుందీ వెలుగు మేలుకుందీ మీగడ పెరుగు మేలుకుందీ' అనే సినారే రచన-



పోనీరా పోనీరా - స్నేహం

యస్.పి.బాలు పాట ఈ ఛాయలోనే వరస చేశారు (ముఖ్యంగా పాట ముందు ఆలాపన).

అలాగే 'స్నేహం'లో 'పోనీరా పోనీరా' అనే ఆరుద్ర రచన యస్.పి.బాలు గానం, మెహదీ గారి 'రోషన్' అనే పట్‌దీప్ గజల్ ఛాయలో చేశారు. 'నవ్వు వచ్చిందంటే కిలకిల' పాట (బాలు గారిది



నవ్వువచ్చిందంటేకిలకిల-స్నేహం

- ఆరుద్ర రచన) 'చల్ చల్‌రే' అనే మెహదీ పాట ఛాయ. "బాత్ కరనీ' అనే జఫర్ ఆలీ 'పహాడీ'



ఏదో ఏదో అన్నదీ - ముత్యాలముగ్గు

గజల్ 'ముత్యాల ముగ్గు'లో 'ఏదో ఏదో అన్నదీ' ఛాయ. మళ్లీ 'రాధా కళ్యాణం'లో మెహదీ గారి 'గుంఛయే' అనే పాట ఛాయ-సినారే బాలు గారు 'కలనైనా' - ప్రొడ్యూసర్ 'వద్దు మొర్రో క్లాసికల్' అని నెత్తి కొట్టుకుంటున్నా పెట్టించేశాను.

'స్నేహం'కు సంగీతం సమకూర్చిన 'మామ' (కె.వి.మహదేవన్) తన గురించి గాని తన సంగీతం గురించి గానీ ఎప్పుడూ ఏమీ మాట్లాడే వారు కారు. ఈ రాగం ఏమిటి మామా! అనడిగితే 'నాకేమీ తెలీదు- నాకు వచ్చిందే ఆరు రాగాలు' అనేవారు. అంత మోడెస్ట్! 'స్నేహం' ఒక్కదాని గురించే -'దీనిలో పాటలు బావున్నాయి కదూ బావూ' అనేవారు. ఇంకో తమాషా చెబుతాను.

"సమ్మర్ ఆఫ్ 47" అనే హాలీవుడ్ సినిమా థీమ్ మ్యూజిక్ నాకు మహా ఇష్టం. 'పెళ్ళి పుస్తకం' సినిమాకి క్లయిమాక్స్ మ్యూజిక్‌గా బావుంటుందని 'మామ'కి వినిపించాను. ఆయన శ్రీ పుహళేంది గారికి వినిపించమన్నారు. ఆయన నవ్వి - 'సరే అలాక్కానీ' అన్నారు. 'నాకు ఈ మ్యూజిక్ వినగా వినగా ఇంకా ఇంకా బావుంటుంది ఎంచేతంటారు ' అన్నా.

పుహళేంది గారు - అవి మన 'సారమతి' రాగం ఛాయలు. అందుకే మీకు హత్తుకుని ఉంటుంది అన్నారు. 'మోక్షము గలదా భువిలో' అన్న త్యాగ రాజ కృతి సారమతి. ఈ సందర్భంలోనే ఆర్కెయిస్ట్రయిజేషన్ గురించి ఇంకో సంగతి చెప్తాను -

'వంశ వృక్షం' సినిమాలో - సోమయాజులు గారు పచ్చి ఛాందస సాంప్రదాయకుడు. యంగ్ విడో అయిన కోడలు (ఒక పిల్లాడి తల్లి) మారు పెళ్ళి చేసుకుంటుంది. మావగారి కిష్టం లేదు. కోడలు ఒకరోజు పట్నంనుంచి మావగారి గ్రామం వస్తుంది - కన్నబిడ్డను తీసుకుని వెళ్ళడానికి. ఆరోజే తన మొదటి భర్త తద్దినం చేస్తూవుంటారు. ఇంటిల్లిపాదీ ఆమెను అసహ్యించుకుంటారు గానీ మావగారు ఆదరిస్తాడు. తనకు తన పసిబిడ్డ కావాలని అడుగుతుంది.

ఆయన -"చూడమ్మా -నాకు ఆ మనుమడు తప్ప వారసుడు లేడు.

కలనైనా - రాధా కళ్యాణం





'వంశవృక్షం'

ఇహ పుట్టరు. నా ఇంటి పేరు నిలబెట్టేది వీడొక్కడే! నువ్వు మళ్ళీ పెళ్ళి చేసుకున్నావు కనుక నీ ఇంటిపేరు వేరయింది. నువ్వు ఈ బిడ్డని తీసికెళ్ళిపోతే నీ కొత్త ఇంటి పేరే వస్తుంది వాడికి. నా వంశం అంతరించిపోతుంది. కానీ తల్లిగా నిన్ను గౌరవించి డెసిషన్ నీకే వదులుతున్నాను. పైన బిడ్డ పడుకుని వున్నాడు. నీ ఇష్టం అయితే తీసికెళ్ళు" అని పైకి పంపుతారు. పసిబిడ్డ నిద్రపోతూ వుంటాడు. పక్కనే అమ్మాయి (జ్యోతి) వచ్చి పడుకుంటుంది. దుఃఖం పొంగుకొస్తుంది. మావగారి విశాల హృదయం గుర్తుకొచ్చి వెక్కి వెక్కి ఏడుస్తుంది. చివరికి బిడ్డని తీసుకోకుండా వెళ్ళిపోతుంది.

ఈ ఘట్టానికి డైలాగులు లేవు (రచన రమణ గారు) కేవలం విజువల్స్. దీనికి మ్యూజిక్ ప్రాణం. నేను "మిడ్‌నైట్ ఎక్స్‌ప్రెస్" అనే సినిమా థీమ్ మ్యూజిక్ సరిగ్గా అతుకుతుందనుకున్నా, 'మామ'కి వినిపించాను ఆయన నవ్వేసి' సరి బాపూ - కానీ ఈ ఆర్కెస్ట్రయిజేషన్ మనం చేయించలేము ఒరిజినలే అతికించెయ్" అన్నారు.

మళ్లీ మెహదీ విషయానికి వస్తే పైన చెప్పిన 'అబ్‌కే హం బిఛడే' పాట విని వీణ బాలచందర్, మన్నాడే మొదలైన వారు కూడా త్రిల్ అయిపోయారట.'78లో మద్రాసు వచ్చినపుడు మెహదీ గారు అడిగిన కర్నాటక సంగీతం మీద ఓ పెద్ద గ్రంథంతోబాటు వీణ బాలచందర్ గారు ఎల్.పి.రికార్డ్సులో మేళకర్త రాగాలు ఆరోహణ అవరోహణలు వాయించిన సెట్టు ఇచ్చాను. ఎటొచ్చీ బాలచందర్ గారు రికార్డు కవర్లమీదా అట్ట పెట్టె మీదా మార్కింగ్ పెన్‌తో గాడ్ బ్లెస్ మెహ్‌ది ది గ్రేట్ అంటూ అడ్డంగా నిలువుగా సంతకాలు పెట్టేశారు.

వీణబాలచందర్ గురించి ఓ జోకు - మా స్నేహితుల్లో ఆశ్శెగాడొకడు. ఆయన గురించి ప్రస్తావన వస్తే "ఎవరూ ఆ వీణా రాక్షసుడా?' అనేవాడు. 'తప్పు పెద్దలని అలా అనకూడదు మహా పండితుడు' అని



ఎస్.బాలచందర్

కొప్పడేవాళ్ళం. వాడు 'తప్పేమన్నాను - వారు వీణ జైంట్ కాదా - ఎటొచ్చీ యుద్ధాని కెడుతున్నట్టు వయొలెంట్‌గా బరికేస్తుంటే అలా అనిపించింది' అని పారిపోయాడు.

78లో మద్రాసులో మెహదీ గారి కచేరీ పెట్టినపుడు ఎకూస్టిక్స్ నరిచూసేందుకు యస్.పి.బాలు గారు కాస్త ముందుగానే మెహదీని కారులో హాలుకి తీసుకెళ్ళారు. ట్రాఫిక్ జంక్షన్‌లో కారాగినపుడల్లా హోటళ్ళలో వినిపించే రేడియోలోని ఫోక్ సంగీతం శ్రద్ధగా మాటలాపి వినేవారు మెహదీ.



మెహదీ హసన్

నేను గజల్స్ ఎంజాయ్ చేయడం గురించి చెప్పాలంటే - ' నాకు తెలుగే సరిగ్గా రాదు సంస్కృతం నిల్లు' అని అందాల రాముడులో రాజబాబు అన్నట్టు నాకు ఉర్దూ, హిందీ నిల్లు. ఇది మెహదీ విని 'ఏమిటీ నీకు గజల్స్ భాష అర్థం కాదా! కేవలం సంగీతం మాత్రమే ఇంత ఇష్టమా!' అని బోలెడు ఆశ్చర్యపడిపోయారు.

వీలు చూసుకుని 'వాట్ ఈజ్ యువర్ డేట్ ఆఫ్ బర్త్ సర్' అనడిగా'. 'ఫిఫ్టీంత్ డిశంబర్-ఆప్‌కా?' అనడిగారు. 'ఐయామ్ ఆల్సో 15 డిశంబర్ 1933 సర్ అన్నా'. ఆయన "ఐయామ్ తర్టీ ఫోర్. ఒన్ ఇయర్ ఓల్డెర్ ద్యాన్ యు" అన్నారు నవ్వుతూ.

ఆయన చోళా హోటల్‌లో దిగారు. హోటల్ వారు 'వుయ్ ఆర్ ప్రౌడ్ టు హోస్ట్ షాహెన్ షా ఆఫ్ గజల్' అని బయట పెద్ద బేనర్ కట్టుకున్నారు. ఆ కచేరీ టైమ్‌లో స్పాన్సర్స్ మిస్ బిహేవ్ చేసినందువల్ల ఎయర్ పోర్ట్ కి కారు సౌకర్యం లేకపోయింది. ఆయన్ని నా కారులో దింపే భాగ్యం నాకు కలిగింది. దారిలో పాన్ కావాలన్నారు. టి.నగర్‌లో ఓ చిన్న పాన్ షాప్ దగ్గర ఆపి పాన్ తీసుకున్నారు.

అక్కడ నుంచీ హైదరాబాద్ వెళ్ళారు. మా స్నేహితుడు పోలీసెంకటసామి అనబడే సదాశివరావు పోలీసు హోదాలో విమానం మెట్లదాకా తీసుకెళ్ళిపోయాడు. ఆయన దిగ్గానే వలువురితో బాటు నాకూ ఆయనకి పాదాభివందనం చేసే అదృష్టం కలిగింది. కారులో వస్తూ ఆయన చెప్పిన ముచ్చటొటి మిత్రులు అనువదించి చెప్పారు.

ఆయన చిన్న తనంలో వారి తండ్రి ఓ జమీందారు ఆస్థానంలో తోటమాలిగా వుండేవారట. రాజుగారు భోంచేసేటపుడు అన్నంమీద పల్చటి బంగారం - వెండి రేకులు పరిచే వారట. అవి వేడికి కరిగి అన్నంలో కలుస్తాయి. పూర్తిగా కరిగే వరకూ ఓపికలేక - రాజుగారు ఆ మిగిలిన రేకులను వుండలుగా నలిపి కిటికీలోంచి బయటకు విసిరేవారట. చిన్న మెహదీగారు తోటి పసిపిల్లలూ వాటితో గోళీ కాయలు ఆడుకునే వారట.

ఇది జరిగుండచ్చు-వుండక పోవచ్చు గానీ ఆయన ఊహ ఎంత అందమైనది! ఆయన సంగీతమంటే అదీ! అనుభవించి భావప్రధానంగా పాడతారు. చరణం చరణానికీ పాటల సొగసూ భావమూ చెప్తూ కవిగారి పేరు చెప్పి, ఓహో-ఆహా 'క్యా బాత్ హై' అంటూ మురిసిపోయి అప్పుడు పాట అందుకుంటారు.

మెహఫిల్స్‌లో ఆయన చెప్పిన మరో జోకు. పాకిస్తాన్‌లో నూర్జహాన్‌ని అంతా గౌరవంగా మేడమ్ అని పిలుస్తారట భర్తతో సహా. ఇక్కడ నూర్జహాన్ గురించి కాస్త చెప్పాలి. ఆవిడే ఒకపుడు (అంటే దేశవిభజన తర్వాత పాకిస్తాన్‌కి వెళ్లిపోకముందు) హిందీ వెండి తెరను ఏలిన తార + గాయని. 'అన్‌మోల్ ఘడీ' గుర్తుందా? లతా మంగేష్కర్ అంత ఆవిడ శ్వాస చప్పుడు లేకుండా మైకు ముందు పాడే పద్ధతి నూర్జహాన్ రికార్డులు పదే పదే విని నేర్చుకునేదట -(అన్నట్టు బడే గులాం ఆలీ లతా మంగేష్కర్‌ని 'శృతీకీ (కే?) అవతార్' అని మెచ్చుకుంటే లతా- మెహదీ హసన్ గొంతుకలో భగవంతుడున్నాడని మెచ్చుకుంది. ) కొన్నేళ్ళ క్రితం నూర్జహాన్ లతా కలుసుకుని ఇద్దరూ పాడగా విన్న వాళ్ళదే అదృష్టం, పుణ్యం.



నూర్జహాన్

మెహదీ గారి జోక్ ఏమిటంటే నూర్జహాన్, తను ఒకప్పుడు గ్లామర్ క్వీన్ అన్నమాట మరచిపోలేదు. ఆవిడ ఏ ఫంక్షన్‌కి వచ్చినా తన వయసు కిందటి సారి కన్నా తగ్గించి చెప్పేదట ఒక పార్టీలో - తన వయసు 48 అంటే నెక్స్ట్‌ఫంక్షన్‌లో 45కి



మెహదీ హసన్ బొమ్మగీసి ఆటోగ్రాఫ్ చేయించుకున్నారు బాపు

తగ్గించేసేదట. ఆ తరువాత 40. ఇలా 32కి వచ్చేసరికి ఆమె భర్త "మేడమ్ - ఈ లెక్కన మీరు జన్మ స్థలానికి వెళ్ళిపోయేట్టున్నారు' అన్నారట!

మెహదీ గారు కచేరీ చేస్తూ -'ఎదురుగా అరేబియన్ భాయి వున్నాడు అంటూ అరబ్ పాట అందుకుంటారు. రాజస్థాన్ వారిని చూస్తే దోహా అందుకుంటారు. పంజాబీని చూస్తే - పంజాబీ పాట - బంగ్లా ఆయన్ని చూస్తే బెంగాలీ పాటొటి అందుకుంటారు. మన ప్రధాని వాజ్‌పేయి గారి పరిపాలన ఎలావున్నా ఆయన మెహదీ హసన్ అభిమాని అవడం చాలా గొప్ప వాడే అనిపిస్తుంది.

మెహదీ గారు ఆ మధ్య స్ట్రోక్ వచ్చి ఆస్పత్రిలో చేరారని తెలిసి చాలా బాధ కలిగింది. ఆ మధ్య హైదరాబాదులో 'సదా - ఎ - ఇష్క్' అనే ఆల్బమ్ హరిహరన్‌చే రిలీజ్ చేయించారు. ఎంత పేతటిక్‌గా ఉందంటే - సిక్ బెడ్ వద్దకు మైక్ తీసికెళ్ళి రికార్డు చేయించారా అనిపించింది.

సంగీత సార్వభౌములు పద్మభూషణ్ బడే గులాం ఆలీఖాన్, మెహదీ హసన్ల సంగీతం పరిచయం చేసి వాటిలోని సొగసులన్నీ తెలియజెప్పిన మిత్రులు పి.బి. శ్రీనివాస్ గారికి, అనేక కేసెట్ల సంగీతం ఇచ్చిన మోహన్ హెమ్మాడీ గారికీ కృతజ్ఞతలు చెప్పుకోవాలంటే ఈ జన్మంతా చాలదు. గాడ్ బ్లెస్ దెమ్.

నేను ముందు చెప్పిన బడే ఆలీ ప్రయివేట్ సంగీతం నా కెవరేనా సంపాదించి పెట్టి పుణ్యం కట్టుకుంటే భగవంతుడు వారిని కూడా ఆశీర్వదిస్తాడు.

- బాపు

## ఫిబ్రవరి 1 బ్రహ్మానందం జన్మదిన సందర్భంగా
## హాస్యప్రియులందరి తరపున శుభాకాంక్షలతో... హాసం



RNI Regd.No.APTEL 2001/5503


# Powering the future




## Ideal Power Source for

Tele Communications
Railways
Power Sector
SPV Systems
UPS Systems

MAXLIFE

Result of extensive research supported by Indian Institute of Science Bangalore - in refining the best VRLA Battery System

Maintenance-free operation
Safety
Reliability
Long Life

State-of-the art equipment to drive up process capability
Sophisticated R & D Lab for Product development

NED
ENERGY LIMITED

6-3-1109/1, Navbharat Chambers, Raj Bhavan Road, Hyderabad 500 082
Ph:3400411 Fax: 3408562 www.nedenergy.com